# భారతి

మాసపత్రిక



శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
(1938–1972)



డిసెంబరు 1973

సంపుటము : 50 : సంచిక : 12 :

విడిప్రతి వెల ఒక రూపాయి

# విషయానుక్రమణిక

## డిసెంబరు 1973

# స్వరలహరి

శ్రీ జి. వి. సుబ్బారావు

ఊరిహా వల్లకీ తంత్రి
కవితా కోమలాంగుళీ
స్పందనలో నినదించిన
భావనా జ్యోత్స్న లహరి,—
నా స్వరలహరి!
ముగ్ధశిశు మందహాసంలో
స్నిగ్ధారుణ రాగాలను
మాతృస్తన్య మధువులను
నేత్ర పర్వ సౌందర్య రాశులను
ఒలికించిన మందహాస లహరి,—
నా స్వరలహరి!
వికసించిన సుమ బాలల
ముకుళింపని కోరకముల
చిగురించిన కోరికల
వెలిదార్చెడి భ్రమరగీతి
మధువు లొలుకు కొసరి కొసరి,—
నా స్వరలహరి!
తెలినుర్వుల వయసు పొంగు
సెలయేరుల మనసు పరుగు
పుడమి కడుపు పొత్తిళ్లలో
కడలి బాహు బంధాలలో
సస్య శ్యామల గీతమై
వినీల రమ్యసాగర తరంగమై
వినిపించిన ప్రణయ

మోహన రాగ నిర్ఝరి, -
నా స్వరలహరి!
నిశాంత రమణీయ ప్రశాంతిలో
దిశాంత విపుల మందరాకాశంలో
పండువెన్నెల పిండిపోసిన
నిండు సుధా లహరీ స్నాతుల్లై
చాతకద్వయం జట్టి తేల్చిన
అసందర్భ రతి రాగాలాపన,—
నా స్వర సంకల్పన!
పుడమి కాంత ఋతుస్నాత
జడలు నిండ తడియారక
ధూప గంధ వాసిత యయి,
పుష్ప విభవ శోభిత యయి;
భానుకిరణ పులకిత యయి
జాను తెలుగు మేళవించి
కూని రాగ మాలపించి
పలికిన కల్యాణి రాగం
చిలికిన మధురాను రాగం, -
నా స్వర సాగరం!
చలిత వృక్షాగ్రాలపై
కలిత వనీ దరహాసంలా
లలిత లలిత జ్యోత్స్నా పరిహాసం,
పులకితయామినీ మధురగానంలా
కాననాంతర సంచలిత
పికీ కుహూగాన మాధుర్యం,
హృదయ విపినాంతర
మృదుగళాంతర చలిత
కవితా కోకిలా రావం!—
నా స్వర భావం!
ధమ్మిల్లంలో తారకలు
నెమ్మొగంలో చంద్రికలు

# స్వర లహరి

విరబోసిన కురులా వినీలాంబరం
అరవిచ్చిన కలువలా ముఖారవిందం,
లజ్జా పిహిత నూత్న వధువులా
ప్రజ్ఞా సహిత పరిణత మధువులా
నిశారమణి హృద్గీతం,
ఆశా రమ్య సంగీతం,—
నా స్వర సంగీతం !
గగనాంగన
దిగంతాల వ్యాపించిన
నీలాంబుద కేశపాశంలో
తెలిమబ్బుల మల్లెపూలల్లా
తొలివెన్నెల తేనె చినుకుల్లా
తారకలు జీరాడే
శ్రావణ రాకా హృదంతర
ప్రశాంత నిశీథినీ సంగీతం,—
నా స్వర సంగీతం !
శతకోటి దీన నేత్రద్వయాలు
నిరాశా తిమిరాశ్రు పూరితాలై
విహ్వలించి
మింటికేసి చూసి
చికిలించి నప్పుడు,
శతసహస్ర తారకానయనాలు
సుదూర తిమిరాశా పరివృతాలై
విహ్వలించి
మింటికేసి చూసి
మిణుకు మిణుకు మన్నప్పుడు,
వినిపించిన
అజ్ఞాత జీవన
వేదనా రవం,—
నా హృదంతర రావం !
నిశ్శబ్ద నిశీథినిలో
జడ ప్రకృతి

సడి చప్పుడూ లేక
కునికిపాట్లు పడ్డప్పుడు,
నిశ్చల కాసారంలో
మత్స్య పుచ్ఛ చాలనం
మటుమాయ మై పోయినప్పుడు,
మందమలయ శైత్య
పవన తరంగాల వెల్లువల
భంగ రవాలు అడిగినప్పుడు,
చీకటులు ముంచియెత్తి
ఆకులైన కదలకున్న,
గుహాంతర సుప్త వ్యాఘ్రి
నిడుపు టూర్పు సడియైనను
వినిపింపగ లేనప్పుడు,
తిమిరమ్ములు నింగినుండి
జడివానలు కురిసి కురిసి
అవని సర్వ మావరించి
వెలుగు లెల్ల మ్రింగినప్పుడు,
ఆర్త జనుల గుండెలన్న
కుంపటి తడి బొగ్గులందు
రాజి రాజి మింటి కెగయు
దైన్యధూమ మంబరాల
వ్యాపించిన వేళలపుడు,—
మనసుకె వినిపించినట్టి
నవ సన్నని అంతరాత్మ
చిన్ని పిలుగు,—
నాదు గొంతులోని మ్రోల్గు !
ఊహా వల్లకీ తంత్రి
కవితా కోమలాంగుళీ
స్పందనలో వినదించిన
భావనా జ్యోత్స్న లహరి,—
నా స్వరం హరి !!—

---

# సాహిత్య రసికత

శ్రీ పొట్లపల్లి సీతారామా రావు

ఈ దేశములో సాహిత్య రసికత చచ్చిపోయినది. ఎక్కడ చూచినను శబ్దార్థమాత్ర నిర్ణయ నీరస శుష్క వాగ్వాద కోలాహలములే కాని సాహిత్య రచనలలోని భావనాశక్తికి చొక్కు, రసార్ద్రహృదయము గోచరించుటలేదు: రస సన్నివేశములకు అనుభూతి పొంది పొంగి పరవశించెడి రసజ్ఞత గోచరించుట లేదు. ఉక్తి వైచిత్ర్యమునకు గాని శబ్ద గౌరవమునకు గాని అర్థవిచ్ఛిత్తికిగాని ఆహ్లాదితులైన సహృదయులు లేరు. పాండిత్యమునకు విలువలు మారినవి. రసజ్ఞతకు నిర్వచనములు భిన్నమైనవి. విమర్శనశక్తి కేవలము వంది మాగధ స్తోత్ర ప్రాయముగనో, వ్యక్తిగత నిందా పూరితముగనో మారినది. రచనలలో ఛందస్సుకు తగిన గౌరవములేదు. వాడెడి అలంకారములలో ఆహ్లాద జనకత లేదు అర్థములలో వ్యంగ్య వైభవము లేదు.

'సాధ్యోహి రసోయథా తథం కవిభిః'— అను వచనము మకుటాయమానమైన ప్రధాన సూత్రముగ వక్ర భాష్యములకు తావిచ్చినది. ఈ స్థితిలో నున్న దేశమును రక్షించుట యెట్లు ?— ఈ ప్రశ్న ప్రశ్నగానే మిగిలిపోవు చున్నది. నివారణోపాయము గోచరించుటలేదు.

మన దేశములో పూర్వము ప్రభువులు, జమీందారులు, తెలుగులో పండిత పదవు లలంకరించిన వారు, తెలుగు ఎమ్. ఏ. పట్టభద్రులు—ఈ రసజ్ఞతను చాలవరకు కాపాడుకొనుచు వచ్చిరి. మొన్న మొన్నటివరకు కూడ విశ్వవిద్యాలయములలోని ఎమ్. ఏ. పటభద్రులు తమ రసజ్ఞతను నిరూపించు కొనుచునే వచ్చినారు. ఒకదశాబ్దినుండి చదువుల తీరు తెన్నులు మారినవి. సాహిత్యముపై గౌరవము తగ్గిపోవుచున్నది ప్రజలలో వానిపట్ల ఉత్తేజము, ఉత్సాహము కలిపించెడి తత్త్వజ్ఞులు కరవైనారు. విశ్వవిద్యాలయములలో, భాషా శాస్త్రాధ్యయనము అమదానికి ప్రాధాన్యము వచ్చి, సాహిత్య గౌరవమును ఎంత దిగజార్చనలెనో, అంత దిగజార్చి వదలిపెట్టినది. అసలు పాఠ్య ప్రణాళికయే సంస్కరింప వలసినదై యున్నది. ఇందులో భాషా శాస్త్రముయొక్క ప్రాబల్యము చిన్నచిన్న తరగతులనుండి పిల్లల బుద్ధులపై అధికారము వహించి మేధను ప్రజ్ఞా విషయకముగా పెరుగనీయుటలేదు. కొన్ని కట్టుబడి సిద్ధాంతములు,కొన్ని పట్టులేని తార్కికోక్తులు' కొన్ని మునుగుగప్పిన మేలిమాటల పోహళింపులలో,అది శాస్త్రమన్న అపోహ కల్గించుచు సాహిత్యజిజ్ఞాసను పూర్తిగా త్రుంచివైచినది. ఇక మిగిలిన సాహిత్య నిష్ణాత లున్నారు. వారికి పరమావధి డిగ్రీలు సంపాదించుట. తరువాత పరిశోధనలు చేయుట. గొప్ప గొప్ప పదవులు సంపాదించుట. అంతియేగాని, పట్టుమని పది వాక్యములు వ్రాసి ప్రజలనుత్తేజపరచిన పాపాన పోలేదు. వారి దెంతసేపు, పరిశోధన దృష్టి. ఈ గ్రంథము నందిన్ని తెలుగు పదములున్నవి. ఇన్ని పొల్లులున్నవి. ఇన్ని శకటరేఫములున్నవి. ఈ కవి ఇన్ని వృక్షజాతులను వాడినాడు. ఈ కవిగ్రంథములోని అందగత్తెలు కాళ్లకు పారాణి రాచెడివారు. ఇతని కవిత్వములో అందగాండ్లకు కూడ తెగబారెడు పెండ్రుకలున్నవి. ఈ బాపతు దృష్టి తప్ప కవితా పరమార్థమును తరచి తెలిసికొని పదిమందికి వివరించి ఉత్తేజపరచెడి లక్షణము లేకపోయినది. ఈ పరిశీలనావస్థ

నుండి సాహిత్యమును రక్షించు ప్రయత్నము చేయ వలసిన బాధ్యత అభిజ్ఞులందరిపై మున్నది.

రసజ్ఞుడు, రసికుడు అన్నపదములను కేవలము రసము తెలిసినవాడన్న భావములోనే పూర్వులు వాడుచు రాలేదు. సాహిత్య మర్మజ్ఞుడన్న భావములోనే వాడుచు వచ్చినారు. ఒక్కొక్కసారి కవి రచన తాత్పర్యముతో వ్రాయును, ఒక్కొకసారి ఉక్తి వైచిత్ర్యము కొరకు పాటుపడును. ఒకసారి వర్ణనలు, అలంకారములతోనే రచనకు బిగువు తెచ్చును. మరొకసారి సమాసముల లోని పదముల పొహళింపుతో లగువు గల్పించును. ఒక్కసారి జల్లిపదముల కూర్పుతోనే రచన సాగించి చివరకు ఎక్కడో ఒకసాహిత్య ముద్రకొట్టును. ఈ లగువు బిగువుల మెళకువలు తెలిసికొన్నవాడే సాహిత్య మర్మజ్ఞుడు. లోకములో రసికుడన్నను, రసజ్ఞుడన్నను, వాని యౌగికార్థము లెట్లున్నను రూఢ్యర్థము మాత్రము సాహిత్య మార్మికుడనియే. కవిత్వమును రసవంతముగా మన్నదని చెప్పుట ! గూడ ఈ దృష్టితో చెప్పినదే. సాహిత్యము కవికి సాహిత్య మర్మజ్ఞునకు సంబంధించిన విషయము మాత్రమే. ఇందులోనే తరతమ భేదము లుండవచ్చును. జానపద సాహిత్యములోనైనను ఇంతియే. ప్రజాసాహిత్యములో గాని పండిత సాహిత్యములోగాని ఆస్వాదన అనునది కవి రసికులకు సంబంధించిన విషయము మాత్రమే. సాహిత్య స్పర్శ అనుభవించలేని జీవులును లోకములో నుందురు. వారిని సాహిత్యోన్ముఖులుగా జేయుట బ్రహ్మతరము కాదు.

'పద్మినీ పద్మాత పత్రంబు శిథిల పత్త్రాగ్రమై
 రాయంచ యాశ్రయించె
తాల్ప్రని వత్స్వేద జాలంబులో ఘోణి
 పందల రొంపి గలంచియాడె
దూరోర్ధ్వ మద్దావ ధూమమంబుద బుద్ధి
 నెమ్మిలో పాదమండి నిక్కిచూచె
జఠరస్థ జలము నాసానాళమున బిల్చి
 సామజం బిర్వక్క జల్లుకొనియె
సరసి పైపీరు సలిలశీకరలె, విపిన
వకిల వీథులు నిర్మల గోచ్ఛయము లయ్యె
[illegible] మధ్యాహ్నమిది సుధా మధుర వాణి
యర్హమిచ్చోపథ శ్రమ మపనయింప.'

అగస్త్యుడు భార్య లోపాముద్రతో గలసి తీర్థయాత్రలు చేయు సందర్భమునందలి దీ పద్యము. ఇది మధ్యాహ్నవర్ణన. ఇక్కడ కవి చేసినది వాస్తవిక వర్ణన. ఈ వాస్తవిక వర్ణన చేసెడి కవి చేయి తిరుగని వాడైనచో పద్యము వెలితి వెలితిగానై సాహిత్య ముద్ర చెరిగిపోయెడి అవకాశమున్నది. ఈ కవి ఆలోటు రానీయకుండ చేసెడి ప్రయత్నము; సంఘటనలోను, సమాస రచనలోను, అడుగడుగునను గోచరించు చున్నది. ఈ సీసపద్య పాదములలో పూర్వపు భాగముల సమాసముల స్థానమున తెలుగు పదములు వాడినచో పద్యమునకు రావలసిన బింకము రాదు: పై చరణము లలో, సమాస పాటవములో సొగసులు పోయిన పద్యము. పిత్తు గీతిలో, తెలుగు పదములతో నెట్లు తళతళ లాడినది సహృదయులకు తెలియక పోదు. ఆ మెళకువలు కవికి తెలియును. వానిని పట్టుకొని ఆస్వాదించుట సహృదయు లెరుగుదురు. అందుకే చివరకు 'సహృదయాః ప్రమాణమ్' అనుట.

---

ఇక ఈ పద్యములో రసములేదు. వట్టివర్ణన. మాధ్యాహ్నికమైన జీవస్వభావాన్ని కవి వివరణ చేసినాడు. ఈ జీవస్వభావము ప్రతిమానవుడు నిత్యము చూచుచుండెడిదే. ఎరిగిన విషయమే. కవి చేసిన ప్రయత్నము వలన కొందరిలో ఆ అనుభూతి కలుగదు. కొందరిలోనే ఆ భావము వ్యంజితమగును. ఇదే ధ్వని సిద్ధాంత పరమార్థము, ఆ వ్యంజనా ప్రక్రియలో పరిణతి పొందిన జీవులే సహృదయులు. రసికులు, సాహిత్య మర్మజ్ఞులు. ఇది అగస్త్యుడు లోపాముద్రతో చెప్పిన మట్టము. ఇప్పుడు మధ్యాహ్నమైనది. పథశ్రమ మపనయించు కొననగునని వాక్యార్థము. మాధ్యాహ్నిక వర్ణనలో జంతుకోటి సహజ లక్షణ వికృతిలో ఈ వాక్యార్థము యొక్క ప్రాముఖ్యము గుణీ భూతత్వము పొందినది. అనగా వాక్యార్థ భూతమైన 'పథిశ్రమ పోగొట్టుకొనవలెనన్న' భావమున కంటె మిన్నగా ఈ జంతు స్వభావవర్ణన పాఠకుని హృదయము నాకర్షించు

చున్నది. తెలుగు ప్రబంధములలో ఎక్కువగా ఈ లక్షణము గోచరించు చున్నది. పద్య రచనలో తళతళ ఎక్కువ. భావ స్ఫూర్తిలో గమకము హొయలు కులుకుచుండును. కథా పరమార్థవు తీగె, మసక మసకగా కన్పించును. దీనికి కారణము వారి దృష్టి కేవలము పద్య రచనపై నుండుటయే. కథౌచిత్య మునకు ప్రయత్నించి నట్లు కన్పించదు. తరువాత తరువాత వచ్చిన ప్రబంధము లన్నింటి యందును ఇదే లక్షణము ప్రస్ఫుట మగుచున్నది. వింతసేపటికి వారి దృష్టి పద్య రచనమీదనే ఆనాటి రసజ్ఞుల ఆస్వాదన గూడ పద్య రచనా వైభవముమీదనే యుండెడి దేమో. పద్యరచన యందో, అప్రాస గమకములందో, సమాస నిర్మాణ కౌశలమునందో, వారి దృష్టి కేంద్రీకరింప బడి తలయూచి మెచ్చుకొని పరవశించి ఆనంద పడెడివాడు వారు. అంతియే కాని ఆలక్ష్యమునకు తిలో దకము వదలి శుష్క ప్రసంగ ధోరణులతోనో, నూత నావ సిద్ధాంత ప్రచారములతోను రసజ్ఞతను ముడి పెట్టుకొన్నవారు కారు. ఈ పద్యములోని సమాసముల జాబితాను చెప్పకొని పోయినను, అచ్చతెనుగు పదముల వరుస జాబితాను వ్రాసినను, పద్యములోని అలంకార ముల బాణీని వ్రాసినను, అదియొక పరిశోధన వ్యాస ముగా తయారు కావచ్చును. ఈ పరిశోధన వలన లాభమేమి? మతి, బుద్ధి, ప్రజ్ఞాదులు, మేధ సాధించెడి ఫలములు. గ్రహణ ధారణాది శక్తులు, మతి, బుద్ధి విలసితములు. స్మృతి శక్తి మతియు ప్రాథమిక స్థితి లోనిది. మేధ, స్మృతి, మతి, బుద్ధి సోపాన పరంపరయు ప్రజ్ఞా సమన్వితముగా విలసిల్లుచు పోవలయును. పరిశోధనలలో ప్రజ్ఞాభాగ వికసనము ఉండదు. మేధ సాధించెడి అల్ప ప్రయోజకములైన మతి బుద్ధి భాగము లుండును. లోకములో సాహిత్య వైభవమంతయు ప్రజ్ఞాప్రతిభాదుల లీలా విశేషము మాత్రమై యున్నది. వర్ణనలలో వైవిధ్యము వివ రించుట, సమాసములలోని భేదములను విశదీకరిం చుట, తెలుగు సంస్కృత శబ్దముల వింగడించుట, ఇట్లు పై పై విషయములను ప్రస్తావించుచు తమకు గల అశక్తతను, మాటుపరచెడి జిలి మాటల వ్యాసం గములతో, ప్రపంచమును ప్రతారించుట కూడదని నా అభిప్రాయము. సాహిత్య పరమార్థమును తరచి, తరచి ఆలోచించి, ఆస్వాదించి, ఆనందించి, చొక్కి, పరవశము పొందెడి లక్షణము సాహిత్య మర్మజ్ఞున కుండవలసినది. నాకు తెలిసినంతవరకు పరిశోధనలలో వ్యక్తమగునవి ప్రజ్ఞాప్రతిభాదులైన గుణములు గావు. అల్పియములైన మతిబుద్ధులు మాత్రమే. ప్రయో జనమునకు రాని 'బండచాకిరీ' మాత్రమే. పారమార్థ్య మును తరచి చూడని వ్యర్థ వ్యాసంగము మాత్రమే.

సాహిత్యము అంతర్ముఖముగాను, బహిర్ముఖము గాను లోకమునకు ప్రత్యక్ష మగుచుండును. శబ్ద విన్యాసము, సమాసము, సంఘటన, రీతి, పాకము మొదలైనవి దీనికి బహిర్ముఖములు. వ్యంగ్యము, రసము, అలంకారము మొదలైనవి దీనికి అంతర్ముఖ ములు. అంతర్ముఖము నాస్వాదము చేసిన వాని ఆధిక్య మును గూర్చికాని, బహిర్ముఖములను తెలిసికొనిన వాని అల్పత్వమును గూర్చి గాని యిక్కడ చర్చించుట ప్రస్తుతము కాదు. సాహిత్యముయొక్క నిజ స్వరూప మును అనుభవించుటకు శక్తి చాలని యీ కాలములో ప్రస్తుత దైన్యస్థితిని వివరించుటయే నా కర్తవ్యము.

'ఇనుగంటి న్నినుగంటి,
భేద మొకయింతే విన్ గన్న వాదు పో
ముని గంటి న్నినుగంటి,
భేదము లవంబు న్గానగారాదు, మే
ఘుని గంటి న్నినుగంటి,
భేద మనయ న్గోరంతయు న్లేదు, మీ
యిను గంట్యన్వయమెంత
చేవ గలదో యీ చిన్నరాయాధిపా'—

ఈ పద్యములో శబ్ద విన్యాసము పోవని పోకడ లేదు. భావ సౌందర్యము తిరుగని మలుపు లేదు. రచనా బంధము ఒదుగని తీరు లేదు. ఇక్కడ కేవలము శబ్ద పటాటోపము మాత్రమే యున్నచో, పద్యమునకు సొగసు లేదు. దానిలోని భావము కూడ శబ్దము వంగిన వంపులలో అంతయో యింతయో సాన్నిహిత్యమును పొందుచునే యున్నది. అదే యీ పద్యమునకు వచ్చిన

బిగువు. ఇందులో ఉక్తివైచిత్ర్య మున్నది. రాజ విషయకమైన కవి రతి,యందు ప్రధాన భావన. అది ఉక్తివైచిత్ర్యములో గుణీభూతమై కొనయూపిరితో మూలుగుచున్నది. ఈ పట్టి చమత్కారము నాస్వాదించు శక్తి కొంతకాలమువరకు ప్రజలలో మండుచు వచ్చినది. ఇది ఉత్తమ కవిత్వమా? దీనిలో రసము వ్యంగ్య మగుచున్నదా?—మాటల గారడీవలె నున్నదే. ఈ బావతు విమర్శనలు ఉండనే యున్నవి. వానిలో ప్రస్తుతము ప్రమేయము లేదు. అందులోని చమత్కారమునకు ఆ నాటి ప్రజల హృదయము లెటు రసించగల్గినవో దీనినిబట్టి యూహించ వచ్చును పల్లెటూళ్లలో వీధి భాగవతములయొద్ద నిలుచుండి పెత్తనము వహించిన నిరక్షరాస్యులైన పెదలు అభినయము పట్టువేళల యందు ఇది ఖండిత, ఇది కలహాంతరిత, ఇది విప్రలబ్ధ, ఇది ప్రోషిత భర్తృక, ఇది అభిసారిక, అని యూహించెడి రసజ్ఞతలు నా చిన్న నాడెఱుగుదును. వారు అభినయ శాస్త్రపారంగతులు కాకపోవచ్చును. అక్షరాస్యులు కాకపోవచ్చును. ఆ మాత్రము సాహిత్య సంగీత నాట్యములను ఆస్వాదించెడి రసజ్ఞత నేడెందులకు లుప్తమైనట్లు? చదువుల ప్రణాళికలు రసజ్ఞతా దూరములగు చున్నవేమో విజ్ఞులే నిర్ణయించు కొనగలరు. పరప్రభుత్వ పరిపాలనము దుష్ఫలితము కొంత యున్నను కొంతవరకు నేటి విద్యాసంస్కర్తల అసమర్థతయే ముఖ్యకారణము.

'......... ......................
.........................గ్రీష్మర్త్వర
ణ్యానీదావ విదూత ధూమ
శకలోద్య ద్భ్రాంతి మత్కేకి కేకి
కా నిర్హ్రాద గభీర హాస
పృథురేఖా భిన్న గండాగ్రయై'......

మంథర దుర్బోధకు అంగీకృతిని చూపుచున్న కైకేయి నవ్వు ఇది. దీనినింత పెద్దసమాసములో కవి చెప్పినాడు. అడవిలో దావాగ్నిని చూచి మేఘమను కొనిన అడవి నెమలి కేకవలె, ఆ నవ్వున్నదని ఉత్ప్రేక్షించినాడు. పద్యము సమాస రచనతో, శబ్ద విన్యాసముతో ఎంత దూరముగా సాగినదో, అంతదూరము భావము ఉద్బలబడుచునే వచ్చినది. ఇక్కడ బహిర్ముఖ సాహిత్యము, అంతర్ముఖ సాహిత్యము ఒకదాని కొకటి పెనవేసికొని రచన సాగినది. ఇక్కడ ఇంత సమాస మెందుకు? అందరకు తెలిసిన వ్యస్త పదములతో వాడవచ్చునుగదా! అని సాహిత్యతత్త్వము తెలియని వారందురు. సమాసము వేయుట అర్థము కాకుండుటకు అన్నభావము సరియైన గనా యీ ప్రశ్న యుదయించుట. ఒక ఉత్కృష్టమైన భావమును వివరించునపుడు అప్రయత్నముగా కొన్ని శబ్దములపై నూతనముగుంచి చెప్పవలయును గదా. అది భావ స్ఫూర్తికొరకు వాడుదుము. అట్లేల నొక్కి పలుకవలెను? తేల్చి పలుకరాదా యన్న బోధచేసెడివారి కెంత లోక వ్యవహారత్వ మున్నదో ఈ ప్రశ్న వేసినవానికి అంత సాహిత్య మర్మజ్ఞత్వ మున్నది.

'పరుగెత్తే మబ్బుల్లారా ప్రపంచ మిది గమనిస్తారా'—'అచేతన వస్తు సంబోధకముగా ఉన్న యీ రచన కన్నుమిన్నెరుగక వర్తించు లోకములోని కొందరి మనః ప్రవృత్తికి నినిగమకముగా నున్నది. పూర్వ కవులు సమాసములచేత, అలంకార సామగ్రిచేత, ఛందస్సుచేత వ్యంజితము చేసెడి వస్తువును ఆధునిక కవులు గేయములోని లయ, బాణీలతో వ్యంజితము చేయుటకు ప్రయత్నించిరి.

'ఓ కన్నుమిన్ను ఎఱుగని ఆకాశ విహారాలు చేసెడి ఘనస్వాములారా' అన్న భావమును ఇక్కడ గేయములోని లయ పట్టియిచ్చుచున్నది. పూర్వకవులు భావమును ఛందస్సుద్వారా వ్యంజితము చేయుచుండెడి వారు. కాని రాను రాను వాని ప్రాముఖ్యము పోయినది. ఆధునిక కవులు ఛందస్సులో కొంత, రచనలలోని లయతో కొంత భావమును వ్యంజితముచేయు నేర్పును సాధించి యున్నారు.

ఊర్వశి ఊర్వశి నాతో
ఊహా పర్ణాంచలముల
నెఱ పెఱుగని నిర్ఝర బొమ్మ

తిరుగ రాని, దొరక బోని
శీతాచల శిఖరోజ్జ్వల
హిమపీఠాగ్రమున కెగసి'—!

భావము ప్రత్యక్షరమున ధ్వనితమగుచు పరుగెత్తెడి యీ రచన ఆస్వాదయోగ్యము కాదనగలమా?— ఇక్కడ కవి ప్రేయసి ఊర్వశి. ఊర్వశి, ఊర్వశి యనుటతోడనే కవి యుత్కంఠ ఒకవైపున సూచక మగుచుండగా, పర్ణాంచలములు,శీతాచల శిఖరోజ్జ్వల హిమపీఠాగ్రము— ఇవన్నియు ఆరోప్యాంశములు. ప్రేయసీ సమాగమ నిరవధిక సుఖతా పరమానుభూతి సూచకముగా భావము నెక్కడికో ఆకాశముమీది కెత్తెడి ఇంద్రజాల మున్నది. ఇది కవిచేసిన శిల్పము. దానిని యత్కించిత్తుగా తెలిసికొనినవారే సహృదయులు.

'సోర్థవ్యక్తి సామర్థ్య యోగీ శబ్దశ్చ కశ్చన
యత్నతః ప్రత్యభిజ్ఞే యేతౌ శబ్దార్థౌ మహాకవేః'—

కావ్యములను ఎట్లు చదువుకొనవలెనో తెలియనివారు పదవీ వ్యామోహితులై సాహిత్యమునకు కీడు తెచ్చిరి.

'శిఖి పింఛకర్ణపూరా,
జాయా వ్యాధస్య గర్వీణీ
భ్రమతి ముక్తాఫల ప్రసాధనానాం,
మధ్యే సపత్నీనామ్'—

ఇది శబ్ద పటాటోపము లేని యచ్ఛమైన రచన. స్వతస్సంభవిగా నున్న ధ్వని, వాక్య ప్రకాశ మెట్లగుచున్నదో పరిశీలించి చూడదగినది. ఈ యర్థ ముల తీరులు, శబ్ద పాటవములోని మెఱుగులు సంఘ టనా సంరంభములోని సౌరభ్యములు చవి జూచి యానంద పరవశత్వము పొందదగిన రసజ్ఞత యీ దేశ ములో ఎందుకు చచ్చిపోయినదో అవగత మగుటలేదు. మొన్నమొన్నటివరకు చెక్కుచెదరని రసజ్ఞత యిట్లయి పోవుటకు కారణము తెలియకున్నది. అతివాస్తవిక కవులు, అభ్యుదయ కవులు, దిగంబర కవులు, వీరి లోనే ఏమాత్రమైనను ఈ రసజ్ఞత యొట్టనకు నిలిచియున్నది.

పూర్వము ముక్కువచ్చులారవి పసి హృదయము లకు పిట్టకథలు చెప్పుచు, జోలపాటలు పాడుచు సాహిత్య రక్తిని పెంచెడివారు. శబ్ద బ్రహ్మ పాయిబ్యా మును కల్పించెడి వారు. ప్రాథమికులైన వారి కిప్పుడు భాషాశాస్త్రబోధనము చేయుచున్నారు. సాహిత్యముపై మోజు తగ్గిపోవుటకు అది యొక ప్రధాన కారణమని నా యభిప్రాయము.

కవి ప్రతిభాశక్తి ముక్కాలుమువ్వీసము కల్పనా బలమువిూద ఆధారపడియున్నది. శాస్త్రము చెప్పిన నియమములను దాటి పైన విహరించుటకు ఒక్క ప్రతిభాశక్తికే హక్కు ఉన్నది. కవి తన ప్రతిభా సంత్యముచేత దేనినైనను రసమయము చేసికొనగలడు. లక్షణశాస్త్రమంతయు కవి నియమోల్లంఘనమును నియమించుట కేర్పడినది. ఈ ప్రతిభాశక్తికి మాత్రము ఆ నియమము లేదు. దానికి పాటవము ఉండవలెను గాని అది యే పరిధిలోనైనను విహరింప వచ్చును.

'యదుస్మిలన శక్త్యైవ
విశ్వ మున్మీలతిక్షణాత్
స్వాత్మాయతన విశ్రాంతాం, తాం,
వందే ప్రతిభాం, శివామ్.'

వాల్మీకి ముఖమును కమలము గాను, చంద్రుని గాను ఊహించినాడు. లక్షణకర్త శాసించినచో అదే ఔపమ్యమును స్వీకరించి అందరు కవులు వ్రాయవలసి వచ్చును. వ్యక్తిగతమై, భిన్నముగా నుండెడి ప్రతిభా వైవిధ్యము ఇక ప్రకాశించుట యెట్లు? అందుకే కవి ప్రతిభా బలమునకు ఉన్నత స్థానమును, లోకము కల్పించినది. ఒక కవి చంద్రోదయమును ఉదయ సము ద్రమునందు మునిగిన యేనుగు కోఱవలె నున్నదని చమత్కరించినాడు. వేఱొక కవి

'ఆకాశ శాణే శరదాభి రామే రాశీకృతం చందన' మని ఊహించెను.

ఇంకొకకవి 'ఆకాశ వాపీ ఘనపుండరీక'మ్మని చెప్పినాడు.

'గురుదార గమనా ఘ కుటిలత లో బుచ్చి నుసిరాలు నేమో చందురుని బిళ్ల' అని వేఱొక కవి చమత్కరించినాడు.

మఱొకరు—'ఆకాశపు ఎడారిలో కాళ్లుతెగిన ఒంటరి ఒంటెలాగుంది జాబిల్లి' అనినాడు.

ఇవన్నియు ప్రతిభాద్రవ్యము చిందించిన చిందులు. కొందరు చంద్రుని మేహరోగపు పొడలతోను, ఇడ్డెనతోను పోల్చిన వారుండవచ్చును. అక్కడ కీలకము ఔపమ్య స్ఫురణలో లేదు. దాని వెంబడి వస్తువును ప్రతిబింబింపజేసే ప్రతిభా బలములో ఉన్నది.

'కాలిన ప్రియురాలి శవం కమురుకంపు యీ లోకం'—అని ఒక కవి చెప్పినాడు. ఇది జుగుప్సావహముగా నున్నది యన్న ఆక్షేపణ గూడ వెంటనే యున్నది. లోకముపట్ల నిరీహ చెంది నిర్వేదము పొంది శోక సంతప్త నీరస వైరాగ్య వాక్యముగా మన్నప్పుడు ఈ రచన జుగుప్సా భావమును పైకి రానీయదనియే నాతాత్పర్యము. వైరాగ్య స్ఫోరకములైనవుడు ఎన్ని అశ్లీల వాక్యములు పూర్వ కావ్యములలో దోష నిర్వృతిని పొందలేదు?—

రాజశేఖరుడు ఈ శక్తిని రెండు విధములుగా విభజించినాడు. సాహిత్యముపట్ల హృదయము నార్ద్రత పొందించెడి శక్తి భావయిత్రీ శక్తి రెండవది. ఇది కొందరిలోనే యుండునని చెప్పినాడు. ఈ భావయిత్రి ప్రతిభా శక్తిలోని యొక భాగము. అందుకే ప్రతిభ కేవల కవికి మాత్రమే గాక కొంతవరకు సహృదయునకుగూడ సంబంధించినదై యున్నది. ఈ శక్తి చాలనివాడు కావ్యాస్వాదన చేయుటకు అర్హుడుకాడు. కవి కావ్యమును వ్రాయునపుడు వస్తువులో తన్మయత్వమును పొంది అలౌకికమైన ఆనందమును పొందుచున్నాడు. ఆయానందము వంటి యానందమును ఆ కావ్యమును చదివిన రసికుడు పొందుటకు కారణము ఈ భావయిత్రీ శక్తియే. ఈ భావయిత్రీ శక్తి పెంపొందుటకు నేటి విద్యా ప్రణాళికలు తోడుపడుట లేదు. సాహిత్య రసికత చచ్చిపోవుటకు ఇదియొక కారణము.

'కమలా కంకణ కింకిణీ కుణుకుణు
క్వాణమ్ము బాహోవధి
క్రమహేలా మధు యామముల్,
పృథు సమజ్ఞా, మత్తమాతంగ వి
భ్రమ కుంభస్థల పీఠికాస్థిత
విదించ ప్రౌఢకాంతా దృగ
గ్రముల౦తంత జుఱుంచు గాక
కవితా కన్యాస్వయం గ్రాహముల్.'

సమాస రచనలో మాధుర్య గుణముండి ఆసాంతము మనసును రంజింప జేయుటయే దీని పరమార్థము. కవి యెప్పుడో యెందుకో సమాసము వేయును. ఇక్కడ దీని పని హృదయమును తరచి తరచి మధురాతి మధురముగా మనసును కదలించుటయే. పై మూడు పాదములలోని సమాస రచన అంత మధుర మధురముగా నుండి కవితాకన్యా స్వయం గ్రాహము లోని యానంద పరిపాకమును ప్రత్యక్షరమును వెల్లడించుచున్నది. కవితా స్వాదనలో ఒక విశేషమున్నది. దీని యర్థ తాత్పర్యములను, సొగసును ఎంత వివరించి వివేచించినను, ఇంకను అవ్యక్తమైన అనుభూతి భాగము కొంత మిగిలియే యుండును. అది సహృదయ లోకము యొక్క ఆస్వాదమునకు అందవలసినదే యై యుండును. సాహిత్యములోని బహిర్గత లక్షణము లన్నియు నిండున్నవి. అవి యన్నియు ఉరకలు పెట్టెడి లోపలి, భావములకు వినిగమకములే. వ్యర్థరచన వీస మెత్తులేదు.

సంగీతకము కూడ వ్యంజకమేనని ఆలంకారికులు నుడివి నారు. కావ్యములలో ఒక్కొక్కసారి ఒక్కొక్క కూర్పు కవి కూర్చుచుండును. పాఠకునకు ప్రతి పదార్థము తెలియ నవసరము లేకయే, సాహజికముగా భావము స్ఫురించి హృదయము రసితమగునట్లు రచనా ముద్ర గొట్టును. ఇది యొక రకమైన శిల్పము. ఒకవైపున ప్రతిపదార్థాన్వయము కలుగుచు, మొత్తముపై భావస్ఫురణకు అనుగుణముగా శబ్దములు కూర్చుట ఆ కూర్పులో పరమానంద మగ్నమైన హృదయము శబ్దగతమైన ప్రతి యర్థమును వివేచించి పునః పునః ఆనందితమగును. ఈ గుణమే సాహిత్యమును సంగీతము కంటె నుచ్చస్థాయికి గొంపోవును. సంగీతమాపాత రమణీయమైనది. సాహిత్యమాలోచనామృతమైనది. ఈ రెంటిని సమ్మేళనపరచెడి యొక శిల్పవైఖరి యీ తెలుగు ప్రబంధములలో సంస్కృతములో, ఎక్కు

దృశ్యకావ్యములలో పద్య రచనావైఖరి ఎక్కువ యీ దృష్టితో చేసినదే. సంగీతమువలె అర్థవివేచన లేనప్పుడు ఆనందము కల్గును. ఇది పూర్వపు సాహిత్యవేత్తల సొమ్ము.

నవ్య కవిత్వములో ఒక లక్షణము ఈ శిల్పమును పాక్షికముగా అనుకరించుట యగుచున్నది.

'కొరకు కన్నా
కొమ్మకు కన్నా
ఘోర క్రూర
కర్కోటకులో,
కర్కాటక
కర్కోటకులు—'

వంటి ఆధునిక రచనలలో భావమునకు వ్యంజకముగా రచన చేసిరిగాని అన్వయము ఎంత ప్రయత్నించినను కుదురుటలేదు. ఎంతవరకు రచనకు ఆ పాత రమణీయత్వ లక్షణమును పట్టించుటయే గాని ఆలోచనా వృతముగా వ్రాయుట ఆధునికులలో క్వాచిత్కముగా మాత్రమే యున్నది. పూర్వ కావ్యములలో నీ రెండింటికి స్థాన మున్నది. పెద్దన్నగారు కవితా సామగ్రి నాశింపించుచు

'నిరుపహతి స్థలంబు రమణీ
ప్రియ దూతిక తెచ్చి యిచ్చు క
ప్పురవిడె మాత్మ కింపయిన
భోజన ముయ్యెలమంచ మొప్పు త
ప్పరయు రసజ్ఞు లూహ తెలియం
గల లేఖక పాఠకోత్తముల్
దొరకిన గాక, ఊరక కృతుల్
రచియింపు మటన్న శక్యమే?'—

ఇందులో ఉత్తరోత్తరము బలీయమని యాయన సారాంశము. 'ఒప్పు తప్పరయు రసజ్ఞులు, ఊహ తెలియంగల లేఖక పాఠకోత్తముల్'—దేశమునకు ముఖ్యముగా అవసరమని వాని ప్రాధాన్యమును సూచించుచు చివరకు తేలునట్లుగా పద్యములు వ్రాసినారు. పై వరుసలో మొదటి కోరికలు ధన మదాంధుల దుర్విచార వాంఛా లంపటత్వమునకు ఉదాహరణ ప్రాయమని రాజకీయముగానో, సాంఘికముగానో దోషము లెత్తి చూపెడి వారుండకపోరు. వారితో వివాదము అప్రస్తుతము. కాని ఈ చివరి కోరికలను మాత్రము కాదనుటకు బ్రహ్మతరము గాదు. దేశము ఎంత భావదాస్య లోలుపమైనను, ఎంత సామ్యవాద సిద్ధాంత సంకులమైనను, ఎంత దరిద్రతా పరవశమైనను, ఈ రెండు లక్షణములు సాహిత్యమునకు పరమ ప్రాణములుగా అంగీకరించి తీరవలసినదే. ఇందు అభిప్రాయ భేదమునకు తావే లేదు.

మొదటివారు రసజ్ఞులు. వారు ఇది ఒప్పు, అది తప్పు అని తెలిసినవారు కావలెనట. గతానుగతికో లోకో అన్న తీరువారు కారాదు. పైవారి ఆసరా చూచుకొని చేతు లెత్తువారు అంతకంటె కారాదు. ఈ బాపతువారు రెండు విధములుగా నుందురు. ఏది యొప్పో, తప్పో తెలియక పలువురి యభిప్రాయముల తీరును గ్రుడ్డిగా అనుకరించు తందాన పాట దాసరులు. ఇక రెండవవారు విచిత్రమైన మనఃప్రవృత్తి గలవారు. ఒప్పును, తప్పుఅని, తప్పును ఒప్పుఅని తమ సిద్ధాంతములలో సాహిత్య సారస్యమును చెఱచువారు. ఈ రెండవవారి వలననే సాహిత్యమునకు మఱింత ప్రమాదస్థితి వచ్చినది. కవికి వీరే ప్రథమ శత్రువులు. కవి ఎక్కడ రసదృష్టితో రచనాబంధమును కూర్చునో, అక్కడ అలంకార సామగ్రి చర్చ జరుపుదురు. ఎక్కడ కవి ఉక్తి వైచిత్ర్యమునకు ప్రయత్నించునో, అక్కడ విభావానుభావ సామగ్రి కొఱకు తహతహ పడుదురు. కవి అనంతమైన కావ్య మార్గమును రచనా బంధములతో పరిష్కరించునపుడు, ఒక్కొక్కప్పుడు బుద్ధి చమత్కారదృష్ట్యా, ఒకప్పుడు రసదృష్ట్యా, అనేక శిల్పములు చేయుచు పోవును. కావ్యము యదభిముఖముగా చెప్పబడునో, తదభిముఖముగా చూచినగాని సారస్యము నిగ్గుదేలదు. కావ్యము యథాముఖీనముగా జూడవలెనని పెద్దలనుట దీనివలననే. రసజ్ఞుల మనిపించుకొనవలెనన్న ఈ బాపతు వారివలన, కావ్యార్థములు విరతిపొందును. పరానుకరణముగాని విపరీత రాద్ధాంత ప్రతిపాదకముగాని కాకయున్నదే రసజ్ఞత.

'అంతయో యింతయో తెలిసినట్టి
విమర్శకులైన కావ్య సి
ద్ధాంతుల యెత్తిడిం బడి,
మహాకవి నాగటి చాలుదీర్చు
'సంగతియో యోయి యనుమంతశింగ రావు...
తత్త్వ నిర్ణయ వాదంబు తరమె నీకు'—

అని సుగమశైలిలో వ్రాసిన కవి యే ప్రయోజనము నాశించి—

'స్యందన స్థితబిడౌ జక్షత్త్వ జాడ్యకృత్ ఝం ఝా మరుద్గరుత్ ఝాత్కృతములు—' అన్న క్లిష్టబంధరచన చేయుచున్నాడు. దీని విశ్లే వ్రాయ లేదేమని యడిగెడి హక్కు పాఠకునకు లేదు. తన హృదయము రసించినంతవరకు ఆనందించుటకు మాత్రమే అతనికి హక్కున్నది. పాఠకుని రసజ్ఞతలో గూడ తరతమ భేదములుండును. అల్పస్థాయిలో రచనను ఆస్వాదించెడు పాఠకుడు అధికస్థాయిలోని దానిని ఆస్వాదించుటకు అర్హత చాలనపుడు అర్హత చాలనట్లే యుండవలెనుగాని అట్టిరచన దోషమని చెప్పరాదు. సాహిత్యరసికత చచ్చిపోయిన కాలములో ఇట్టి అపసిద్ధాంతములు వ్రేళ్లు పోసుకొనును.

'వడివడి తడుబడు నడుగుల మదిరా
బంధుర లోచన కాంతులతో
నడుమున, గుడుసగు కనకపుర శనానాద
మనోహర కింకిణితో
నొడికపు మెలపువ నొరిగిన మెడతో
ఉజ్జ్వల హొసరదచ్ఛవితో
వడుతుక చనియెను రఘుకులపతి
యొప్పంగను నిలిచిన చోటునకున్'—

కుపిత లక్ష్మణమూర్తి దర్శనభయవిహ్వలుడగు సుగ్రీవుడు పంపగా మదిరాభాగ పరవశయైన తార లక్ష్మణునియొద్దకు నడచిన తీరును వర్ణించిన సందర్భములోనిదీ పద్యము. ఇది బంధురవృత్తము. ఇక్కడ కవి ఛందస్సు మార్చినాడు. రచనా విన్యాసము మార్చినాడు. ఖండ ఖండములైన విడివిడిపదముల పొళింపుతో మెఱపు మెఱసినట్లు తారారూపు సాక్షాత్కారము చేయించినాడు. ఏ పద్యము నెట్లు కూర్చిన భావము గమకమగునో...రచన బింకము తేరునో—పద్యమునకు సాహిత్యముద్ర యేర్పడునో, మూర్తికి ప్రత్యక్ష సాక్షాత్కారమేర్పడునో కవికే తెలియును. మనపని చేతనైన ఆస్వాదించుట, లేనిచో ఊరకుండుట — దీని నెట్లు వ్రాసిన రక్తికట్టునో ఏర్పరుపవలసిన వాడుకవి. అది యాయన ప్రతిభా గుణములోని భాగము.

'కవి ప్రతిభలోన నుండును కావ్యగత శ
తాంశముల యందు తొంబదియైన పాళ్లు'

పూర్వమొకకవి అరసికుని మాట్లాడుటకంటె రసికునితో పోట్లాడుటయే మేలని చెప్పినాడు. ఒక దానికి పదునొకటి యూహించుట, రసాస్వాదనవేళ శబ్దార్థ నిర్ణయముచేయుట, ఉక్తివైచిత్ర్యమునందు రసాస్వాదనకు ప్రయత్నించుట, లేనిది ఉన్నట్లు, ఉన్నది లేనట్లు నిరూపించుట, ఇవి అరసికుని గుణగణము. ఎక్కడ ఏ కొంచెము ప్రతిభాస్పర్శ తగిలినను, ఆస్వాదించుటకు ప్రయత్నము చేయువాడే రసికుడు.

'ఓ నవ్య స్త్రీ, నిన్ను చూస్తుంటే
డీలక్స్ కుషన్ పరుపుపై కూర్చున్నట్లుంటుంది—'

ఇందులో ప్రతిభాస్పర్శ ఉన్నది. శబ్దసౌష్ఠవము లేదు. సంప్రదాయ బద్ధమైన రచనగాదు. ఛందోబంధత్వము లేదు. రచనలో శైథిల్యమున్నది. ఇన్ని లోపములున్నను, ఆ ముఖ్యమైన ప్రతిభా స్పర్శ దీనిని తళతళ లాడించుచున్నది. ఊహలో ఒక వైచిత్రి యున్నది. కల్పనలో ఒక ఆకర్షణమున్నది. సహృదయుని బుద్ధిని ఉన్ముఖీకరణము చేసికొనెడి శక్తి యున్నది. అందుచే దీనిని కవిత్వము కాదనలేము.

ఆధునిక కాలములో కవిత్వమనేక మార్గములలో ప్రసరించు చున్నది. పుష్టిలేని రచనలే కావచ్చును. సంప్రదాయబద్ధమైన రచనలు కాక పోవచ్చును. కవిత్వపు ముసుగు ధరించిన వచనములే పలువురు సంప్రదాయజ్ఞులైన వారి రచనలోకంటె ప్రతిభాస్పర్శ వీరిలోనే గోచరించు చున్నది.

'తెలుగుజాతికి పిచ్చిపట్టిందా, అశ్శరభ శరభా
తెనుగులక్ష్మికి కునుకుపట్టిందా'

అశ్శరభశరభా

ఇందులో ఒక బాణీ ఉన్నది. అది పూర్వరచనా బద్ధమైనది. ఈ పద్యములో భావముకంటె బాణీ మనస్సు నాకర్షించుచున్నది. అదికవిరచనా శిల్పములోని భాగము. పలువురు కవులు అందులో మఱియు నాధుని కులు దీనిని తమ రచనలకు అనువుగా ఉంచుకొనియే కాలము వెళ్లబుచ్చు చున్నారు. సాహిత్యములోని అంద మును ఆస్వాదించెడి శక్తి నేటి యువతరములో నన్న గిల్లి పోయినది. ఇటీవల వెలువడిన వానిలో ఎక్కువ రచనలు చేసెడివారు గాని, దాని నాస్వాదించెడి వారు గాని, పండితులుగాని పట్టభద్రులుగాని కారు. అక్షరా స్యత మాత్రమే విజ్ఞానప్రద మనుకొనుట పొరపాటు. అట్లనుకొనుట ఈనాటి విద్యా విధానములోని యొక లోపము. కేవలము ప్రభుత్వోద్యోగులుగాను, కవిలె కట్టల లేఖకులుగాను, అను పల్లవు లందించు వంత పాటగాళ్లుగాను, ప్రజలను మార్చుట కొఱకే యీ విద్యా విధాన మేర్పడినది. ఈ 'అక్షరాస్యత' దానికి బొంతగా తగిలించుకొన్న ముసుగు. నిజము చెప్పవలె నన్న అక్షరాస్యులలోకంటె, నిరక్షరాస్యులలోనే ఆర్ద్రత, ఆస్వాదయోగ్యత, సంస్కార సౌజన్యాదులు గోచరించు చున్నవి.

పై విషయములో ఒకటి మఱచితిని. ఊహ తెలియంగల లేఖక పాఠకోత్తముల్. రెండవవారు 'ఏ భూమీంద్రుని జూడబోయినను, నీవే పద్యముం జెప్పి నీవే భావంబును జెప్పుకోవలయు నన్నట్లున్నది. నేటి కవి లోకపుస్థితి. భారతాదులలోని పాఠాంతరము లన్నియు లేఖక ప్రమాదములవల్ల వచ్చినవే, దానివలన కవులకు జరిగిన అన్యాయమునకు మేర లేదు. లేఖక దోషములు కవి దోషములుగా నిరూపితములైన ఘట్ట ములు కొల్లలుకొల్లలుగా నున్నవి. ఇక పాఠకు లున్నారు. కవి తరువాత, సాహిత్య రసికతకు మూల స్తంభములవంటివారు వీరే. పద్యము నెట్లు చదువు కొనవలెనో తెలియక, తమ్మునె వంచించుకొని, యితరు లను వంచించుటకు ప్రయత్నము చేయు నమూనా సహృదయులలో లోకము సతమత మగు చున్నది. సాహిత్య రసికత గల్గించెడి బాధ్యత రచనా విషయ మున కవి కెంత యున్నదో, పఠన విషయమున వీరి కంత యున్నది. పద్యమును మంత్రము వలె చదువు పండితులు కొందఱు, వచనమును రోకటి పాటవలె ఈడ్చి సాగదీసెడి అభిజ్ఞులు కొందరు, ఒకదానితో ఒకటి కలిపి అతికించి చదువుకొని, కుశంకలతో కాలము వెళ్ల బుచ్చెడి విజ్ఞులు కొందరు, ఇతర భాషా సాహచర్యముచే అలవడిన ఉచ్చారణమును జోడించి, పదములను కత్తిరించి, విఱిచి, దిగ్రమింగి, నానాభ్రష్టము చేయు ప్రబుద్ధులు కొందఱు. వీరిలో సారస్యము దిగజారిపోయినది. సాహిత్యముపై మండ వలసిన నాగరకతా ముద్ర చెరగిపోయినది. సాహిత్యము నకు శాస్త్ర సిద్ధాంతపుకత్తు అలవడి ఉభయతో భ్రష్టమైనది.

ఇటీవలి శాఖోపశాఖా విజృంభమాణ నవ్య కవితా ధోరణులలో ప్రతిభా స్పర్శ యున్నవి. అవి లోక ములో కొంత సాహిత్య రసికతను పెంచుచున్నవి. వారు సాహిత్యరీత్యా కాక, రాజకీయ సాంఘిక సిద్ధాంత రీత్యా కట్టుబడి రచనలు చేయుటచేత కొంత అపకర్ష త్వము పొందుచున్నది. కాని నేటి సాహిత్య సౌరభము నాకు వారే మూల హేతువులు. వారి రచనా ధోరణు లను గూర్చి వేరే వ్రాయవలయును, కావ్యమును యథాముఖీనముగనే విమర్శించవలయును. వారి సిద్ధాం తముల దృష్ట్యావారు, రచనలలో చాలవరకు కృత కృత్యులైనారనియే చెప్పవచ్చును.

వారి రచనలలో, రసానందస్థితికంటె, బుద్ధి చమత్కారస్థితి యెక్కువ. దానిని సాధించు రచనా శిల్పములో వీరగ్రగాములుగా పురోగమించు చున్నారు.

'నన్ను తిట్టిన తిట్లతోనే
మల్లెపూవులమాల గట్టెను
నాకు వ్రాసిన ప్రేమ లేఖలు
పోష్టు చేయుట మానివేసెను'—

ఇక్కడ అర్థము తెలియుటలేదు. పై పాదము లోని భావము క్రింది పాదములోని భావము యెడ మొగము పెడమొగముగా మన్నవి. మనస్సు అందు లోని అవ్యక్తమైన ఒక చమత్కారమునకు ఆకృష్ట మగుచున్నది. రచనా శిల్పముయొక్క భాగము, భావించిన కొలది, చిలువలు పలువలుగా భావనాశక్తి కొనలు సాగుటయే. ఇక్కడ అర్థశక్తిచేత భావపరంపర వివరణ పొందుటలేదు కాని అర ము తెలియని, ఒక అయోమయ చమత్కారము మనస్సును పట్టి ఆకర్షించు చున్నది. వీరి రచనలలో ప్రథమ చరణ భావమునకు, ఉత్తరోత్తర రచనా విధానమునకు, భావమునందు అనుస్యూతి ఉండదు. ఒక వేళ కవి అట్లా భావించి నను, అది అన్వయదృష్ట్యా పాఠకునకు స్ఫురింపదు. ఎక్కడి కక్కడ ఉక్తివైచిత్ర్యము నుండియో, ఔపమ్యము నుండియో యొక చమత్కారపు విరుపు వెలువడి పాఠకుని మనస్సును ఆకర్షించును. సామూహికముగా దాని అనుగతి పొడగట్టదు. అందుచే రసానందము కలుగదు. ముఖ్యార్థ బాధ వచ్చినచో లక్షణ నాశ్రయింతుము. కాని యిచ్చట మొత్తము మీద అర్థ శక్తికే బాధకల్గును. లాక్షణికిగాని ప్రయోజనమునకు గాని తావీయదు. స్వప్నావస్థలోని ఒకస్థితివంటి స్థితిని కల్పించుకొని యేదోయొక అర్థముమ సరిపెట్టుకొనవలెను. ఆ సరిపెట్టుకొనుట గూడ వ్యక్తివ్యక్తికి భిన్నభిన్నముగా గలిగి ఇదమిత్థమన్న ఊహ పొడగట దు, అది ఒక్కటియందు గోచరించెడు లోపము.

ఆ లోపమే లేనిచో వీరికున్న ప్రతిభాబలముతో అపూర్వ సాహిత్యసృష్టి మనదేశమునకు జరిగియుండెడిది. వీరి రచనాస్థితి వీరి ప్రతిభాబలమును కొంత సంకుచిత పరచినది. వీరిలో, ఎక్కువమంది, పెద్ద చదువులుగాని పదవులుగాని పొందినవారుగారు. వారి మనస్థితికి తగినవారే కొందరు ఆ రచనలను ఆనందించుచున్నారు. నేటి సాహిత్య రసికత వీరి రచనా వ్యాసంగములతోను, దాని ఆస్వాదనలతోను, మాత్రమే మిగిలి కన్పించుచున్నది. వీరికి వ్యుత్పత్తి ఉన్నదా లేదా యన్న ప్రశ్నగాదు. త్రికాలా బాధ్యమైన రచన యగునా కాదా అన్న ఆశంకగాదు. ఇక్కడ చేయవలసినది. రసజ్ఞత పేరునకైన ఈ దేశములో వీరి వలననే నిలిచియున్నది. ఆనాటి ప్రభువులనుండి మొన్న మొన్నటి జమిందారులవరకు, ఆనాటి పండిత పదస్థులనుండి మొన్నమొన్నటి సామాన్య జనులవరకు అవిచ్ఛిన్నముగా పరవళ్ళు త్రొక్కిన సాహిత్య రసికత ఏమైనది ? మటుమాయమై పోవుటకు కారణమేమి? ఇది ప్రతివాని హృదయమును కలవరపెటు ప్రశ్న పరంపర. ఇప్పటి పట్టభద్రత్వము, పరిశోధనలు, భాషా శాస్త్రాధ్యయనములు, స్వార్థాభిలాషలకు ఉన్నత పదవులకు మాత్రమే పరిమితము లగుచున్నవి. సాహిత్య పట భద్రులనుండి సాహిత్య రసికత తప్పిపోవుట వారికి లాభమో నష్టమోగాని దేశమునకు మాత్రము తీరని నష్టమైయున్నది. ఈ సాహిత్య పట భద్రులందరు దానికి మార్గాంతరము నన్వేషించి మేలు చేకూర్చవలెనని నా మనవి.

ఆనందవర్ధనుడు అర్థమును ద్వివిధముగా వివరించినాడు- వాచ్యమని, ప్రతీయమానమని. ప్రతీయమానమే కవిచే సాధనీయము. దానిని గ్రహించువాడే రసజ్ఞుడు. సహృదయుడు. ఇది ఒక్కొక్కసారి, రసము నాశ్రయించి, భావము నాశ్రయించి, ఉక్తి వైచిత్ర్యము ననుసరించి ప్రకాశించుచుండును. ఒక్కొక్కసారి నిపాతలు, అన్వయములు, ప్రత్యయములు కూడ ఈ యర్థమును పట్టి యిచ్చునవిగా నుండును. ఆ సామగ్రిని యత్నించి తెలిసికోవలయును.

> 'ప్రతీయమానం పున రన్యదేవ
> వస్త్వస్తి వాణీ షు మహాకవీనామ్
> యత్తత్ప్ర సిద్ధావ యవాతి రిక్తం
> విభాతి లావణ్య మివాంగనాసు.'

'సహృదయో వాక్య సామర్థ్యాక్షిప్తం, వస్తుమాత్రం, అలంకార రసాదయశ్చ ఇత్యనేక ప్రభేద ప్రభిన్నో దర్శయిష్యతి. సర్వేషు చ తేషు ప్రకారేషు, తస్య వాచ్యా దన్యత్వమ్—' అని ఆనందవర్ధనుని

నిష్కర్ష. రసజ్ఞుడు గ్రహించవలసినది, కవి ప్రయత్నించ వలసినది ఆ యర్థమునకే. సర్వసాహిత్యసారము ఆ యర్థము లోతులోతులు తరచి యాస్వాదించుటయే. సామాజికుడుగాని, పాఠకుడుగాని పొందెడి సాధారణీకరణమునకు లక్ష్యమైనది యా అర్థమే. వాచ్యార్థ పరజ్ఞానమాత్ర కుశలులు, శబ్దశాస్త్ర నిష్ణాతులు, సాహిత్య పరమార్థమును గ్రహింపజాలరు.

'అథ చ వాచ్యవాచక లక్షణ మాత్ర కృత శ్రమాణాం కావ్య తత్త్వార్థ భావవిముఖానాం, స్వర శ్రుత్యాది లక్షణమివ ప్రగీతానాం, గాంధర్వ లక్షణ విదాం, అగోచర ఏవ సావర్థః—' ఈ యర్థమును పునఃపునరను సంధానము చేసికొన్నప్పుడే సద్యఃపర నిర్వృతి గల్గును. సాహిత్య విద్యా పరమస్థితి ఆ సద్యఃపర నిర్వృతిలోనే ఉన్నది. దానిని వదలివేసిన పరిశ్రమ వ్యర్థము.

'నీవీ మోక్షణ వేళాయాం
వస్త్రమూల్య పరీక్షణమ్'

రసికుడు చేయవలసిన పనిగాదు. అలంకారమునకు ఆహ్లాదము పొందకుండ, ఉక్తి వైచిత్ర్యమునకు ఉబలాట పడక, రసవ్యంజక సామగ్రికి పరవశించకుండ, పొందెడి శబ్దార్థమాత్ర పరిజ్ఞానము వాంఛనీయము గాదు. నేటి విద్యాధికారుల దృష్టి ఆ మార్గము వైపుగనే ప్రసరించుచున్నది. విద్యా ప్రణాళికలలో మార్పు అవసరము. అధ్యాపకులలో యువ హృదయములను కదలించెడి ఉత్తేజకత్వము వాంఛనీయము. రచనలలో ఆర్ద్రత ముఖ్యముగా కోరదగినది. మాతృభాషాభిమానము ప్రజలలో పాదుకొని వ్యక్తిత్వము రూపు గట్టవలెను. విద్యాధికారుల దృష్టి సాహిత్య విద్యలపై కేంద్రీకృతము కావలెను. ఈ దేశములో సాహిత్య రసికత చచ్చిపోయినది.



# మధుదీక్ష

శ్రీ గడియారం శేషఫణి శర్మ

ఇక్కడ
నీవు లేని
ఈ విందు చీకట్లో,
నేను—

ఆశల
శైశిర నిశ్వాసాల
అగ్నివలయాల మధ్య,
ఒక జ్వలత్ బిందువు వద్ద.

చెరగని దివ్యస్మృతులు—
మనః పటలిపై మాయని మధుముద్రలు,
గుండె లోతుల్లో,
నితాంత వేదనా నిధులు.

కళ్లు విప్పితే
కన్నీటి జలపాతాలు,
గళం పలికితే
వియోగ విషమ గీతాలు.

క్షణ క్షణం
అతిశయిస్తున్న ఆశలు—
జాగత్సు మప్తుల సంధ్యలో,
సుందర స్వప్నరాశులు :

ఎప్పుడో
వెన్నెల రెక్కలు తొడుక్కొని
నీవు వస్తావని
నాజీవన తమోగీతికకు
కౌముదీ వ్యాఖ్యవై
నిలుస్తావని !

దిక్కుల్లో,
నిమీలిత దృక్కుల్లో
వినదిస్తున్న
నిశ్శబ్ద సంకేతాలు,
మౌన గీతాలు,
మహా సంకల్పాలు—
చీకటిని చీల్చి,
వేకువ రేకులుగా పరిచేందుకు:
వేదనను మార్చి,
వేదఘోషగా మలిచేందుకు.

ఇది మధుదీక్ష—
అశ్రువర్షా వరసిలో
అంతరించిన
అమృత ధారలకోసం !
నిర్భర తమోగర్భంలో
నిద్రాణమైన
ఉషశ్శక్తి కోసం !!

---



స్థగితాకుంఠిత కంటకాళి తమపున్
జాలింపగా వచ్చెనే.

* * *

## చెరువు

మీా వారు సంస్థానాధిపతి జగత్సింహుడికీ, షాజహాన్ చక్రవర్తికీ చాలా దోస్తీ. 'జగదాభరణం' చెప్పి తనని మెప్పించిన జగన్నాథుణ్ణి —ఢిల్లీ దర్బారులో ఆస్థాన పండితునిగా తీసుకోవలసిందని జగత్సింహుడు షాజహానుకి సిఫార్సు చేశాడు. ఇటువంటి ప్రచండ విద్వత్కవి లేని దర్బారు ఏం దర్బారయ్యా? అన్నాడు పనికిమాలిన జనం ఎంతమంది ఉంటే మాత్రం ఏం శోభ? అన్నాడు.

విరియబూచిన తామర పువ్వులతో కలకలలాడే ఓ సరోవరమా! మంచి ముత్యాలవంటి స్వచ్ఛమైన నీటిబిందువులతో విరాజిల్లేదానా! మహారాజులకు కూడా పూజనీయమైన కలధ్వములు చేసే రాజహంస నీలో లేనప్పుడు పాడుకూతలు కూసే కొక్కిరాయిలు ఎన్నివేలు ఉంటే మాత్రం ఏం లాభం?

## వసంతతిలక

కాసార వర్య! కవితాంబురుహా వతంస!
ముక్తాసమాన జలబిందు తరంగరంగ!
కిం భూషణం తవబకై ర్బహుభిః కురావై
ర్హం సైర్వినా కలరవై ర్నర దేవ పూజ్యైః?

## ఉత్పలమాల

తమ్మిదనమ్ము నెత్తి తలదాల్చిన
చక్కనిదాన! మంచి ము
త్తెమ్ముల వంటి నీరముల తీయని
దాన! శ్రవః కఠోర రా
వమ్ముల గూడ కొంగలవి వందలు
వేలును దేనికే తటా
కమ్మ! నృపాల పూజ్య కలకంఠ
మరాళము పూజ్యమైనచో?

* * *

## రాజహంస

పద్మిని అని ఒక భోగం పడుచు. ఒక పెద్దయింటి రాచబిడ్డ ఆమెతో స్నేహం చేశాడు. ఆమె అతణ్ణి నృత్యగానాలతో పరవశింప జేసేది. తన అందచందాలతో అమరసౌఖ్యాలు అందజేసేది. ఆమె సాన్నిధ్యం లభిస్తే చాలు స్వర్గం కూడా అనవసరమే నని పించింది అతడికి. అంతలో ఆమె నృత్యగానాదులచేత ఆకర్షితుడైన మరొక రసికుడు ఆమె ఇంటికి రాకపోకలు సాగించడం ఆ రాచబిడ్డ కంటబడింది. అసూయతో ఉడుకెత్తిపోయాడు. ఆ పిల్లని నానా తిట్లూ తిట్టేడు. ఇంతకీ అతగాడి ప్రవర్తన న్యాయంగా ఉందా? ఆ రాచబిడ్డకి కావలసినవన్నీ ఆమె సమకూరుస్తూనే ఉంది కదా! అతడికి ఇంకా ఏం కావాలి? మరొకడెవడో ఆమెను చూచి ఆనందిస్తే తన సొమ్మేం పోయింది? తాను తప్ప మరెవ్వరూ ఆమెవల్ల ఆనందం పొందకూడదు అంటే ఎల్లాగ?

ఓ రాజహంసా! తామరపువ్వులతో నిండిన కొలనులో ఈతా లాడేవు. ఆ పువ్వులన్నీ ఒంటికి పూసుకుని, ఆ ఆకుల మధ్య రేకుల మధ్యా తిరుగులాడేవు. కమ్మని లేలేత తూడులు తింటూవచ్చావు ఎన్నాళ్ళనుంచో. పద్మిని వల్ల నీకు సకల సౌఖ్యాలూ లభిస్తూనే ఉన్నాయి. ఇంతలో దైవవశాత్తూ ఓ తుమ్మెద తేనెకోసం ఆ పద్మిని దగ్గరకు వచ్చిందని అసూయపడి, పద్మినిని నిందిస్తున్నావా? నీకీ ద్వేషం ఉచితం కాదయ్యా!

## శార్దూల విక్రీడితం

సానందం బిసినీదళే విహరసే
భుంక్షే మృణాళీ లతాః
శశ్వద్విందసి రాజహంస! తదపి
త్వం కిం ను రాజీవినీమ్
ఏతాన్ దైవ వశా దుపాగతవతో
దృష్ట్వైవ మాధ్వీవిహో
మాధ్వీలాభజుషో క్షమసేచ్చ!
మనసి ద్వేషోన్మనసంయుజ్యతే

## చంపకమాల

కమల వనమ్ములో తిరిగి కమ్మని
తూడుల నారగించియున్
ధుమధుమలాడు దేమిటికి
తోయజముం గని రాజహంసమా!
భ్రమరము క్రొత్తతేనియలు త్రావగ
దానిని డాపినందుకా?
విమలతమాంతరంగుడవు ద్వేషము
నీ కుచితమ్మె చెప్పుమా.

*　　*

## తుమ్మెద

ఓ తేటీ! వసంతోదయ వేళలో మామిడి బన్న లిగవూచిన సమయంలో జుమ్ము జుమ్ముమంటూ గుంజాల ధ్వనులుచేస్తూ దాని చుట్టూ తిరిగి తిరిగి ఆ పుష్పరసాస్వాదనలో తల మునక లయావు. ఆ సందర్భం ఒక్కటికూడా నీకు గుర్తులేదా? విధివశాత్తూ ఆ మామిడిచెట్టు ఎప్పుడు కాస్త వాడిందని దానికేసి దూడనైనా చూడకుండా, సిగ్గులేకుండా తప్పించుకు లోతున్నావా? ఇంతకన్న నైచ్యం ఎక్కడేనా ఉందా?

పొట్టవేత పట్టుకుని అనాథవై నువ్వు ఇక్కడా ఇక్కడా దేవిరిస్తూన్న సమయంలో నీకు తన పంచన చోటిచ్చి, భోజనం పెట్టి నీకో ఉద్యోగం వేయించి, ఇంత వాణ్ణి చేశాడు ఆ మహాదాత. పాపం, ఆయనకిప్పుడు రోజులు బాగులేవు. విధి వక్రించి బాగా చితికిపోయాడు. ఇటువంటి సమయంలో ఆయను చూచి కూడా చూడనట్లు మొగం తిప్పుకుని వెళ్లిపోతున్నావా? నీ కన్న పరమనీచుడు మరెవడున్నాడురా?

## శార్దూల విక్రీడితం

ప్రారంభే కుసుమాకరస్య పరితో
యస్యోల్ల సన్మంజరీ
పుంజే మంజుల గుంజితాని రచయం-
స్తానా తనో రుత్సవాన్
తస్మిన్నద్యరసాల శాఖిని దశాం
దైవాత్కృశామంచ తి
త్వంచే న్మంచసి చంచరీక!
వినయం నీచస్త్వదన్యోఽస్తికః

## మత్తేభ విక్రీడితం

మును వాసంత ఋతూదయమ్మున
లసత్పుష్పోల్ల సన్మంజరీ
వన మధ్యమ్మున జుమ్ము జుమ్మని
కల ధ్వానమ్మునన్ తేనె నా
నిన సందర్భము గుర్తు మాసిన దహో!
నేడీ రసాలమ్ము వా
డిన దంచున్ పెడమోము పెట్టెదవు!
తేటీ! ఇంత నీచత్వమా?

*　　*　　*

## కస్తూరి

ఓ కస్తూరీ! పరిమళ వస్తువు లన్నిటిలోనూ నాదే అగ్రతాంబూలమని మిడిసి పడుతున్నావా? కిరాతులకు భయపడి ప్రాణాలు అరచేతుల్లో పెట్టుకుని మీ తండ్రి ఏ కొండగుహలోనో తలదాచుకుంటే నువ్వు అతడి ఉనికిని శత్రువులకి తెలియపరచి, అతడి ప్రాణాలను నిలువునా తీసేస్తున్నావు కదుటే, పాపిష్టిదానా!

## మాలినీ

అయి బతగురుగర్వం మాస్మ కస్తూరి! యాసీ
రఖిల పరిమళానాం మౌళినా సారభేణ
గిరిగహన గుహాయాం లీన మత్యంత దీనం
స్వజనక మమూ నైవ ప్రాణహీనం కరోషి

## చంపకమాల

పరిమళ శస్త్ర వస్తు సమవాయము
లోపల మౌళినంచు క
స్తూరి! గురు గర్వితాత్మవయి
తూలుట భావ్యమె నీకు చెప్పుమా

పరులకు దుర్భరమ్మై గహన పర్వత
గహ్వరమందు నెక్కొత్తో
తిరిగెడు కస్తూరిమృగి నతిదీనయై
ప్రాణమ్ములన్ ప్రార్థింపవో.

* * *

ఓ కస్తూరీ! ఒక్క పరిమళం తప్ప నీలో మరో సుగుణం ఏదీ లేదు. కర్పూరంలో పరిమళమూ, శీతలతా, నిర్మలతా, సుకుమారతా కూడా ఉన్నాయి. కనుక అనవసరంగా గర్వించకు.

## ఆర్యా

మృగమద! మాకురు గర్వం
పరిమళమాత్రేణ తత్త్వ ము స్వయాసి
పరిమళ శీత లతా ని
ర్మల తా సుకుమారతా చ కర్పూరే

## ఆటవెలది

పరిమళమ్ము తక్క మరి యేమియును లేని
మృగమదంబ! గర్వమేల నీకు?
చలువ నిర్మలతయు సౌకుమార్యంబును
కమ్మతావి కలవు కప్పురమున

* * *

## సింహపిల్ల

ఒక పండు ముసలివాడు, రేపో మాపో జారి పడిపోయే పొల్లు పండులా ఉన్నాడు. చేతికర్ర ఉంటంతో! లేవబోయి మళ్లీ మంచంమీద పడిపోతూ వచ్చాడు. ఆయన మనుమడు—పైలాపచ్చీసు వయస్సులో ఉన్నవాడు—తాతగారి అవస్థ చూసికూడా చూడనట్లు తప్పుకుని వెళ్లిపోయాడు. ఈ పరిస్థితి గమనించిన ఓ పెద్ద మనిషి ఆ యువకుణ్ణి మందలిస్తున్నాడు.

మా తాతగారు ఎటువంటివారో నువ్వు ఎరగవురా అబ్బీ! కారులో ఆయన కండలు తిరిగిన వస్తాదు. ఆయన పేరు చెబితే ఎక్కడివాళ్లు అక్కడ గప్‌చిప్. తన మాటకి ఎదురన్నదే తెలియనివాడు మహా రాజులా బతికేడు. ఈ నాటికి ముసలికాలంలో ఇల్లా ఒక్కువారిన వాడు అయిపోయాడు. ఆయనపట్ల నీకీ ఉదాసీనత తగదోయి. ఎప్పటికో అప్పటికి నీకు కూడా ఇటువంటి స్థితి రాకపోదని తెలుసుకో.

అడవిలోఉన్న అశేష మృగకులాన్ని తన చెప్పు చేతల్లో పెట్టుకుని చిరకాలం పరిపాలించిన మృగేంద్రుడు ఈ నాడు ముసలివాడై విధి వశాత్తూ కుక్కలచేతా నక్కలచేతాకూడా అవమానింపబడుతూ ఉంటే నీకు ఏమీ పట్టనట్లుగా విదలించుకు పోతావేమిరా సింహకుమారా! నీకు మాత్రం ముందుముందు ఇటువంటి పరిహాసస్థితి రాకుండా ఉంటుందా?

## శిఖరిణి

చిరం శాసిత్వాయం మృగపతి
రశేషం మృగకులం
జరాజీర్ణో యాతః పరిభవ
పదత్వం విధి వశాత్
ఉదాసీనస్త్వేష్వైర్యది తరుణ
కంఠీరవ! గతి
స్తవాప్యేవం రూపా కిమున
భవితా జమ్బుక వృత్తేః.

## మత్తేభ విక్రీడితం

చిరకాలమ్ము సమస్త జంతు కులమున్
జేగీయ మానంబుగా
పరిపాలించిన సింహ మిప్పుడు
జరాభారమ్మునన్ దుస్థితిం
బొరయన్, సింహ కుమార!
సాయమునకున్ బోవైతి—మన్నింతు
పరిహాస స్థితి కొంకినక్కగమిచే
ప్రాప్తించు నీకెన్నియున్.

*

## కుక్క

ఎంగిలి విస్తరాకులకోసం నీ జాతివాళ్లతో పోటీపట్లు కలియబడి కొట్లాడవే కొట్టుకుంటే కాని

మహారాజులకు స్త్రైతన్మూ స్పృహణీయమైన పట్టపు
టేనుగును చూచి మొరుగుతూ వెంఝకే?

తన వీధికి చీటికీ మాటికీ కాలు దువ్వు
తూన్న భైరవస్వామి అనే క్షుద్ర పండితుణ్ణి ఉద్దే
శించి చెప్పినది ఇది.

## వసంత తిలక

ఉచ్ఛిన్నశృంఖల నిచయే నిజజాతి వర్గై-
ర్యుద్ధం కురుష్వ కలహప్రియ! సారమేయ!
పూజ్యం విలోక్య నరదేవ గృహే కరీంద్రం
మారోదనంకురు ఫలం నహితేఽస్తి కించిత్.

## ఉత్పలమాల

ఎంగిలి విస్తరాకులకు నేడ్చుచు
నీ స్వజనంబు తోడుతన్
సంగర మాచరింపదగు జాగిలమా!
కలహ ప్రియమ్ము ము

ప్పొంగగ— కాని వ్యర్థముగ
భూధవ మందిర పూజ్యభద్ర మా
తంగముగాంచి కూయకుము
తజ్జ్ఞలు నిన్నని నవ్వి పోవగన్.

* * *

## హిమాలయం

ఓ హిమవంతుడా! చెట్లను నిస్త్రాణం చేయగల,
లోకులకు బాధ కలిగించగల ఈ మంచు దిబ్బలలో
ఏ సుగుణాన్నిచూచి తలకెత్తుకున్నావయ్యా!

లోక కంటకులైన వారిని చేరదీసిన రాజును
నిందిస్తున్న సందర్భం ఇది.

## ఆర్యా

తరుకుల సుషమాప హరాం
జనయంతీం జగతి జీవతార్తిమ్

తేన గుణేన భవాని
తాత! హిమానీ మివమాం వహసి?

## ఆటవెలది

నిఖిల వృక్షకోటి నిస్త్రాణ మొనరించి
అఖిల జీవరాశి కార్తిగూర్చు
హిమ సమూహమందు వేగుణోన్నతిఁజూచి
నెత్తికెత్తుకొంటి ఉత్తరాద్రి!

* * *

## శంఖం

మహాసముద్రంలో పుట్టేవు. స్వచ్ఛ సుందరమైన శరీరం నీది. సాక్షాత్తూ శ్రీ మహావిష్ణువు చేతిలో నీ నివాసం. ఇన్ని సద్గుణాలు కలిగిన ఓ శంఖమా! నీ హృదయంలో కుటిలతను పోనిచ్చుకున్నావు కాదు కదా'

నువ్వు సార్వభౌముల ముద్దుల పట్టివి. జగదేక సుందరి నిన్ను కన్నది. నీ రూపము, శౌర్యము అపూరూపమైనవి. నీవు చదివినది పరమ పవిత్రమైన 'కురాను' అయినప్పటికీ ఓ ఔరంగజేబా! నీ హృదయంలో కుటిలతతప్ప మరోటి లేదుకదా!

## ద్రుత విలంబిత

జలనిధౌ జననం ధవళం వపు
ర్మురరిపో రపి పాణితలే స్థితిః
ఇతి సమస్త గుణాన్విత! శంఖ! భోః!
కుటిలతా హృదయే న నివారితా

## చతుష్పద

శరధిం జననము, స్వచ్ఛ శరీరము
మురరిపు చేతుల మురియుట మొదలగు
అరుదగు సుగుణము లబ్బిన శంఖమ!
ఎరుగవు కుటిల విహీనత నెదలో

* * *

## కోతి

ఎవడో బుద్ధిహీను డొకడు ఒక కోతి మెడలో పూలదండ వేశాడు. ఆ కోతికి దాని ఉపయోగమేమిటో తెలియలేదు. ఆ దండని పీకి, వాసన చూసి, ముడిచి పృష్ఠంకింద పెట్టుకుంది.

ఒకానొక సుల్తానుగారికి తెలివిమాలిన పండితు డొకడు ఒక ఉద్గ్రంథాన్ని సమర్పించాడు. ఆయన అందులోనుంచి ఆకులు తీసి హుక్కాగొట్టం వెలిగించుకున్నాడు.

## అనుష్టుప్

హారం వక్షసి కేనాపి
దత్తమజ్ఞేన మర్కటః
లేఢి జిఘ్రతి సంక్షిప్య
కరోత్యున్నత మాసనమ్

## ఆటవెలది

మర్కటమ్ము మెడను మందబుద్ధి యొకండు
హార మొకటి వేసె నాదరమున
కోతి దాని నాకి, గోకి. వాసన చూచి,
ముడిచి పెటుకొనియె ముడ్డి కింద

* * *

[ఇందులోని తెలుగు పద్యాలు డా. మహీధర నళినీమోహన్ అనువదించిన భామినీ విలాసంలోనివి.]

---

# శ్రీనాథుడు - 'పొగడదండ'

## శ్రీ మోనా

కవిరాజు కంఠంబు కౌఁగిలించెను కదా
పురవీధి నెదురెండ పొగడదండ
సార్వభౌముని భుజాస్తంభ మెక్కెను గదా
నగరి వాకిటనుండు నల్లగుండు
వీరభద్రారెడ్డి విద్వాంసు ముంజేత
వియ్య మందెను గదా వెదురు గొడియ
ఆంధ్ర నైషధకర్త యంఘ్రి యుగ్మంబున
తగిలియుండెనుగదా నిగళయుగము

బిల బిలాక్షులు తినిపోయె తిలలు పెసలు
కృష్ణవేణమ్మ గొనిపోయె నింత ఫలము
బొడ్డుపల్లెను గొడ్డేఱి మోసపోతి
నెట్లు చెల్లింతు టంకంబు లేదు నూర్లు

(శ్రీనాథుని చాటువు)

పై ప్రసిద్ధమైన చాటువు శ్రీనాథ కృత మనుట నిర్వివాదాంశము. ఇది అతని అవసాన కాలమునకు సంబంధించినది. ఒడ్డెరాజులగు గజపతుల కాలమున శ్రీనాథుడు చేసిన బావన సేద్యమునకు ఫలితము. పై పద్యము ఒడ్డెరాజుల కాలమున పన్నులు కట్టలేనందుకు విధించెడి శిక్షలను తెల్పుచున్నది. శ్రీనాథుడు తన జిహ్వకు కవిత్వము నైసర్గికము కాన కనకాభిషేకానికే కాదు పద్యాలు చెప్పింది—అష్ట కష్టాల పాలైన అవసానదశను కూడా కవిత్వంలోనే చెప్పుకొన్నాడు. పై పద్యంలోని 'పొగడదండ' అమనది ఏవిధమైన శిక్ష? ప్రకృతము నా వ్యాసాన్ని దానికే పరిమితం చేస్తాను.

కీ. శే. మల్లంపల్లి సోమశేఖర శర్మగారు 'పొగడదండ'ను గూర్చి— 'Srinatha says that he was made to stand in hot sun with the 'Pogada-danda' around his neck' (History of the Reddy Kingdoms page—234) అని సెలి విచ్చియున్నారు. దీనిలో 'పొగడదండ' అను శిక్ష వివరణము లేదు.

ఈ 'పొగడదండ'ను గూర్చి శ్రీ బండారు తమ్మయ్యగారు—'పై పద్యములోని ప్రథమ పాదములోని ఉత్తరార్ధములో 'ఎదురెండ పొగడదండ' అని కానీ 'ఎదురెండఁ బొగడ దండ' యని కానీ పాఠ మెట్లున్నను నందలి భావమవ నేమో గోచరించుట లేదు. పద్యమందలి విషయము, ఒడ్డెరాజులు పన్నునీయజాలని శ్రీనాథు నవమానించి బాధ పెట్టిన విధము 2, 3, 4 పాదములలోని 'నల్లగుండు' 'వెదురుగొడియ' 'నిగళయుగము' అను శబ్దములీయవమతి విధానమును ప్రకటించుచుండగా గౌరవ స్ఫోరకమగు 'పొగడదండ'కు మొదటి పాఠమున ప్రసక్తి సంగతముగా లేదు. శ్రీనాథుని పాఠము 'ఎదురెండ పొరకదండ' అనియై యుండుననియు శ్రీ వసురాయ కవిశేఖరులు నాతో ముచ్చటించిరి. అది యుచితమే యని నా తలంపు. విజ్ఞు లాలోచింతురు గాక యని తెలిపియున్నారు. ( . శ్రీనాథకవి ప్రయోగములు : అథో జ్ఞాపిక. Page 124 (42—10) 1935—36 ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక సంపుటం 24 సంచిక—4.)

పై వ్యాసమునకు జవాబుగా ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక Page 50(42–10–1936/37)లో శ్రీ కా. సూ. (పేరు తెలియదు) అను వారు క్రింది విధముగా తెలిపియున్నారు. 'పువ్వుల దండయే' 'పొవడ దండ'. 'పొగడ దండ'ల క్రింద నా నోట నా నోట

మాఱినదేమో ! వారా వ్యాసములోనే అందులకు వుప పత్తిగా తిమ్మ కవి 'శేష ధర్మముల' కావ్యములోని క్రింది పద్యమును—

> గీ॥ 'బురదగుంటలో ద్రొబ్బియుఁ బొగడ దండ
> చుట్టిరాయెత్తి యిల్లడవెట్టి మఱియు
> నెంత బాధించినను ధన మీయ డయ్యె'

దీనికి సంస్కృత మూలములు .......

శ్లో॥ శృంఖలా శత సంయుక్త ..........
బహుధా భజ్యమానో పితదానో ద త్తవ్యాధనమ్'

అని యిచ్చియున్నారు. ఈ శ్లోకంలో బురదగుంట ప్రసక్తి కూడా లేదు. 'శృంఖలా శత సంయుక్తః' అనుటకు 'పొగడ దండ' అని తెనిగించినాడేమో! పూలదండలు వధ్య చిహ్నములుగా అభిజ్ఞాన శాకుంతల, మృచ్ఛకటిక, ముద్రారాక్షసము మొదలగు సంస్కృత నాటకములలో యున్నవి. కానీ శ్రీనాధుని శిక్షించిన గజపతుల కాలముదాకా పై సంస్కృత నాటకముల లోని యాచారమట్లే యున్నదా ? పై నాటకముల లోని వధ్యు లిద్దరూ అప్పులో లేక పన్నులో ఎగవేసి నందువలన ఆ శిక్ష పొందినవారు కారు. గజపతిరాజుల కాలమున శ్రీనాథునికి మరణదండన విధించినట్లు ఆధారములేవియును లేవు. ఆయన బొడ్డుపల్లెలో చేసిన సేద్యానికి నష్టపొయ్యాడు. చెల్లించవలసిన పన్ను ఏడుమార్ల టంకాలు చెల్లించలేని నిస్సహాయ స్థితిలో నిల్చిపొయ్యాడు. అందుకు వారు విధించిన శిక్ష పై విధముగా నుండినది. అ శిక్షలో మొదటి పాదములో 'పొగడదండ' మెడను కౌగిలించుకొన్నట్లు నగ్గరి మొగసాలమందు నల్లగుండ్లు భుజాస్తంభా న్నధిరోహించునట్లు, ముంజేతితో వెదురుగొడియ వియ్యమందినట్లు, పాదాలకు ఇనుప గొలుసుల జంట తగిలించబడినట్లు 2, 3, 4 పాదాలలో వ్యక్తమౌతున్నది. 'పొగడదండ'కు శబ్దరత్నాకరంలో అర్థం యివ్వబడలేదు.

బొగడ:; (N. S. P.l.u) కరరభూషణము .......... వి ర్ణయ .......... బొగడ నామమనుమండు (బ్రౌణ్యము P 705) పొగడ (రూ) దండ. A ..ide, A garland, or collar, a necklace. దండలిచ్చుట reeling, staggering (బ్రౌణ్యము)

V. S. ఆప్టే మహాశయులు తన నిఘంటువులో

దండః or దండ: (1) A stick, stiff rod, mace, club, cudgel, (15) Chastisement, corporal Punishment ingeneral, 17 Attack, assault, Violence, Punishment,

వకుళ or బకుళః: The fragrant flower of Vakur Tree'

అని యిచ్చియున్నారు. సాహిత్య అకాదమీయులు ప్రచురించిన 'శ్రీనాథ పద ప్రయోగకోశములో' 'పొగడ దండ' అను ప్రయోగమునకు పై పద్యములోని ప్రథమపాదాన్నే వుదాహరించారు. శ్రీనాదుడు యిత రత్ర యీ 'పొగడదండ'ను ప్రయోగించ లేదనుట సుస్పష్టము. కావున పరిశోధకులకు శ్రీనాధుని ప్రయోగాలలో 'పొగడదండ'కు పై వ్యుత్పాదమే శరణ్యము. నాకు తెలిసినంతవరకు శ్రీనాధునికి పూర్వపు కవులగు కవిత్రయము, నాచన సోమన మొదలగు వారల్లు దీనిని ప్రయోగించినట్లు లేదు. ఇక యీ పొగడదండ విషయమును పరిశీలించుటకు శ్రీనాధుని సమకాలిక కవుల తర్వాత కవుల ప్రయోగములే ఆధారములు.

కీ. శే సురవరం ప్రతాపరెడ్డిగారు వారి ఆంధ్రుల సాంఘిక చరిత్రలో యిట్లు తెలిపి యున్నారు! (Page 135)

వారు శ్రీనాధుని పై పద్యాన్నుదాహరిస్తూ 'ఆ నాడు పన్నులియ్యని వారి నెన్నివిధముల కష్ట పెట్టుచుండిరో యీ పద్యము బాగా విశదపరచినది. విచిత్రమేమనగా క్రీ. శ. 1900 వరకు హైద్రాబాద్ సీమలలోని పల్లెలలో పోలీసు, పట్వారీ లివే పద్ధతులు అవలంబిస్తూ వుండిరి. ఊరి ముందర చావడి యుండెడిది. అందులకు చేతులకు కట్టే బేడీలు వేయు 'కోడాలు' ఉండెడివి. రెండు చేతులను మణి కట్టువరకు .......... ఒక వెదురు బొంగును (గొడిగను) వాటికి బిగించువారు మరియు

ఎండలో నిలబెట్టి బండలెత్తుట లేక ఒక పెద్ద మొద్దుకు గొలుసునుకట్టి దానిని కాళ్లకు తగిలించుట ఇట్టివన్నియు చేయిస్తూ వుండిరి. అనగా ఒడ్డెరాజుల సృష్టి దేశమంతటను వ్యాపించెనన్నమాట. అయితే తటాలున ఒడ్డెరాజులే యీ శిక్ష లన్నింటినీ ప్రవేశ పెట్టిరనుట కాదు.అంతకు ముందిట్టివి యాచరమందుండె నేమో!'

పై వివరణ 'పొగడదండ' ఎటువంటి శిక్ష అను విషయమునే స్పృశించుట లేదు. తర్వాత ఆ గ్రంథములోనే 'విజయనగర సామ్రాజ్యకాలము' అనే శీర్షిక క్రింద (Page 279 ఆంధ్రుల సాంఘిక చరిత్ర.)

'ఆ కాలమున దొంగలు తప్పు నొప్పు కొననిచో.'

'ఇదుమ కట్టున వేడి యెండలో
బడియ వీపులమీద చాపరా లెత్తి
పొగడదండలు వైచి పోనిక
యెదుట బెగడ దిట్టుచు నడ్డపెట్టి...'

(పరమయోగి విలాసము (ద్విపద) పుట 324)

బాధించెడివారు ఇదుమ కట్టున అన ఇంటి ముందట అని అర్థ మనుకొందును. పొగడదండ అను పదానికి శ. ర. లో అర్థము లేదు. తప్పు చేసినవారికి పొగడపూల దండవేసి, పూజించి ప్రార్థించి తప్పు నొప్పించుకొనరు కదా! శ్రీనాథునికి చేతికి కట్టె కోడము వేసి వెదురుగూటముతో బిగించి గుండు వెత్తించి వీపున బండలు బెట్టిరి. ఆ శిక్షలలో 'పొగడదండ'ను కూడా వేసి శిక్షించిరి.'

'కవిరాజు కంఠంబు కౌగిలించెను కదా పురవీధి నెదురెండ పొగడదండ' అని యతడు దుఃఖించెను గదా! ఇచ్చట కూడా వేడి యెండలో నిలబెట్టి బండ లెత్తి 'పొగడదండలు' వేసిరన్నారు. అవేటివి? అని పొగడపూలవలెనుండు యినుప సంకెళ్లో, త్రాళ్లో అయియుండును.'

ఇచ్చట 'పొగడదండ' యనగా పొగడపూల వలె నుండు ఇనుప సంకెళ్లో, త్రాళ్లో అయియుండును అని కొంత వివరణ మున్నది. 'పొగడదండ' యనగా పొగడపూల వలెనుండు యినుప సంకెళ్లనుటకు వారు ఆధార మేమియును యివ్వలేదు. పై ద్విపదలోని 'పొగడదండలు వైచి పోనిక' అను దానిలోని పొగడ దండకు యినుప సంకెళ్లనిగానీ, పొగడపూల వలె నుండు త్రాళ్లనిగానీ స్ఫురించుటలేదు. పై పాదములో 'పోనిక' అను పదము వలన, పొగడదండ వేయుటవలన కదల వీలులేదని తెలియుచున్నది. మామూలు యినుప సంకెళ్లు వేసినా పొగడపూల వలె నుండు ఇనుప సంకెళ్లు వేసినా బాధ మాత్రం ఒకటిగనే వుంటుందేమోగానీ పెద్ద మార్పుండక పోవచ్చు. ఇక త్రాళ్లను పొగడపూలుగా చేసివేయడం అంత సులభసాధ్యం కాదనుకొంటాను. అట్లు వేసినా దాని వల్ల బాధితునకు మామూలు త్రాళ్లు 'పొగడదండ'గా వేసినప్పటికంటె ప్రత్యేకమైన బాధేమి కలుగక పోవచ్చును. కాబట్టి పొగడదండకు పై విధంగా శబ్దగతమైన అన్వయం కుదరదు.

ఆదే గ్రంథంలో 280 పుటలో

*తరల॥ 'తగునె వన్నిద మీక
యీ గతిం దప్పు మానము దాల్పగా
దగవు నీకును నాకుం బెద్దల దండం
బెట్టెద జండినై
గగన కేశయటంచుం జందురు
కావి సేలు గళంబునన్
బొగడదండ యొనర్చి నావిట
భూసురాగణి దిట్టయై.'

దీనినిబట్టి 'పొగడ దండ' లక్షణము కొద్దిగా వెల్లడి యౌతున్నది. మెడలో త్రాడో, గొలుసో, దుప్పటో, పెళ్లాయో పెనవేసి, ఇయ్యవలసిన పైక మిచ్చువరకు కదలరాదు సుమా! అని ఆజ్ఞ పెట్టుటకు పొగడదండ వేయుట అని చెప్పవచ్చును.'

ఈ వివరణ కొంత విపులముగా నున్నది. దీనిలో పొగడల వలె చేసిన త్రాడు గానీ, గొలుసు

* నిరంకుశోపాఖ్యానం—ఆ—3—ప—26—
కందుకూరి రుద్రకవి కృతము.

గానీ, దుప్పటి గానీ, సెల్లా గానీ అనే నిశ్చయం చెప్పలేదు. కాబట్టి 'పొగడ దండ'లో పొగడపూల ప్రసక్తి లేదు. ఈ పొగడదండము గూర్చి కీ. శే. కందుకూరి వీరేశలింగంగారు గానీ, శ్రీ చాగంటి శేషయ్య గారు గానీ, కీ. శే. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు గానీ, శ్రీనాథుని సాహిత్యంలో పరిశోధనచేసి డాక్టరేట్ తీసుకొన్న శ్రీ కొర్రపాటివారు గానీ, శ్రీ ఆరుద్ర గానీ వివరణ యివ్వలేదు. శ్రీ వసురాయ కవీంద్రుల పొగడ దండను 'పొరకదండ' యయి యుండవచ్చుననుట కూడా సంగతముగా లేదు.

పొగడ యనగా బ్రౌణ్యమిచ్చిన యర్థము ప్రకారము కంఠభూషణము అని కూడా యున్నది. పై పద్యములో శ్రీనాథుడు శిక్షితుడు కావున అతనికి కంఠభూషణమునుంచి గౌరవించియుండుట అసంభవము. ఇక 'దండ' అను పదమునకు ఆప్టే గారి The Practical Sanskrit English Dictionary ప్రకారము Corporal Punishment లేదా Punishment అనే అర్థములున్నవి. కాబట్టి దండ అనగా శిక్షయని గ్రహించుట యుక్తం. ఇక 'పొగడ'కు కంఠభూషణమను బ్రౌణ్యార్థమును కంఠమున వేసెడి ఉపకరణముగా తీసుకొనిన కొంత చిక్కు సడలును. ఇప్పుడు 'పొగడదండ' మిశ్ర సమాసమగును. శ్రీనాథుడు 'కలకంఠుడు' 'ప్రాణగొడ్డము' మొదలగు మిశ్రసమాసములను ప్రయోగించియున్నాడు.

కాన యీ పొగడదండకూడా ఆ కోవకు చెందిన మిశ్ర సమాసముగా గ్రహించవచ్చును. పొగడయను అచ్చిక పదము దండయను సంస్కృత పదంతో సమసించాడు. దీనికి కంఠప్రదేశమును బాధించు శిక్ష అని గ్రహించిన సరిపోవు ననుకొందును. నేతిబీరకాయలో నేయి ఎట్లు లేదో యీ 'పొగడదండ'లో పొగడ పూలు లేవు. బీరకాయ ఎట్లున్నదో దండనము (Punishment) అను అర్థములో 'దండ' వున్నది.

ఈ పొగడదండనుగూర్చి సుప్రసిద్ధులగు కొందరి పండితుల యభిప్రాయము లిట్లున్నవి.

తే॥ వనిత యిటువచ్చి నీవు నీ వలయు సోదె
గొనుము—దప్పున్న మతినాకుఁ బెనగుఁ జోటు
గలదె? మొలనూలున గట్టువఘుడుఁ
బూనుమను నీవు మెడబెట్టు పొగడ దండ!

(ప్రభావతీ ప్రద్యుమ్నము ఆ 5—వ 120
అకాడమీ ప్రతి (Page 142)

ఈ పద్యమునగల 'పొగడదండము' బ్రహ్మశ్రీ గడియారం వేంకటశేషశాస్త్రిగారు అధోజ్ఞాపికలో పొగడ పూలదండ, కాలికి మెడకు బిగియకట్టు దండనము అని వివరించియున్నారు. కథలో ప్రద్యుమ్నుడు ప్రభావతితో పై విధముగా చెప్పును.

బ్రహ్మశ్రీ నపులారి మాలెకొండయ్య పంతులు గారు 'పొగడదండ యనగా మెడకును మీ గాలికిని లాగి అంటుగట్టు 'శాడు' అంటూ యీ క్రింది వుదాహరణాన్ని చూపించారు.

క॥ చూచిన యంతనే మదనుండా
చపలుని నడ్డగించె నా తరువాతన్
వాచాగోచర దుర్మదవై చిత్రిం
బొగడదండ వైచెం బెలుచన్'

(శుకసప్తతి ఆశ్వాసము 2—6 వ కథ 19 పద్యం)

'ఇనుప బొగడల దండయనియు, వకుళమాలక యనియు వ్యాఖ్యానించుట శబ్దతత్త్వ మెఱిఁగినదిగా దోపదు'

(విక్రమ సింహపురి మండల సర్వస్వం (Page ?21) అని సెలవిచ్చియున్నారు.

పై యిరువురు వివరణలవలన 'పొగడదండ' యనగా మెడకువేసెడి దండనము అని తెలుచున్నది. ఈ వివరణలు చాలా సమంజసముగా నున్నవి. ఇక యితర కవుల ప్రయోగములుకూడా 'పొగడదండ' యనగా మెడకు మీ గాలికి తగిలించెడి బంధనము అనియు అది ఒక విధమగు శిక్షయనియు తెల్పుచున్నవి.

శ్రీరాముడు సముద్రునిపై బాణము వేయుట కుద్యుక్తుడైన సందర్భములో ధరణిదేవుల రామయామాత్యుడిట్లు వ్రాసినాడు.

# మృచ్ఛకటికము - సాంఘిక వ్యవస్థ

## శ్రీ యామిజాల పద్మనాభస్వామి

(గత సంచిక తరువాయి)

'మృచ్ఛకటికం' అనుసరించి మునుపటి వ్యాసంలో సంఘ జీవితం కొంత అనాటిది తెలిపి వున్నాను. గృహస్థులు నిత్య జీవితములో తప్పక దేవ పూజలు చేస్తూ, భూత బలులు వేస్తూ వుండేవారు. చారుదత్తుని వంటి బ్రాహ్మణ వర్తకు లుండేవారు. రాజవీధులలో వేశ్యాదులు సాయం సమయాలలో వాహ్యాళి తిరుగుతూ వుండేవారు. రాత్రులందు ప్రజా భద్రతకై తలారులు గస్తీ తిరిగేవారు. జూదరులు పాడు దేవాలయాలు క్రీడారంగాలుగా జూదమాడేవారు. ఇక యీ వ్యాసములో ఇంకా యింకా కొన్ని తెలుపు తున్నాము.

జూదం ఆడి ఓడిపోయినవాడు సంవాహకుడు. వాడు చారుదత్తుడు పచ్చగా వున్నపు డతనికి కాళ్లు పిసుకుతూ వుండేవాడు. అదే సంవాహక వృత్తి. ఆ వృత్తితో జీవించేవారు కొందరుండేవారు. చారుదత్తుడు రిక్తుడు కాగానే అక్కడ భృతి లేక పోయింది. ఇక ఎలా జీవించడం ? ఆలోచించాడు. జూదరిగా మారిపోయాడు. దానివల్ల మొదటికే మోసం వచ్చింది. నెగ్గలేకపోయాడు. అసలు జూదమే అలాటిది. నల ధర్మరాజు లంతటివారే అచ్చా పకీరులు. అల్లా పకీరులూ అయిపోయి అడవులుపట్టి పోయారు. ఇక కాసుకి గతిలేని సంవాహకుడి పాటు చెప్పాలా ?

సంవాహకుడు సరాసరి వసంతసేన యింటిలో ప్రవేశించి అప్పిచ్చినవారినుండి తప్పించుకున్నాడు. వసంతసేన వానినుండి సంగతి అంతా తెలుసుకున్నది. తా వలచిన చారుదత్తుని సేవకుడని తెలియగానే యెంతో మర్యాదచేసి వాని అప్పు తానై తీర్చింది. సంవాహకు డాశ్చర్యపడ్డాడు. 'అమ్మా ! మీ యింట సంవాహకుడుగా వుంటాను' అన్నాడు. ఆమె అంగీక రించ లేదు. సరే యిక నేను చేసేదేమీ లేదు. బౌద్ధ సన్న్యాసినయిపోతానని వెళ్ళిపోయాడు. ఆనాడు బౌద్ధ మతం సామాన్యులను అంత తేలికగా తనలో కలుపు కొనేది. సన్న్యాసినైపోతానని నిశ్చయించుకొని వసంత సేనతో ఇలా అన్నాడు.

'జూదమాడుచు నిందన్క చోరుని వలె
చాటు చాటున తిరిగితి సర్వులకును
బౌద్ధ సన్న్యాసినై నేను భయము తీఱ
మసలుచుండెద నిక రాజమార్గమంద'—

ఏ సన్న్యాసి అయినా రాజమార్గములో నిర్భయంగా తిరగవచ్చు. కాని ఆనాడు బౌద్ధ సన్న్యాసులంత నిర్భయంగా రాజమార్గాలలో తిరిగేవారన్న మాట !

పాడు దేవాలయాంలో జూదరుల ఆటలు జరుగుతూన్నట్టుగానే దేవాలయాలలో వేశ్యల మేజా వాణీలు, సుప్రసిద్ధ వైణికుల పాటకచ్చేరీలూ జరు గుతూ వుండేవి. ఆనాడు ఉజ్జయినిలో రేభిలుడు వీణావాదనంలోనూ, గాత్రంలోనూ గురు స్థానీయుడు. ఆయన పాటను చారుదత్తుడు విని వచ్చి ఆ రాత్రి ఎంతో గొప్పగా చెప్పాడు. ఆ గొప్పదనాన్ని విదూష కుడు మైత్రేయుడు సమర్థించలేదు సరే కదా ఆక్షే పించాడు పైగా. వాని ఆక్షేపణ ఎంతవానికీ నవ్వు పుట్టించి 'ఔను గాబోలు' అని అనిపించుతుంది కూడా !

'నా కాడుదాని సంస్కృతము విన్నను, మగ వాని కాకలీగీతము విన్నను నవ్వులాటగా నుండును. ఆడుది సంస్కృతభాష చదివినప్పుడు శుక్కుస్త్రీతాడు

వోసిన యోఁ బెయ్య వలె సూ సూ సూ యనును. మగవాడు సంగీతము పాడినచో వృద్ధ పురోహితుడు మెడనిండ నెండిన పూవు దండలు దాల్చి వేదమంత్రములు చదివినట్లుండును.' ఇది విదూషకుని తీర్పు.

స్త్రీల సంస్కృత భాషోచ్చారణపై పురుషుల గానముపై శూద్రక మహాకవి యింత విసురు విసిరాడు. ఈ విషయం మాత్రం కొంచెం అతిగా తోస్తుంది నాకు. ఈనాడు సంస్కృతం చదువుకొన్న, చదువుతూన్న స్త్రీ లెందరో వున్నారు. శూద్రకుడు చెప్పిన మాట అందరికీ సమన్వయిస్తుందా ? అని నా ప్రశ్న. అలాగే పురుషుల సంగీతం కూడా! ఏ ఒకరిద్దరో తప్పిస్తే పురుషుల సంగీతం సర్వేసర్వత్ర ప్రశంసింప దగ్గదిగానే వుంటూంది. ఇది యిలావుంచి ముందుకి వెళ్లదాము.

చారుదత్తుడు విదూషకుని విమర్శకి తగిన జవాబిచ్చాడు.

'రక్తిగా తీపుగ మనోహరమ్ముగ లలి
తముగ సమముగ భావాన్వితంబు గాగ
స్ఫుటముగా పాడె లేకున్న పొగడ నేల
యువతియే మమ్ము చాటుగా నుండెనేని'—

మొట్ట మొదట, అంటే శకారుని బారినుండి తప్పించుకొని వసంతసేన చారుదత్తుని యింట ప్రవేశించి కొంతసేపుండి తిరిగిపోతూ అమూల్యమైన తన బంగారు నగను చోరులకు భయపడి చారుదత్తుని కడ నుంచి వెళ్ళిపోయింది. ఆ నగను జాగ్రత్తగా కాపాడ వలసిన బాధ్యత చారుదత్తునిపై ఉంది. పగలు సేవకుడు వర్ధమానకుడు, రాత్రి విదూషకుడు మైత్రేయుడు దానిని కాపాడుతూవుండేట్లు వంతులు వేసుకున్నారు.

ఆ రాత్రి మైత్రేయుడు చికాకుపడ్డాడు. 'యీ దిక్కుమాలిన సువర్ణభాండ మింకను పోకున్నది. ఈ తొత్తుకొడుకు నగ నపహరించుట కంత యుజ్జయినీ పట్టణములో ఒక్క దొంగకే కరవైపోయినది కదా!'

అని అనుకుంటూ పడుకున్నాడు. నావి కోరి పండింది. అందరూ నిద్రపోతున్నారు. 'శర్విలకుడు' అనే పేరుగల దొంగ వచ్చాడు.

శర్విలకుడు యోగ్యమగు బ్రాహ్మణకుల మంతయు కటిక చీకటిపాలు గావించినవాడు. చతుర్వేద పారంగతుడైన బ్రాహ్మణుడు. అయితే ఎందుకీ చోర వృత్తి ? వసంతసేన దగ్గర ఒక చెలికత్తె వంటి దాసి ఉన్నది. దాని పేరు మదనిక. తగినంత సొమ్మిస్తే దానిని వసంతసేన యిచ్చివేస్తుంది. మదనికపై వానికి మనసు...తాను వచ్చినది బ్రాహ్మణుని యిల్లని అనుకోలేదు. చౌర్యములో కూడా అవివేకంగా ప్రవర్తించడు. తన దొంగతనం గురించి మదనికతో యిలా అన్నాడు.

'సొమ్ములు దాల్చుటకై వికచ
సూనలతం బురుణించు స్త్రీల ద్ర
వ్యమ్మునకై హరింపను, సవార్థము
ప్రుచ్చిల, భూమిదేవ వి
త్తమ్ములు దొంగిలన్, పగలు
దాల్చిన పిల్లల పోలికేగ; చౌ
ర్యమ్మునగూడ నాకు కన
రానవివేకపు తుచ్ఛమార్గముల్'—అని.

ఈ శర్విలకుడు గజదొంగ. సామాన్యుడుకాడు. చౌర్యానికి సంబంధించిన తంత్రం అంతా వానికి కరతలామలకం. ఎక్కడ కన్నం తవ్వాలి? ఎలా తవ్వాలి? దొంగకు వుండవలసె సరుకు ఏమిటి? ఇంట్లో దీపంవుంటే ఎలా ఆర్పాలి? నిద్రిస్తూన్న వారు నిజంగా నిద్రిస్తున్నారా? కపట నిద్రలో వున్నారా? ఎలా గుర్తించాలి? యీ ప్రశ్నలకు సమాధానం శర్విలకుడు చారుదత్తుని యింట ప్రవేశించి అనిన మాటలవల్ల తెలుస్తుంది. తలుపు కిర్రు మంటే ఇన్ని నీళ్ల జల్లమంటాడు. చేతులు చల్లగా వుంటే చంకలలో పెట్టుకుంటే వెచ్చగా అవుతా యన్నాడు.

కార్తికేయుడు, దేవవ్రతుడు, కనకశక్తి, భాస్కరనంది చౌర్య తంత్రానికి ఆచార్యులు. కన్నం

తవ్వడానికి ఉపాయాలు నాలుగు. కన్నాలు ఏడు విధాలు...వివిగతా విషయాలు ప్రత్యేకించి చదివి తెలుసుకో వలసేవి. అది అలా వుండగా శర్విలక శకార పాత్రలు ప్రత్యేకించి వ్రాయవలసేవి. ఇంకొకప్పుడు వ్రాస్తాను. శర్విలకునివంటి చౌర్యశాస్త్రతంత్రపారీణులైన గజదొంగలు ఆ నాడు వుండే వారనేది ప్రస్తుతాంశం.

శర్విలకుడు విదురకోవున్న మైత్రేయుని చేతి నుండి సంగ్రహించిన నగ ఆ నాడు వసంతసేన చారుదత్తునింట దాచిబెట్టినది. అది యెత్తుకొనిపోయి ముందు మదనికకుచూపి ఆమె చెప్పిన ప్రకారం వసంతసేనకిస్తూ చమత్కరించాడు.

నా యిల్లు పాతది. కాపాడడం కష్టంగా వుంది కనుక నీ నగ నువ్వే భద్రపరుచుకో అని చారుదత్తుడు చెప్పినట్లు చెప్పాడు. దొంగతనం చెయ్యవచ్చుగాని అసత్యం ఆడకూడదా? రెండు గుణాలూ ఒక్కలాటివే. అది అక్క ఇది చెల్లెలు.

శర్విలకుడు వసంతసేన యింటికి రాగానే మదనిక ముందుగా కనిపించడం మాటాడడం అయింది. ఆ యిరువురి ప్రసంగాన్ని కిటికీదగ్గర చాటుగా ఉండి వసంతసేన విన్నది. ఓహో యీ యిరువురూ ప్రేయసీ ప్రియులా? మంచిది అని అనుకొని నగ తీసుకొంటూ తానూ చమత్కారంగానే జవాబిచ్చింది.

'ఈ నగతెచ్చి నీ కిచ్చిన వానికి మదనికనిచ్చి పెండ్లి చేసువలసింది' అని ఆయన (చారుదత్తుడు) సెలవిచ్చారు కనక యీమెను పరిగ్రహించవలసింది' అని అన్నది .............

ఆ నాడు విప్రులు దేవదాసీ కన్యలను పెండ్లాడే ఆచారం వున్నట్లు తెలుస్తూంది.

వసంతసేన మాట ప్రకారం శర్విలకుడు మదనికను తీసుకుపోతూండగా తెరలోంచి రాష్ట్రీయ శాసనం వినవచ్చింది.

'గోపాలబాలకుడు ఆర్యకుడనువాడు ఉజ్జయినికి రాజు అవుతాడని సిద్ధు డెవడో చెప్పాడట! ఆ మాటకి జడిసి నాటి పాలకుడు వ్రేపల్లెనుంచి ఆ గొల్లపిల్లవానిని రప్పించి బంధించి కారాగారములో పెట్టించాడు. కనుక రాజసేవకులందరూ తమ తమ పనులయందు జాగరూకులై ఉండండి'—అని.

సిద్ధులు భవితవ్యతను చెప్పగలరు. అది భారతీయులు ఆస్తికులందరూ అంగీకరించే విషయమే. దానిలో ఆశ్చర్యం లేదు. కనక ఉజ్జయిని పాలకుడు సిద్ధుని పలుకులకు జడుసుకున్నాడు. రామ రామ కలికాలపు లక్షణాలు ముదరపాకాన పడుతూన్న రోజులు వచ్చాయి. ఇప్పుడు సిద్ధులన్నా, యోగులన్నా, సన్న్యాసులన్నా సంఘములో మర్యాద కాస్త దిగనాసిగా వున్నట్లు చూస్తున్నాము. అసలు సన్న్యాసులలో కూడా కొందరు సన్న్యాస లక్షణాలను సన్న్యసించి అటు సన్న్యాసులు కాక యిటు సంసారులు కాక వుంటున్నట్లు చూస్తున్నాము. కనక సన్న్యాసుల మాటలకు తగిన విలువ యివ్వకపోవడం జరుగుతుందని అనుకోవలసి వస్తుంది. నగరవాసం సన్న్యాసులకు పనికిరాదని భారతం (పంచమవేదం) చెప్తూంది. ఏకచరులై వుండాలట యతులు. ఏకచరులంటే కొందరికి చటుక్కున అర్థం కాదు.

'ఏకం సత్ విప్రా బహుధా వదంతి'

'ఏకమేవా ద్వితీయం బ్రహ్మ ..

ఏకస్మిన్ బ్రహ్మణి పరతత్త్వే చరతి ఏకచరః—బ్రహ్మనిష్ఠా గరిష్ఠః'—

పరతత్త్వ మందే ధ్యాన నిష్ఠ కలవాడై సర్వసంగ పరిత్యాగియై అనేక నియమనిష్ఠలు కలవాడు యతి. ఇది శ్రుతులూ, ఉపనిషత్తులూ చెప్తున్నమాట. యయాతి తన దౌహిత్రులకు అష్టకాదులకు యుక్తాచారాలను వివరించి చెప్తూన్న సందర్భములో తురీయాశ్రమ వాసులనుగూర్చి చెప్పాడు. దానినే పైన ఎత్తి చూపాను. ఆ నియమాలను అనుసరించక

'యథేచ్ఛం విహార!'—అన్నట్లు సంచరించే వారు యతులవుతారా? అని సంఘంలో నేడు కొందరు ప్రశ్నిస్తున్నారంటే జవాబు చెప్పడానికి అసూచిత్యమే శరణ్యం అవుతూంది. ఇక ప్రకృతమనుసరామః'—

తెరలోంచి వినవచ్చిన మాటలు విన్నాడు శర్విలకుడు. ఆర్యకుడు శర్విలకుని ప్రియమిత్రుడు. 'హా! ఎంత కష్టము! నా ప్రియమిత్రు డార్యకుని బందీకృతుం గావించెనా?—అని విచారించాడు. మిత్రుని విడిపించాలని నిశ్చయించుకున్నాడు, భార్యను వైణికాచార్యుడైన లేఖలుని యింట దిగనాడి వెళ్లిపోయాడు. విప్రుడైన శర్విలకునకు గొల్లవాడు స్నేహితుడా? అని ఎవరూ శంకించనక్కరలేదు. కుచేలుడు, కృష్ణుడు స్నేహితులు కాలేదా? ఇక్కడికీ జంటనటు పంపించి అటు చారుదత్తుని దగ్గరకు వెళ్లుదాము.

తన యింట దాచిపెట్టిన వసంతసేన నగ దొంగ ఎత్తుకునిపోయాడు. ఐనా బీదవాడు. కర్చు చేసి దొంగ అపహరించాడని లోకుల నడుమలో విచిత్రం కాదు. కనక ఆ అపకీర్తి రాకుండా చూసుకోవాలి. ఏమి చెయ్యాలో తోచలేదు. ఇంట దొంగలు ప్రవేశించి వసంతసేన దాచిపెట్టిన నగ ఎత్తుకొనిపోయారని పనికత్తె రదనిక చారుదత్తుని భార్య ధూతాంబతో చెప్పింది. ఆమె విచారించి తన పుట్టింటివారిచ్చిన నగ రత్నాలహారం వెంటనే తీసి 'యిది ఆయన మానధనుడు తీసుకోడు. మైత్రేయుని ద్వారా యిచ్చివేస్తాను' అని ఏదో వ్రతం తాను చేసినట్టున్ను, దానికి దక్షిణగా ఇది యిస్తున్నాను తీసుకో' అని మైత్రేయుని కిస్తుంది. మైత్రేయుడు వచ్చి చారుదత్తునితో చెప్పాడు. ఆ మాటకి చారుదత్తుడు

'నాకు దిక్కయ్యెనే స్త్రీ ధనంబు తుదకు' అని విచారించాడు.

'తగిన పెండ్లము మను పెండ్లాడినందులకు ఫలము' అంటాడు మైత్రేయుడు. నిజం. ఆమె అన్నివిధాలా చారుదత్తునకు తగిన యిల్లాలు. కాకపోతే యీ దరిద్రావస్థలో సానిలంపటాన్ని అంగీకరిస్తుందా? దానిని గుమ్మం తొక్కనిస్తుందా? పుట్టింటివారిచ్చిన నగ దాని కిచ్చి ఋణవిముక్తుడయేట్టు చేస్తుందా? లోకంలో ఏ యిల్లాలూ అంగీకరించదు... ఇక్కడమాత్రం చారుదత్తుడు చిన్న అసత్యం ఆడవలసి వచ్చింది. 'జూదంలో ఆ వస్తువు ఓడిపోయాను. దానికి బదులుగా ఈ రత్నావళి యిస్తున్నాను. తీసుకోమని చెప్పి యిచ్చిరా!' అని మైత్రేయుని ద్వారా రత్నహారాన్ని వసంతసేనకి పంపించాడు. నిజంగా యిది అసత్యమే. నాయకునికి కళంకాపాదకమే. మరి ఎలా సమర్ధించవచ్చు. ఓ! సమర్థించవచ్చు. శతకోటి దరిద్రాలకు అనంతకోటి ఉపాయాలు.

'మహామునీనాం మతయశ్చ భిన్నాః' అని ఉండనే వుంది ఆర్యోక్తి. మునులు చెప్పినవే ధర్మశాస్త్రాలు, అవే రాజులు చేసిన శాసనాలు.

'ప్రాణవిత్త మానభంగమందు .....

బొంకవచ్చు నఘము పొంద దధిప!—అని శుక్రుడు బలితో ఉంటాడు. ఆత్మగౌరవానికి భంగం కలిగే దుర్దశ పట్టినపుడు అసత్యం ఆడవచ్చు. ఆ మాత్రం తెలియని అవివేకికాదు చారుదత్తుడు. కనక జూదంలో నీ వస్తువుకాదే అనుకొని ఒడ్డి ఓడిపోయాను—అని అన్నాడు. పైగా వస్తువుకి వస్తువు ప్రతినిధిగా పంపుతున్నాడు. మరి ఔదార్యమనాలా? అనర్యాలాపం అనాలా? ధర్మసూక్ష్మాలు బిసతంతువుల వంటివి............

మైత్రేయుడా హారం పట్టుకొని వసంతసేన యింటికి వెళ్లాడు. వసంతసేన ఐశ్వర్యాన్ని ఆ భవన వైభవాన్ని పట్టి చెప్పవచ్చు. ఎనిమిది కక్ష్యలు గల భవనమది. చివరికక్ష్య దాటిన తరువాత మైత్రేయుడు వసంతసేన చేటికతో

'మీ వసంతసేన యింటి విభవము చూచిన నాకు ముల్లోకము లొకచోటనే కాన్పించుచున్నది. కొనియాడుటకూ నాకీ నోరు చాలదు. ఇది గణికా గృహమా? లేక కుబేర భవనమా?' అని అంటాడు.

నెమళ్లు, పావురాలు, చిలుకలు, గోరువంకలు, రాయంచల జంటలు—అనేక విహంగ వాటిక—ఆట్లే, వాద్య విశేషాలు, నవరత్నాల బెడంగులున్నూ.........

సంపన్నుల గృహా లిలా వుండేవి.

(వసంతసేన గృహ వైభవం గురించి మరొకప్పుడు రాస్తాను.)

వసంతసేన చారుదత్తు నింటికివచ్చి ఆ రాత్రి ఉండి మర్నాడు పుష్పకరండకమనే జీర్ణోద్యానవనములో నున్న చారుదత్తునిచూచి పోదామనుకుంటుంది. అంతలో చారుదత్తుని యింటిదాసీ రదనిక చారుదత్తుని కొడుకు రోహసేనుణ్ణి బుజ్జగిస్తూ అక్కడకు తీసుకుని వచ్చింది. ఎందుకీ పిల్లవాడేడుస్తున్నాడు? ఎవరీ పిల్లవాడు? రదనికా! అని వసంతసేన అడిగింది. 'చారుదత్తుడుగారి కొడుకు. ఇంతసేపూ పొరుగింటివారి పిల్లవాడు తెచ్చిన 'బంగారు ఆటబండితో ఆడుకున్నాడు. వారాబండి దాచుకున్నారు. సరే అని మంటిబండిచేసి యిచ్చాను. అది వద్దు బంగారు బండి కావాలని ఏడుస్తున్నాడు'— అని రదనిక చెప్తూ విచారించి వసంతసేన తననగలన్నీ తీసి ఆ మంటిబండిలో వేసి 'బంగారు బండి చేయించుకో.' అని లాలిస్తుంది. రదనిక పిల్లవాణ్ణి తీసుకుని వెళ్లిపోయింది.

పిల్లలాడుకొనేందుకు బంగారముతో ఆటబళ్లు చేయించే సంపన్నులు ఆనాడు ఉజ్జయినిలో ఉండేవారు. ఎంత అదృష్టం!

వసంతసేనను ఉద్యానవనానికి తీసుకునిపోవడానికి ఒక బండి వచ్చింది. ఆ బండివాడు వచ్చేసరికి వసంతసేన అలంకరించుకొని రావడానికి కాస్త వ్యవధి కావాలని చేటి చెప్పింది. సరే మళ్లీ వస్తానని ఆస్తరణం మరిచిపోయానని వాడు వెళ్లిపోయాడు.

అంతలో రాజస్యాలకుడు శకారుడు తన బండివానిని బండి తీసుకుని జీర్ణోద్యానానికి రమ్మని కబురుపెట్టాడని ఒకడు బండి తోలుకొనివచ్చి చారుదత్తుని యింటిముందు ఆగాడు. అదే తోటకి వెళ్లే బండి అనుకుని వసంతసేన వచ్చి ఎక్కింది. ఎక్కినపుడామెకు కుడికన్ను అదిరింది. 'ఏమీ కుడికన్నదరుచున్నది! నా దుశ్శకునము లన్నియు నా ప్రియుని ముఖారవిందమే పోనడచు గాత'—అని అనుకుని భయపడుతూనే కూర్చున్నది. ఆ బండి సరాసరి శకారుడున్నచోటికి వెళ్లింది. కుడికన్ను, కుడి భుజం... స్త్రీలకు అదరడం అనిష్టసూచకమని నిమిత్తజ్ఞాలు చెప్తారు. స్త్రీయికూడా దుర్నిమిత్తాలకు శంకించడం, వాటిని విశ్వసించటం గమనింపవలసిన విషయం......

వసంతసేన యెక్కవ బండి అలా పోయింది. ఇలా చారుదత్తుని బండి వచ్చింది. అంతలో శర్విలకుని సహాయంవల్ల ఆర్యకుడు (గొల్లవాడు) చెరనుంచి తప్పించుకొనివచ్చి బండి ఎక్కి లోన కూర్చున్నాడు. కాలి సంకెల ఒకటి ఊడి ఉన్నది. ఆ చప్పుడు అందెల చప్పుడనుకుని వసంతసేన బండి యెక్కిందని భావించి బండివాడు తోలుకుని పోయాడు.

ఆర్యకుణ్ణి పట్టుకోడానికి రాజోద్యోగులు హెచ్చరికలు చేస్తూ వీధులలో సందడిగా తిరగనారంభించారు. వారిలో ముఖ్యులు చందనకుడు, వీరకుడు అను వారు. చందనకుడు చర్మకారుడు. వీరకుడు మంగలి. ఈ యిద్దరూ ఉజ్జయిని రాజుకి నచ్చిన సేనాపతులు. ఇక ఆ రాజ్యం ఎలా వుంటుందో వూహించవలసిందే—అది అలా వుండు గాక! వాళ్లలో చందనకుడికి జాతకబాగం కూడా తెలుసును. తన జాతకం ఈలాటిదీ అని వీరకుడితో యీ క్రింది విధంగా అన్నాడు.

'ఎన్మిదింట సూర్యు, డేనింట కుజుడు, నా
ల్గింట శశియు, తొమ్మిదింట శనియు
గురువు లగ్నమున, భృగువు షష్ఠమందుండు
జాతకంబువాడు చందనకుడు'—

ఈలాటి చందనకుడు బ్రతికివుండగా ఎవడురా ఆర్యకుణ్ణి చెరనుంచి విడిపించినవాడు? వాడింకా బ్రతికివుంటాడా? ఆ యిద్దరినీ పట్టుకుని మన ఊరి అమ్మవారికి బలి యిస్తాను'—అని అంటాడు.

గ్రామదేవతలకు నరబలి ఆనాటి ఆచారమా? అని అనుకోవలసివుంది. ఇప్పటికీ కొన్నిచోట్ల నరబలులు ఇస్తున్నట్టు దేశీయ వార్తాపత్రికలవల్ల తెలియవస్తుంది...చందనకుడి జాతకం పైనిచ్చినప్రకారం తరచిచూస్తే కష్టజీవి, నిర్ధనుడు, నికృష్టుడు అని తెలుస్తుంది. పై గ్రహకూటములో బుధుడు, రాహుకేతువులూ చేరలేదు. లగ్నం ఇదీ అని నిర్దేశించలేదు.

కాని యిప్పినంతవరకూ లగ్నాన్ని ఏదో ఒక రాశిని ఏర్పరచుకొని రవికి అటూ యిటూ ఒక గడిలో ఏదో ఒకచోట బుధుణ్ణి ఉంచి ఫలాలు చెప్పవచ్చు. ఒక సందేహం కూడా వుంది.

'ఏకోపి కేంద్ర భవనే నవ పంచమేవా
రాత్రీశ పుత్ర సురస్కృజిత భార్గవాణాం
నిశ్శేష దోష మపహాయ'— అనే దానినిబటి లగ్నములో గురుడుంటే ఆ జాతకచక్రములో పట్టిన దోషాలన్నీ పోతాయి అని వుంది. మరి పై చందనక జాతకమండలిని విచారిస్తే ఏమి చెప్పాలా? అని అనిపించుతుంది. మరి గ్రంథకర్త ఏ సూత్రాన్నిబట్టి చందనకుడి జాతకచక్రం కూర్చాడో అనూహ్యం!... ప్రస్తుతం వక్తవ్యాంశం సర్వే సర్వత్ర జ్యోతిశ్శాస్త్ర విషయాలు తెలిసినవారు కూడా వుండేవారనేది.

జ్యోతిశ్శాస్త్రంలో ఒక భాగమైన జాతక భాగం అందర్నీ వ్యామోహపెట్టుతుంది. యీనాడు కూడా ఈ పిచ్చి నూటికి తొంభైమందిదాకా వుంటున్నది. ఏదో మంచి జరుగుతుందంటే, లాభం వస్తుందంటే అందరికీ ఆశకదా!

'ఆశయా బద్ధతే లోకః'—

వీరక చందనకులు ఇలా రాజమార్గాన్ని శోధిస్తూ వెళ్తూండగా బండి ఒకటి కనిపించింది. ఆ బండిలో ఎవరున్నారో చూడాలి. బండి చారుదత్తునిదని తెలుసుకున్నారు. అయినా రాజకార్యముపట్ల తండ్రినైనా గుర్తించని స్వభావంకల వీరకుడు బండిని పరీక్షించాలని పట్టుపట్టాడు. చందనకుడు బండిలో దూరి చూడగానే దానిలో వున్న ఆర్యకుడు 'శరణు' అన్నాడు. చందనకుడు తెలుసుకున్నాడు. చందనకునకు శర్విలకుడు ప్రాణమిత్రము శర్విలకునకు ఆర్యకుడు ప్రియమిత్రము. అటు రాజకార్యము. ఇటు మిత్రకార్యము. చివరకు రాజునకు ఇష్టుడైన చందనక సేనాపతి మైత్రికే మన్నన కలిగించి వానికి కత్తిని కూడా ఆత్మరక్షకంగా ఇచ్చి బండి దిగిపోయాడు. తరువాత వీరక చందనకులు పోట్లాడుకోవలసివచ్చింది. ఏమైతే ఏమి! ఆర్యకుడు తప్పించుకొనిపోయాడు. వానికి నిమిత్తజ్ఞానం వుంది.

'కత్తి చేతికి దొరకెను, కంప మాన
మయ్యె దక్షిణ భుజము భయంబు లేదు,—

కుడిభుజం అదురుతూంది. కత్తి లభించింది. ఇక యెవరు వచ్చినా భయం లేదు'—అని అనుకున్నాడు.

పురుషులకు మేని దక్షిణభాగం అదరడం శుభ సూచకమని నిమిత్తజ్ఞులు చెప్పారు. దుష్యంతుడు కణ్వాశ్రమములో ప్రవేశిస్తూ భుజస్ఫురణం సూచిస్తూ

'శాంతమిద మాశ్రమపదం'
స్ఫురతి చ బాహుః కుతః ఫల మిహాస్య?—

ఈ ప్రదేశం శాంతరస ప్రధానమైన ఆశ్రమం. నా భుజం అదురుతూంది. దీనికి యిక్కడ ఫలం ఎలా లభిస్తుంది?—అని అనుకుని తానే సమర్థించుకున్నాడు.

'అథవా భవితవ్యానాం
ద్వారాణి భవంతి సర్వత్ర'—

జరగవలసే దానికి అంతటా మార్గాలు వాటంతట అవే ఏర్పడతాయి—అని. ఈ వాక్కు మహాకవి కాళిదాసుది. ఇక్కడ 'దక్షిణ బాహుః' అని అనలేదే అని ఎవరేనా శంకించవచ్చు. తరువాత జరిగిన దానిని బట్టి దక్షిణ బాహువే అని ఊహ్యం. శుభఫల ప్రాప్తి అయిందిగాని దుష్యంతునకు అనిష్టఫల ప్రాప్తి కాలేదు. (సమాప్తము)

---

# లోకైక దీపాంకురం

శ్రీ కలువకొలను సదానంద

## 1

నెల్లూరి ఆవులన్నా, నెల్లూరి బియ్యమన్నా, నెల్లూరుతో వియ్యమన్నా మేలిమికి మారు పేరులు.

నెల్లూరులోని వాడలలో ఒక దానిపేరు లక్ష్మీపురం. ఆ పేటను అభివర్ణించమని ఒక మితభాషిని కోరిన పక్షంలో—అతడు 'ఇది లక్ష్మీపురం' అనేసి మిన్నకుండగలడు అది స్వభావోక్తి. లక్ష్మీపురం లక్ష్మీదేవికి కాపురం.

ఆ ఇంటివారి ఉన్నతిని చాటడానికా అన్నట్లు గంభీరంగా నిలబడివుంటుంది—లక్ష్మీపురంలో ఒక రమ్యహర్మ్యం. భవితవ్యంలో ఆ మేడకు, దానికి సంబంధించిన అంతర్బాహ్య సంపత్తులకు కాబోయే పాలకుడు రమాపతి. రమాపతి మైనారిటీ తీరిన పసి బాలుడు!... అతని దృష్టిలో ప్రపంచం తన మేడలా రమ్యమైనది. ఇంటి ముందరి పూలతోటలా మనోహరమైనది. శ్రీరాం మహలులో రిజర్వుడు సీటులా సుఖప్రదమైనది... జీవితం ఒక వినోదభరితమైన చలనచిత్రం. అది సుగంధ పరిమళాలను వెదజల్లే కునేగా సెంటు. సిమెంటురోడ్డుపైన ఇంపాలాకారులో షికారు. అమాత్యవర్యుని గౌరవార్థం ఏర్పాటుచేయబడిన కమ్మని విందు. హృదయానికి గిలిగింతలు పెట్టే ప్రేమికుల యుగళ గీతం!...హోయిహోయి ఈ లోకం, చల్లనైన దీ లోకం .. బిచ్చగాడు కడుపుమీద తాళం వేసుకుంటూ, 'బతకలేని జన్మ నారాయణా' అంటూ ఉదరగీతి పాడుకోవడం ఎంత సహజమో, రమాపతిలాంటి లక్ష్మీపుత్రుడు 'హోయిహోయి ఈ లోకం' అంటూ మధుర గీతి పాడుకోవడం కూడా అంతే సహజం.

అంతఃపురవాసం తప్ప బాహ్యప్రపంచమే ఎరుగని సిద్ధార్థునికి నగరాన్ని చూచి రావాలన్న కోరిక కలిగినట్లే — సుకుమారుడైన రమాపతి మనోక్షేత్రంలో—లోకంలో గల సౌందర్య సీమలలో విహరించి రావాలన్న ప్రగాఢ వాంఛ అంకురించింది. తానిన్నాళ్లూ ఊయలలో పసిపాపలా పెరిగాడు. లోకమంటే ఊయెల, ఊయెలకు కట్టిన చిలుకలే గాదు; తాను పుస్తకాలలో చదివినవీ, ఇతరుల ద్వారా వినినవే గావీ—కంటితో చూడని వింతలు దేశంలో ఎన్నో వున్నాయి. ముందుకు పరుగులు దీస్తూ కాలపురుషుడు విదిల్చిపోయిన మైలురాళ్లలా—ప్రాచీన సంస్కృతికీ, గత వైభవానికీ ప్రతిబింబాలుగా నిలిచిపోయిన స్మృతిచిహ్నాలు, మానసోల్లాసాన్నీ విశ్రాంతినీ ఆరోగ్యాన్నీ అందివ్వడమే ప్రయోజనంగాగల సుందర ప్రదేశాలూ, నేటి నాగరికతకు, కళాపటిమకు సవాలు పలుకుతూ నిలిచివున్న నాటి కళాక్షేత్రాలు, ఆస్తికత్వానికి గీటురాళ్లుగా వున్న దివ్యక్షేత్రాలు భారతదేశంలో అసంఖ్యాకాలు!...ఇవన్నీ చూచి ఆనందించకపోతే జీవితానికి సార్థకతే లేదు అనుకున్నాడు రమాపతి.

శ్యామలాకాశంలో తళుక్కున మెరసి మాయమైపోయే తటిల్లతలా— అప్పుడప్పుడూ ఈ వాంఛ అతనిలో మెదులుతూ, క్రమంగా అది ఇక ఓపలేనంత దృఢతరమైపోయింది. కాని అతనితండ్రి ఈ సంకల్పాన్ని కొన్నాళ్లవరకు ప్రక్కకునెట్టి పెట్టమన్నాడు. తనకొడుకు పాలుత్రాగే పసివాడని, లోకం ఒక తిరణాల వంటిదని, తనకొడుకు ఆ తిరణాలలో తప్పిపోతే నిర్భయంగా సంచరించి సురక్షితంగా తిరిగి రాలేడని ఆ తండ్రి భయం. కొడుకు కోరిక తీరడానికి అవకాశం రావాలి...ఎప్పుడో వచ్చింది. అయితే ఎప్పుడో వచ్చే అవకాశంకోసం వేచి వుండలేని రమా

పతి ఒకనాడు జేబులనిండా డబ్బు కుక్కుకుని, కేవలం వినోదయాత్రోద్దేశంతో రెండో కంటికి తెలియకుండా రైలెక్కేశాడు.

సంకల్పం నెరవేరడానికి అల్లావుద్దీన్ చేతి అద్భుతదీపమే వుండవలసిన అవసరం లేదు. కడుపార ఆరగించడానికి, ఆతిథ్యాన్ని కోరివచ్చిన వారినెల్ల సంతుష్టులను చేయడానికీ జమదగ్ని ఆశ్రమంలోని కామధేనువే కావలసిన అగత్యం లేదు. అనుకొన్నంతలో ఇచ్చవచ్చిన చోటికి ఎగిరి పోవడానికి ప్రవరాఖ్యుడు కాలికి రాచుకొన్న పాదలేపనమే ఉపయోగించుకోవలసిన పనిలేదు...డబ్బుంటే ఇవన్నీ ఉన్నట్టే! రమాపతికి డబ్బుకు కొదవేముంది?

కీ యిచ్చిన గడియారం ముల్లులా నిరాటంకంగా సాగిపోయింది రమాపతి దక్షిణదేశ యాత్ర. దేశంలో అడుగడుగునా కానవచ్చిన ఔన్నత్యాన్ని గమనించి గర్వించాడేగానీ, ఎటుజూచినా దృగ్గోచరమయ్యే నిమ్నతను, దారిద్ర్యాన్ని, ఆర్తినిగూర్చి నిమిషకాలమైనా ఆలోచించడానికి రమాపతి మనసు తావీయలేదు.

రమాపతి దక్షిణదేశయాత్ర ముగించుకుని తిరిగి వస్తూండగా దైవికంగా ఒక సంఘటన జరిగింది. అతడు కాట్పాడిలో రైలు దిగాడు. భోజన సమయాల్లో అతడు తనకుతానై కడుపును హెచ్చరించుకోవడం మామూలు. కాని ఆ పూట కడుపే అతనిని హెచ్చరించింది. అలసిపోయిన శరీరం తేరుకవడడానికి—ముందు స్నానం ముఖ్యం. రమాపతి వెయిటింగ్ రూములోకి వెళ్ళాడు. సూటుకేసుతెరచి మనీపర్సు, రిస్టువాచీ అందులో వుంచాడు. మార్చుకోటానికి జతబట్టలు, తువ్వాలు. సబ్బుతీసుకుని స్నానాల గదిలోకి వెళ్లాడు. స్నానం ముగించి వెలుపలికి వచ్చిన రమాపతి గుండె గుభిల్లుమంది. సూట్ కేసు అదృశ్యమైపోయింది. రమాపతి జీవితంలో మొట్టమొదటిసారిగా భయపడ్డాడు. తలలో ఆలోచనలన్నీ ఎక్కడివక్కడ స్తంభించిపోగా, కర్తవ్యం తోచక, కాలుగాలిన పిల్లిలా ప్లాట్‌ఫారమంతా తిరిగాడు. తనపేరు మరచిపోయిన ఈగలా కనిపించిన వారినందరినీ 'నా సూట్‌కేసెక్కడ?' అని అడిగాడు. పోలీసులతో మొరపెట్టుకున్నాడు. ప్రయోజనం లేకపోగా, తన అజాగ్రత్త కారణంగా తానే నవ్వులపాలు కావలసివచ్చింది. సముద్ర మధ్యంలో దారిగానక నిలబడిన నావలా— దిగులుగా, నిరాశగా ప్లాట్‌ఫారంమీద బెంచీమీద కూలబడ్డాడు. ఇంతలో రేణిగుంట ప్యాసింజరు— 'తెలుగుగడ్డకు చేరవేస్తాను ర'మ్మన్నట్లు కూతవేసి కదిలింది. ఇటువంటి ఆపత్సమయంలో ఆ రైలుకంటే తోడు వేరే లేదనుకున్నాడో ఏమో — రమాపతి పరుగునవెళ్ళి రైలెక్కేశాడు.

ఆకలితో పోరాటం తనకేనాడూ సంభవించలేదు. తాను ఇల్లుచేరుకునేసరికి మరునాడు తెల్లవారవచ్చు. ఫరవాలేదనుకున్నాడు రమాపతి. సాటి ఆంధ్రులెందరో రోజులతరబడి నిరాహారదీక్షలు కొనసాగించగలిగినప్పుడు— తాను ఒక్కరోజు పస్తుండలేడా? ... అతనిలో ఈ ధైర్యం కూడా దిగజారిపోయింది. రైలు ఏదో చిన్న స్టేషనులో ఆగింది. రైలు ఆగిన మరుక్షణం రమాపతి కూర్చున్న పెట్టెలోకి ఒక టిక్కెట్టు ఎగ్జామినరు ఎక్కడం, రైలు మళ్లీ కదలడం జరిగిపోయాయి. టి. టి. ఇ. టిక్కెట్టుకోసం చేయి జాపాడు. ఆ చేయి నాగుబాము పడగలా అతిభయంకరంగా కనిపించింది రమాపతికి. అతని మనస్సు అభిమానంతో, అవమానంతో తల్లడిల్లిపోయింది. 'ఈ క్షణంలోనే ఈ రైలుప్రమాదంపాలై నేను, ఈతడు, ఈ పెట్టెలోని మిగతా ప్రయాణీకులందరూ చచ్చిపోరాదా!...' అనుకున్నాడు. అతని బుర్రలో వికృతమైన ఊహ కలగడం కూడా యిదే ప్రథమం. రమాపతిని చిత్తూరు ప్లాట్‌పారంపైకి గెంటి, రైలు వెళ్ళిపోయింది.

చేతిలో చిల్లిగవ్వలేదు. అవసరానికి ఆదుకోగల వస్తువేదీ లేదు. పోతే, కాట్పాడిలో తాను విప్పివేసిన టెరిలిన్ పంట్లాం, చొక్కామాత్రం వున్నై. ఈ సమయంలో తనవి అనుకునే వస్తువులు ఈ జత బట్టలే! వాటిని తువ్వాలులో మూటగట్టుకున్నాడు రమాపతి.

...ఊరు తనకు క్రొత్తది. తెలిసిన బంధుమిత్రులెవరూ లేరు. ఒకవేళవుంటే, ఎక్కడున్నారో తెలియదు. ఆతనికాళ్ళు వాటంతట అవే ఊరిలోపలికి సాగిపోయాయి. ఊరంతా తిరిగి తిరిగి రమాపతి ఒళ్ళు, దుస్తులు దుమ్ముకొట్టుకు పోయాయి. జబ్బుపడి లేచినవాడిలా ముఖం పీక్కుపోయింది. ఆకలి బాధకు సైపలేక కన్నులు లోతుకు వెళ్ళిపోయాయి. ముంగిసతో పోరాడి పోరాడి యిక లొంగిపోక తప్పదనుకుని అశక్తంగా సోలిపోయే కోడెనాగన్నలా — ముంగిస వంటి పరిస్థితికి తాను కబళం కావడం ఖాయమనుకొన్న రమాపతి—ఇక చేసేదిలేక మునిసిపల్ పార్కులో బెంచీమీద కూలబడ్డాడు. పార్కులో రేడియో పాటలు వెదజల్లుతూంటే— తన బ్రతుకొక సినిమాగా, అందులో తానొక పాత్రగా అనిపించింది. ప్రొద్దు పోయింది. క్రమంగా పట్టణం మాటుమణిగింది. అప్పుడప్పుడు రిక్షాలమోతలు, సినిమాలనుండి వచ్చే పోయే జనాల ఇష్టాగోష్ఠి! రమాపతిమాత్రం కడుపులో కాళ్ళు ముడుచుకుని, దవడలు బిగ గరచుకొని, తన పరిస్థితిని నెమరు వేసుకుంటూ పార్కులో పడుకొన్నాడు.

...ఎంత విచిత్రమైనదీ ప్రపంచం!...జీవితం ఒక నాటకరంగమని అంటుంటారు. నాటకరంగంలో కథ నుగటంగా ఎప్పుడేమి జరుగుతుందో పాత్రధారులకు తెలుసుగానీ— జీవితరంగంలో మాత్రం ఎప్పుడేమి సంభవిస్తుందో ఎవరికీ తెలియదు. మానవుడు ఎంతటి ప్రతిభాశాలి అయినా, విధిముందు ఎందుకూ కొరగానివాడు. రాజాధిరాజైనా, భిక్షుకుడైనా దైవ మనబడే అతీతశక్తిముందు మాత్రం సామాన్యుడే! కాకపోతే— తనబోటి లక్ష్మీపుత్రుడు, జీవితాన్ని నిర్లక్ష్యభావంతో చూచినవాడు, అన్నంకోసం అల్లాడనివాడు, పాందికైన శయ్య వుంటేనేగానీ నిద్ర రానివాడు— ఈ నడిరాతిరి— పుట్టినచోటికి దూరంగా, పార్కులో కడుపులో కాళ్ళు పెట్టుకొని, ఆకలితో అల్లాడవలసిన స్థితి ఎందుకు

సంభవమౌతుంది? ఇది సంభవమే అయినప్పుడు తాను శ్రీమంతుడెలా అవుతాడు? ఒకప్పుడు శ్రీమంతుడై వుండవచ్చు, ఇంకొకమారు మళ్లీ కావచ్చు; కాని, యిప్పుడు మాత్రం కాడు!

రమాపతికి ఆ రాత్రి నిద్ర అందని మ్రాని పండై పోయింది. కడుపులో ఆకలి! భరింపరాని చలి! తన దుస్థితికి, నిస్సహాయతకు మనస్సులోనే కుమిలి ఏడ్చాడు.

తెల్లవారింది. పట్టణానికి తూర్పుదిశగావున్న పొలాల నడుమ ఒక నూతిలో ముఖప్రక్షాళనం చేసుకున్నాడు రమాపతి. దోసిళ్లతో కడుపు పట్టగలిగినన్ని నీళ్లు త్రాగాడు. ఊరి లోపలికి నడిచాడు.

క్రితం రోజు ఉదయం అల్పాహారం తిన్నవాడు యింతవరకు అన్నం కంట జూడలేదు. అతని కిక ఒకే ఒక మార్గం కనిపిస్తోంది. తన వద్ద వంద రూపాయలకు మించి వెలజేసే జత బట్టలు వుండనే వున్నాయి. ఎంతో ఒకంతకు వాటిని అమ్మివేయాలి! గంట ఎనిమిది అని సూచిస్తూ మునిసిపాలిటీ సైరను గింగురుమంటూ మ్రోగింది. బస్‌స్టాండులో నిలబడ్డాడు రమాపతి.

బస్టాండులో జనం వారివారి గొడవలలో వారున్నారేగానీ, రమాపతిని పలకరించే తీరిక గానీ, అవసరం గానీ ఎవరికీ లేదు. అతడు తన ముందునుంచి సాగిపోయే ప్రతి మనిషిని తన బట్టలు కొనమని అడగడానికి ప్రయత్నించాడు. కానీ, అభిమానం అడ్డు రాగా గొంతులో మాట గొంతులోనే వుండిపోయింది. గంట పన్నెండు అంటూ మళ్లీ హెచ్చరించింది సైరను. రమాపతికి యిక నిలబడడానికైనా శక్తి లేకపోయింది. దృష్టి కూడా మందగించిపోతున్నది. ఒక్క అడుగు ముందుకు వేసితేనే, మేడలు, మనుషులు, బస్సులు, చెట్లు అన్నీ పైకీ కిందికీ కదలాడుతున్నట్లు కనిపిస్తున్నాయి. సూటిగా పది అడుగులు వేయలేనేమో అనిపించింది దతనికి. తన కిది పరీక్షా సమయం. మానమో, ప్రాణమో యిప్పుడు తేల్చుకోవాలి. ప్రాణమే కావలసివుంటే యిక ఎంతమాత్రం ఆలసించరాదు.

బస్‌స్టాండు దగ్గరున్న హోటలుముందు నిలబడ్డాడు రమాపతి. కలుగులోనుంచి బయటకు వచ్చిన చిట్టెలికలా— ఒక వామనావతారం హోటలులో నుంచి ఇవతలకు వచ్చింది. పొట్టిగాను, సన్నగాను వున్న ఆ ఆకారం ఒక మానవాకారమేనని రూఢిపరచుకొన్నాడు రమాపతి. అతని వయస్సు ముప్ఫైకి లోపున వుండదనిపించింది. ఎండిపోయిన తాటి చిప్పలావున్న ఆ మానవుడి ముఖంలో కండ కరిగిపోగా, ఎముకలుమాత్రం పైకి పొడుచుకొచ్చాయి. ఎడ్లబండ్లు నడిచివెళ్ళిన బురదరోడ్డులా— అతని విశాలమైన నుదురు ముడతలతో నిండిపోయింది. మాసిన పంట్లాం, చొక్కా వేసుకున్నాడు పేదరైతు ముసలి ఎద్దులతో సేద్యం చేసినట్లు— తెగిపోయిన పాదరక్షలు ధరించాడు. మాసిన గడ్డాన్ని చేతితో తడుముకుంటూ, సాలోచనగా ఆకాశంలోకి చూస్తూ వెళ్ళిపోతున్నాడతను.

'సార్!' అన్నాడు రమాపతి, నూతిలోంచి పిలిచినట్లు.

'ఏమండీ మేష్టారూ!' అన్నాడు మళ్ళీ.

అతడు తక్కున నిలబడిపోయి చుట్టూచూచి, తనను పిలిచినవాడు రమాపతేనని ధృవపరచుకొన్న తర్వాత 'నేను మేష్టారిని కానయ్యా బాబూ, గుమాస్తాని! ఏం కావాలి?' అన్నాడు చిరాకుతోబాటు చిరునవ్వును ప్రదర్శిస్తూ.

రమాపతి గబగబ మూటవిప్పి తన సరుకు యొక్క నాణ్యతను శ్లాఘించడం మొదలుపెట్టాడు. 'టెర్లిన్ బట్టలండీ! ... మేలిరకం బట్టలండీ! ... తీసుకోండి. మీరేమిచ్చినా సరే!...' అన్నాడు.

అవతలి మనిషి నివ్వెరపాటుతో నిలబడిపోయాడు.

'సందేహిస్తారెందుకూ? తీసుకోండి. ఐదు రూపాయలివ్వండి, చాలు!'

పిచ్చివాణ్ణి చూచినట్లు చూశాడు ఆ మనిషి రమాపతిని.

'నేను నిజమే చెబుతున్నానండీ! మాది నెల్లూరు! డబ్బేకాక, సూట్‌కేసుతోబాటు సర్వమూ దొంగెత్తుకుపోయాడు. ఈ బట్టలు నావే!... పోనీ, రెండు రూపాయలిచ్చినా చాలు ..' అన్నాడు రమాపతి వేడికోలుగా.

'చూడు బాబూ! నీ పరిస్థితి అర్థం చేసుకో గలను. అయినా రెండు రూపాయలతో నీ అవసరా లన్నీ తీరిపోతాయా... ఆ రెండు రూపాయలతో ఏం చేస్తావు?'

రమాపతి ఏమీ చెప్పలేకపోయాడు. 'భోజనం చేద్దువుగాని రా!' అంటూ హోటలులోకి దారి తీశాడు ఆ వ్యక్తి.

రమాపతికి పోయిన ప్రాణం తిరిగి వచ్చి నట్లైంది. ఈ ఆతిథ్యానికి ప్రత్యుపకారంగా అతనికి తన ఆస్తిలో అర్ధభాగం వ్రాసి ఇవ్వాలన్నంతటి కృతజ్ఞతా భావం కలిగింది. అతడు భోంచేస్తూ వుండగా మధ్యలో 'మీ వూరికి వెళ్ళాలా?' అని అడిగాడు ఆ వ్యక్తి.

'ఊం!'

భోజనం ముగిసిన తర్వాత ఇద్దరూ బయటికి వచ్చారు. 'ఇదిగో బాబూ! ఇంతకంటే నాదగ్గర ఇంకేమీ లేదు. దీనితో ఎలాగయినా ఇల్లు చేరుకునే మార్గం చూడు' అంటూ ఆరు రూపాయలు, పైన కొంత చిల్లర తీసియిచ్చాడు అతడు. రమాపతి అది తీసుకుని, బట్టలు అతని కివ్వబోయాడు.

'నాకెందు కివి? వీటిని తొడిగే అర్హత నాకు లేదులే! అదీ గక నీకూ, నా వంశవృక్షంలో కాసే ఏ కాయకూ ఈ బట్టలు పనికిరావు. ఉంచుకో!'

అది అభిమానమో, అనుభవింపరాని కష్టం తీరినందువలన కలిగిన ఆనందమో ఏమో గానీ— రమాపతి నయనద్వయం బాష్పపూరితమైపోయింది. ఔరా! విధి విలాసం! కలిమి తన్ను ఈ విధంగా పరిహసించిందా? లక్షలకు అధిపతి తాను. ఇతరుల ఆర్తిని బాపగల సమర్థుడు తాను. అయితే తన సామర్థ్యం ఏమైంది? తన లక్షలన్నీ ఏమైనాయి? తనంతటి శ్రీమంతుడు ఒక సామాన్యుని దాతృత్వాన్ని పొంది సహించడంకంటే గత్యంతరం లేని పరిస్థితి ఎందుకు కలిగింది...... అంతా లక్ష్మి విలాసం!

చిన్ననాటిమండి డబ్బును మంచినీళ్లప్రాయంగా వెచ్చించే తనకు ఆ డబ్బుయొక్క విలువను తెలియ జేయడమే విధికృతంలోని పరమార్థమై వుంటుంది. అబ్బ! ఎంత దుర్భరమైనది లేమి!... ఈ రెండు రోజుల అనుభవం ద్వారా దారిద్ర్యాన్ని గూర్చి ఎంత ప్రచండంగా తొలి పాఠం బోధించింది దుర్విధి!

చెంపల మీది కన్నీళ్ళు తుడుచుకుంటూ, ఆపద్బాంధవు నిలా నిలబడివున్న ఆ వ్యక్తితో యిలా అన్నాడు రమాపతి...'నిస్సహాయమైన పరిస్థితిలో దేవు డిలా నన్ను ఆదుకున్నారు. మీ మేలు ఎప్పటికీ మరవ రానిది...పోనీ...మీ పేరు, చిరునామా అయినా చెప్పా రంటే సంతోషం.'

కొన్ని వేలతో ఇల్లు విడిచిన రమాపతి ఒక అపరిచితుని పేరు, చిరునామాలతో యిల్లు చేరు కున్నాడు.

## 2

ఒకటో తారీఖు వచ్చింది!

తక్కువ జీతగాడి బ్రతుకు పుటలలో కడు చిత్రమైనది ఒకటో తారీఖు! కొన్ని అవసరాలను బట్టి అది ఎంత త్వరగా వస్తే అంత మంచిది. మరి కొన్ని అవాంతరాలను బట్టి అది ఎంత ఆలస్యంగా వస్తే అంత మేలు! మాసమంతా స్వేచ్ఛా వాయువులు పీల్చుతూ నడయాడ గలిగిన ఉద్యోగి ఆ రోజుమాత్రం వేటలో తగులుకొన్న అందాల లేడిలా వేసారిపోతాడు. అందుకే—మనిషిని ఎటూ కదలనివ్వని కత్తులబోను ఒకటో తారీఖు! జీవితంలో నెల కొకమారు వైరాగ్యాన్ని నూరిపోసే—అనాటి భారతీయ బౌద్ధ సన్యాసి ఒకటో తారీఖు!

జీతం తనజేబులో వుంచుకున్నాడు దామోదరం.

సిబ్బంది యావత్తూ ఆఫీసు గోడల చాటు నుండి బయటపడగానే—ఎక్కడ నక్కివున్నారో ఏమో,

దారిదోపిడీ గాళ్లలా చుట్టుముట్టారు మార్వాడీ వాళ్లు. 'ఎవరబ్బ సొమ్మని కులుకుచు తిరిగేవు?' అని రామయ్యను గోపన్న అడిగినట్లు ఒక మార్వాడీ వాడు నిలదీసి అడుగగా నిరుత్తరుడైన దామోదరం ముప్పై రూపాయలు అతని చేతిలో వుంచేశాడు. ఇక పెద్ద మొత్తాలను అటుండనిచ్చి చిల్లరకొట్టు వాడికి, ఇల్లు అద్దెకిచ్చిన వాడికి రెండు నెలల బకాయి, పాలవాడికీ, పెరుగావిడకు, చాకలికి, నీళ్ల మనిషికి...ఇందరికీ పోగా మిగిలిన పెద్దమొత్తాల వాళ్లందరికీ వడ్డీలు...అతని బుర్రలో అంకెల గారడీ జరుగుతోంది.

దామోదరం హోటలులో కాఫీ త్రాగి సిగరెట్టు వెలిగించుకున్నాడు.

పూర్వం మనుషులు క్రూరమృగాలను వేటాడేవారట! ఇప్పుడు క్రూరమృగాల బాధలేదు. మనిషిని మనిషి వేటాడుకోవడమే సామాన్యమై పోయింది నేడు! ఈ చిత్తూరు అనే కారడవిలో తన కోసం మాటువేసుకొని గాలించే వేటగాళ్ళెందరో!... దామోదరం పెద్దబజారులోదూరి, వెంటనే తన పార పాటు గ్రహించి, వెనుకకువచ్చి ఒక సందులో దూరాడు. మరునిమిషం సైకిలుమీద రివ్వున వెన్నంటి వచ్చేసింది ఒక వేటకుక్క. 'ఏమండోయ్! శెట్టిగారు రమ్మంటున్నారు మిమ్మల్ని!'

దామోదరం గుండెల్లో పిడుగులు దొర్లాయి. నోరు తడబడుతూండగా 'బాబ్బాబూ! కాస్త తొందర పనుందమ్మా! వెళ్లి మళ్లీ వస్తాను...' అన్నాడు. 'వీల్లేదండీ! మాట్లాడాలిట! వెంటబెట్టుకుని రమ్మన్నారు.' పీడెవడో విష్ణు చక్రంలా దాపు రించాడు తనకు. పర్యవసానం దేవుని కప్పగించి— పోలీసువెంట వెళ్లే అనుమానితులా వాడివెంట బయలు దేరాడు.

బట్టలకొట్టు పాపయ్యశెట్టికి తాను వంద రూపాయలివ్వాలి. వేయి సంవత్సరాలనుండి చెక్కు చెదరక నిలబడివున్న చంద్రగిరి మహలులా ఆరు మాసాలుగా ఆ వంద రూపాయల బాకీ అలాగే వుంది. భార్యకోసం తాను ఆ నాడు కొన్న చీర లేమో చిరిగి పోవచ్చాయిగానీ, ఈ బాకీ మాత్రం నుంతైనా కరుగలేదు. ఇంతవరకు శెట్టిదగ్గర తాను ఆరుమార్లు మాట పోగొట్టుకున్నాడు, 'ఇక ఈసారి యివ్వకపోతే మర్యాద దక్కదు ..' అని ఫైనల్ వార్నింగ్ కూడా యిచ్చేశాడు శెట్టి.

దుకాణం మెట్లు ఎక్కుతుండగానే, 'రండి రండి! ఏదో యిన్నాళ్లకు దయ కలిగింది మామీద! సంతోషం! కూర్చోండి!' అంటూ అత్యంత గౌర వాదరాలతో స్వాగతం పలికాడు పాపయ్యశెట్టి. అతని పలుకులు నాగస్వరంకాగా, దామోదరం మంత్రముగ్ధుడిలా జేబులోనుంచి ఐదు పది రూపాయల కాగితాలు తీసి గల్లా పెట్టెమీద వుంచేశాడు. 'ఇది వుంచు కోండి శెట్టిగారూ! మిగిలినది పై నెల నర్దేస్తాను...' అన్నాడు మేకపోతులా, గంభీరంగా.

ఆ యాభై రూపాయలూ తీసి సొరుగులో వేసుకుంటూ 'ఏదోనండీ...ఇస్తూ వుండాలి, తీసుకుంటూ వుండాలి!...పై నెలకోనైనా మిగతాది యిచ్చేయండి...' అన్నారు శెట్టిగారు వినయంగా.

తన జీవశక్తి నంతటినీ శెట్టి దుకాణంలోనే జారవిడిచి బయటపడ్డాడు దామోదరం. గుడ్లప్పగించి, కోరలు బయటపెట్టి, చేతులు జాచి అటకాయించే పెనుభూతంలా బ్రతుకు మహాభయంకర రూపంతో సాక్షాత్కరించింది. తాను ఎటుపోయినా ఆ కబంధ హస్తాలు తనను అడ్డగిస్తూనే వుంటాయి. ఇక విముక్తి ఎక్కడిది?

...ఇక ఎట్టి అవాంతరాన్నీ ఎదుర్కొనలేని దామోదరం సందుగొందులలో దూరుతూ జాగ్రత్తగా ఊరిబయటకు వెళ్లిపోయాడు. జన సమూహానికి దూరంగా, ఏకాంతంగా కూర్చున్నాడు. జీవితంలో నలిగిపోయేవాడికి ఏకాంతసేవ కంటే శాంతిప్రదాయకం మరొకటి లేదు. స్వీయకథా సింహావలోకనానికి ఒకింత తీరిక చిక్కింది దామోదరానికి.

.. తొలి మానవుడు అదృష్టవంతుడు. కడుపు నింపుకోవడానికి కింత గ్రాసం, మొలకు చుట్టుకోవ

డానికి చాలినంత చర్మం సేకరించుకోవడం తప్ప మరొక వ్యాసంగం లేనివాడతను. నాగరికతకు యింకా అంకురార్పణే జరుగని ఆ కాలంలో— మూరెడు గోచీ, పక్షోడు పచ్చి మాంసమే తన అవసరమైనప్పుడు, స్త్రీకి పురుషుడు, పురుషునికి స్త్రీ తోడునీడగా వున్నప్పుడు — ఆదిమవాసి కంత్రకంటే కావలసిం దేముంది? శాంతియుత జీవితానికి కొదువేముంది? కాని క్రమంగా మానవుని బుద్ధి ప్రగతికి అర్రులు జాచింది. అతని మేధాశక్తి అద్భుతమైన నాగరికతను సృష్టించింది. ప్రాణికోటిలో తన జీవన సరళి అత్యు న్నతమైనదని గర్విస్తున్నాడు మానవుడు. కాని మరో వైపునుంచి చూస్తే మానవుడు వెర్రివాడనక తప్పదు. ఇది నాగరకత కాదు. మానవుని పతనానికి ప్రతి రూపం. ప్రాచీనులు మాంసపు ముక్కతోనో, కాయ గసరులతోనో తృప్తి పడితే, ఆధునికుని జిహ్వ కొంగొత్త రుచులను అభిలషిస్తుంది. ఆదిమవాసికి కావలసింది ఒక మూరెడు చర్మమైతే, నవనాగరీకునికి కావలసింది వెల లిచ్చి కొనలేని అమూల్య వస్త్రాలంకా రాలు. నాటి మానవజాతికి దంతాలు ఆభరణాలైతే, నేడు స్వర్ణాభరణం తప్ప మరొకటి పనికిరాదు. ఆనాటి మనిషి తల దాచుకోవడానికి కొండగుహ, లేక చిన్న పర్ణశాల అయితే చాలు; నేడు కొండలలో నివసించ లేకపోతున్నాడు నరుడు. నాగరకత తోబాటు మానవుని మనుగడయొక్క స్వరూపం, అతని జీవితావసరాలు పెచ్చు పెరిగిపోతున్నాయి. తన పూర్వీకునిలా కనీసపు అవసరాలతో నిరాడంబరంగా బ్రతకలేడు నేటి మాన వుడు. అతనిలా చిన్న పరిధిలో జీవించలేడు. లోకులతో బాటు తానూ నడిచిపోవాలి. అందరిలో తానూ ఒక సాటివాడు కావాలి. వెనుకబడితే లోకం పరిహ సిస్తుంది. గౌరవ మర్యాదలు అందనివై పోతాయి. కనుక ఆడంబరమూ, అట్టహాసమూ జీవితాదర్శాలుగా పరిణమించాయి. తన బుద్ధిని ఈ ఆదర్శం మీదనే కేంద్రీకరించి— కనిపించిన వస్తువునంతా ఆశిస్తూ, ఆశించినదానినంతా అందుకోబోతూ, అందనిదానికోసం ఆవేదనపొందుతూ బ్రతుకుబాటలో పయనించే మాన వునికి— వెనుకటివారి బ్రతుకుతో జతకట్టి పయ నించిన శాంతి, సంతృప్తి ఎలా లభ్యం కాగలవు? ఇటువంటి పరిణామాన్ని దూరంనుండి ఊహించి, నాగరికత తమకు వద్దనుకుని మానవునికి విభిన్నంగా వుండిపోయిన పశుపక్ష్యాదులే మనుష్యులకంటే తెలి వైనవి గదా?

దామోదరానికి జీవితానికి సంబంధించిన ఉన్నత వాంఛలేవీ లేవు. బ్రతుకు ఒడిదుడుకులు లేక ప్రశాంతంగా సాగిపోతే చాలు. తన సంసారం—తాను, తన భార్యతో పరిమితమైనదేకాని పెద్దదికూడా కాదు. బ్రతుకు నావను నడిపించడానికి చుక్కానిలా గుమాస్తా గిరీ వుండనే వుంది. అయినా, బతుకుతో ముష్టియుద్ధం చేయలేక తాను ఓడిపోతున్నాడు.

కళ్యాణం శుభానికి ఆలవాలం అంటారు. తన కళ్యాణం చీకు చింతలకు వాంది అయింది. రెండేళ్లకే అప్పులు కుప్పలైనాయి.

ఏ బాధైనా పడవచ్చుమగానీ — ఋణబాధను భరించడమనేది మహార్ణవాన్ని ఈదడం లాంటిదే!... దారిద్ర్యమే దుర్భరమైనప్పుడు దానికతోడు ఋణ బాధ ఒకటి తయారైతే అది గోరుచుట్టుమీద రోకటిపోటే!...చిత్రహీనతలలో విచిత్రమైన హింస ఋణబాధ! సంసార సాగరంలోని ప్రశాంతతను రూపుమాపి, భయంకర ప్రళయాన్ని సృష్టించే క్షుద్రశక్తి ఋణం! ఏనుగంతటి వాణ్ణైనా పొడిచి పొడిచి, మనస్సును, కాయాన్ని దుర్బలంగా చేసిచేసే విషభల్లం ఋణం! అమ్మో! ఋణపిశాచి పాలబడిన వాడి జీవితం విషాదగాథే! దానికి ఆహుతి అయితే, రాలు రప్పలుగూడా బొగ్గులై పోగలవు. ఇందుకు దామోదరం శిథిలరూపం ఒక నిదర్శనం!

ఆవరించుకొన్న చీకటిలో దామోదరం ఒళ్లు దులుపుకుంటూ లేచి నిలబడ్డాడు. గమ్యంతోచక అతని కాళ్లు ముందుకు సాగలేదు. గృహోన్ముఖమై పోవడానికి అతనికి ధైర్యం చాలలేదు. తన అస్థి పంజరం ఏ అప్పులవాడి కంటనైనా పడవచ్చు. నగ రంలో సరసంచారంలోని చీకటివేళ యిల్లు చేరుకోవ డమే తన పాలిట తారకమంత్రం! దామోదరం మెల్లగా

లక్ష్మి టాకీసువైపు నడిచాడు. నడుస్తూ నడుస్తూ ఒక మారు నవ్వుకున్నాడు. చీకటిలోతప్ప పగటి పూట సంచారానికి నోచుకోని గుడ్లగూబ జ్ఞప్తికి వచ్చిందతనికి.

దామోదరం సినిమాలో కూర్చున్నాడు.

సినిమాకథ సినిమా కథలాగే చక చకా సాగి పోతున్నది. ఒక యువకుడు. అతడొక కలవారి అమ్మా యితో యుగళగీతం పాడతాడు. వారి ప్రేమకు అతని దారిద్ర్యం అడ్డు నిలుస్తుంది, దుర్భర దారిద్ర్యానికి భగ్నప్రేమ తోడుకాగా ఆ యువకుడు మరొక్క నిమిషమైనా జీవించలేక, పెద్దపర్వత శిఖరంపైకి చేరుకుంటాడు. ఆ మహోన్నత శిఖరాగ్రంనుంచి క్రింది లోయలోకి దూకి ఆత్మహత్య చేసుకో బోతాడు. ఇంతలో 'ఆగు' అంటుంది ఆకాశ వాణి. అతని వెనుక ఒక వార్తాహరుడు నిలబడి వుంటాడు. 'అనగనగా అనకాపల్లిలో మీ దూరపు బంధువొకాయన దివికెళ్లిపోయాడు. ఆయన యావ దాస్తికీ వారసుడివి నువ్వు' అంటాడతను. బాజా భజంత్రీలతో కళ్యాణ మంటపం మార్మోగి పోతుండగా కథ సుఖాంతమై పోతుంది.

ఆ యువకుణ్ణి చూచి దామోదరం అసూయ పడ్డాడు. ఎంత అదృష్టవంతుడు వాడు!...భోజన ప్రియులందరికీ మొహం మొత్తేటట్లు నిరతాన్న దానాలు చేసినా ఐదారు తరాలవరకూ సమసిపోని ఐశ్వర్యాన్ని, 'నీవు లేక నేను లేను' అని ఎప్పుడూ పాడుతూవుండే ప్రాణేశ్వరినీ సునాయాసంగా సంపా దించేశాడు!...ఏమైనా అది సినిమాలోకం. ఆ లోకంతో ఈ లోకాన్ని పోల్చడం తగని పని!

మేడల క్రీనీడలలోనే యిల్లు చేరుకున్నాడు దామోదరం.

విద్యుద్దీప కాంతిలో ఏదో పుస్తకాన్ని తిరగే స్తోంది లక్ష్మి. నల్లని జడలో తెల్లని మల్లెపూలతో, పొందికగావున్న రవికతో, యిస్త్రీ మడతలు చెదరని వాయిల్ చీరతో అలంకృతయై వున్న ఆ జవరాలివైపు దామోదరాన్ని చూచిన వెంటనే అలుక భావంతో 'టచ్ మీ నాట్'లా ముడుచుకుపోయింది. కాళ్లు చేతులు కడుగుకోకుండా, బట్టలైనా మార్చుకోకుండా ఉస్సురని నిట్టూర్చి, పడకమీద వాలిపోయాడు దామోదరం. ఒక్క నిమిషం మౌనం తర్వాత నోరు విప్పింది లక్ష్మి. 'అర్ధరాత్రి గడిచాక గానీ ఆడది జ్ఞాపకం రాలేదన్న మాట! త్వరగా వస్తారని, సినిమాకు వెళ్లొచ్చనీ మధ్యాహ్నంనుంచీ ఎదురుచూస్తున్నా, కళ్లు కాయలు గాచిపోయాయి...'

దామోదరం మాట్లాడలేదు. వెల్లకిలా పరుండి, కాలిమీద కాలు వేసుకుని, ముంజేతులు రెండూ నెత్తి మీదికి చేరవేసి, పైకప్పుల కేసి దృష్టి సారించాడు.

'భోజనానికి లేవొచ్చు...'

చలనరహితంగా వున్న దామోదరం సమాధాన మివ్వలేదు.

'ఎక్కడైనా భోంచేసి వచ్చారా?'

'నాకేమీ వద్దు. కాస్సేపు మాట్లాడకు...' అంటూ విసుగ్గా ప్రక్కకు మరలి పడుకున్నాడతను.

పావుగంటసేపు మౌనం. లక్ష్మి అందంగా ఆవు లించి లేచి తలుపు గొళ్లెంపెట్టి, చేతిలోని పుస్తకంతో బాటు పడకమీద అతని సరసన కూర్చుంది. చేతి లోని కేటలాగులో వేలెట్టి చూపుతూ 'ఈ నెకేసు చూడండి. చాలా బాగుంది కదూ? రోల్డుగోల్డే! చాలా చవక! నలభై రూపాయలేనట!......పక్కింటావిడ కూడా వేసుకొంది. వాళ్లింటాయన కొనితెచ్చారట్ట!' అంటూ ఉపోద్ఘాతం ప్రారంభించింది,

దామోదరం చివాలున పైకి లేచాడు... 'ఛీ! రాక్షసి జన్మ! ... నెక్లేసు కాదుగదా, పావలాపెట్టి పూసలదండైనా కొనివ్వలేనిప్పుడు. నన్ను ప్రశాంతంగా చావనియ్యి...' అంటూ విసురుగా వెళ్ళి తలుపుతీశాడు. నాలుగు సెకన్లలో యింటిముందరి అరుగు అతనికి తల్పమైపోయింది.

అతని గుండెలోని ఆవేదనను గుర్తించి నిద్రా దేవి అతని దరిదాపులకు రావడానికి వెరచింది. దామో

దరం కన్నులు మూసుకున్నాడు...చిక్కని చీకటి! ఆ చీకటిలో వికటనృత్యం సలుపుతూ దర్శనమిచ్చింది బ్రతుకు భయం. దానిచేతుల్లో — అర్ధాంగి కోరికలు, అధికధరలు, అప్పులవాళ్ళ తొందరలు, బ్రతకడానికి మార్గమే లేని భవిష్యత్తు మొదలైన భయంకరాయుధాలు!... దామోదరం గుండెలు వేగంగా కొట్టుకున్నాయి. అతడు కళ్ళు తెరిచాడు.

మరొక్క నెల గడుపగలిగితేగానీ — తాను డబ్బును కళ్ళజూడలేడు. ఈ నెలంతా సంసారం గడపడం, అప్పులవాళ్ళకు నచ్చజెప్పడం, తన మాన మర్యాదలు కాపాడుకోవడం — ఇవి పరిష్కారం కనిపించని సమస్యలు! క్రింద క్రూరమృగాలకు వెరచి, ఆకాశవీధిలో ఒక సన్నని త్రాటిని పట్టుకొని వ్రేలాడుతున్నట్లుంది అతని పరిస్థితి. మాటిమాటికీ గుండె వున్నట్లుండి—మంద్రస్థాయిలో మ్రోగిన వీణాతంత్రిలా ఝల్లుమంటోంది. తనకు ఊర్ధ్వదిశగా సంచరిస్తోన్న నిద్రావిహంగం రెక్కలనీడ అప్పుడప్పుడు సోకి అంతలో జారిపోతుండగా— జాగ్రదావస్థలోనుండి ... నిద్రావస్థలోనికీ నిద్రావస్థలోనుండి జాగ్రదావస్థలోకి ఎగిరెగిరి పడుతున్నాడు దామోదరం.

తెల్లవారు జామున ఐదుగంటలకు మోగిన సైరన్ మోతవిని ఉలికిపడి లేచాడు. పట్టణం అప్పుడప్పుడే ఒళ్లు విరుచుకుంటోంది. దూరంగా రోడ్డులో బస్సులు, లారీలు నిద్రమత్తు వదిలించుకుంటూ పరుగులిడుతున్నాయి. సైకిలుమీద పరలెంచివస్తూ పాలవాడు హారన్ మ్రోగిస్తున్నాడు. తన గృహప్రాంగణం, వీధీ సుపరిచితాలే అయినా, దిక్కూ మొక్కూలేని ఏదో క్రొత్త ప్రదేశంలో వున్నట్లుంది దామోదరానికి. ఇంకొకగంట స్వేచ్ఛగా వుండవచ్చు తాను. ఆ పిదప తనను పరామర్శించడానికి అప్పులవాళ్లు తీర్థప్రజలా రావడం నిస్సందేహం. దామోదరం లేచి నిలబడ్డాడు. ఓరవాకిలిగా మూసివున్న తలుపు సందులోంచి లోపలికి చూశాడు. కటికనేలమీద పడుకుని అలిగిన సత్యభామతీరులో నిద్రపోతున్నది లక్ష్మి. దామోదరం ఏమనుకున్నాడో ఏమో, జేబులో చేయివేసి చూశాడు. మెల్లగా లోపలికి వెళ్లాడు. ఇరవైరూపాయలు తాను వుంచుకుని, అలమారులో పొడరుడబ్బీ వున్నచోట మిగతా డబ్బువుంచి, దానిమీద పొడరు డబ్బీ వుంచాడు. వీధిలోకివచ్చి ఎక్కడికో చరచరా సాగిపోయొచ్చాడు.

ఓ మారుమూల హోటల్‌లో ముఖం కడుక్కుని, ఇడ్లీగారెలతో, వేడివేడి కాఫీతో క్షుద్బాధ నణచుకొని, బారెడు ప్రొద్దెక్కేసరికి — పట్టణానికి దూరంగా, పట్టణంతో ఏవిధమైన సంబంధమూ లేని ఒక నిర్మానుష్య ప్రదేశం చేరుకున్నాడు. పైన ఆకాశం. క్రింద నేల. చుట్టూ పచ్చని చెట్లు, గుట్టలు. చల్లని గాలి. హాయిగా విహరించే విహంగాలు...ఇదొక స్వేచ్ఛాలోకం! ఇక్కడున్నదంతా కావలసినంత స్వేచ్ఛా వాయువులు! మనస్సును ఎటూ ఎగిరిపోనివ్వకుండా పట్టి నిలుపుకోగలిగితే, సంఘ జీవిని బాధించే సమస్యలు యిక్కడ వుండవు. దామోదరం మనస్సుకు కొంత ప్రశాంతత లభించింది. ఇల్లు, ఇల్లాలు, ఆఫీసు, ఋణపీడ—వీటిని గూర్చిన ఆలోచనలను బలవంతాన ప్రక్కకునెట్టి, మనస్సును నిర్మలంగా వుంచుకొనడానికి ప్రయత్నించాడు. కాలం గడిచిపోవడం కూడా తెలియడం లేదతనికి. చెట్ల నీడలలో కొంతసేపు కూర్చుంటాడు. మరికొంతసేపు గోళీలాడుకునే పిల్లవాడిలా చేతినిండుకు గులకరాళ్ళు తీసుకుని కనిపించిన రాళ్ళమీద గురిచూచి విసురుతాడు. వాగులోని ఎండు ఇసుకలో పిచ్చిగీతలు గీసుకుంటాడు. గున్నమామిడి గుబురులలోనుంచి వినవచ్చే శుకపికరవాలను వింటూ మైమరచి పడుకుంటాడు...ఈ విధమైన అనుభవం చాల ఉల్లాసజనకంగా వుందతనికి. ప్రస్తుతం బడి ఎగగొట్టివచ్చిన బడి దొంగ అవస్థ తనది. సంసారం బడి అయితే, ఆ బడిలో నేర్పబడుతూన్న కఠిన పాఠాలకు బుర్ర బద్దలైపోయి యిలా పారిపోయి వచ్చిన మొద్దబ్బాయి తాను.

తొందరపడి సంసారబంధంలో చిక్కుకున్నందుకు కొంత తడవు చింతించాడు దామోదరం. ఒంటరి జీవితంలో వున్న స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు, శాంతిసౌఖ్యాలు

దాంపత్య జీవితంతో ఎక్కడున్నాయి?...అయినా ఇప్పుడు చింతించి ప్రయోజనం లేదు. సంసారం ఋణ జల పూరిత సముద్రమైతే, ఆ సముద్రంలోనికి దొర లించుకుపోయే మధుర జలప్రపూరిత నదీ ప్రవాహం వివాహం. ఈ వినోదం సువిదితమైవుండీ, ఆ నదిలో దిగి విహరించడానికి యుగయుగాలుగా కుతూహలం చూపుతూనే వున్నాడు నరుడు. నీళ్లలోకి దిగకుండా, వినోదం చూస్తూ గట్టున నిలబడేవాడే ధన్యుడు! కానీ, కామాన్ని నిర్జించే శక్తి సంపన్నునికి తప్ప ఇతరు లకు అది అసాధ్యం! సృష్టి పథకమే స్త్రీ పురుష దాంపత్యమైనప్పుడు—కామాన్ని నిర్జించే వరం ఎవడి కున్నది?

ప్రొద్దు వాలిపోయింది. 'ఇప్పుడెక్కడికి వెళ్లాలి?' అని తనను తానే ప్రశ్నించుకున్నాడు దామోదరం. సమాధానం తోచలేదు. బుద్ధి, కాయము అనే ద్వివిధాం శంతో తయారుచేయబడిన యీ మోటారు తన స్వాధీనంనుండి తప్పిపోతోంది. తన మీద తనకున్న శాసనాధికారాన్నే కోల్పోతున్నాడు దామోదరం.

పిలిస్తే పలికే ప్రత్యక్షదైవం వైరాగ్యం. అది వారి వారి స్వభావాలను బట్టి ఏ దశలోనైనా, ఏ స్థితిలోనైనా కలుగవచ్చు. మానవజాతిని దుఃఖం నుండి విముక్తం మొనరించాలన్న సిద్ధ సంకల్పంతో సన్యసించాడు బుద్ధుడు. చేసిన పాపాలకు పశ్చా త్తప్తుడై ప్రాయశ్చిత్తంకోసం వైరాగ్యం స్వీక రించాడు అంగుళీమాలుడు. అధికసుఖాలతో, మితి మీరిన భోగలాలసతతో విరక్తుడైనాడు వేమన. కష్టాలే కాపురం కాగా జీవితాశను పోగొట్టుకున్న బొర్బుగ్యులు వైరాగ్యానికి స్వాగతం పలికిన ఉదంతాలు నిత్యగోచరాలు. వైరాగ్యానికి గల ప్రేరణలలో, స్వార్థమే గానీ, మానవశ్రేయోభిలాష రవ్వంతైనా లేని తెగ వొకటి. ఈ రకపు వైరాగ్యానికి మూలం తన ఏడుపు, తన గోడే! దీని పరమార్థం లోకకల్యాణం కాకపోతే పోవుగాక—ఈతిబాధలనుండి బయటపడితే చాలు!...

దామోదరానికి యిక పలాయనమే శరణ్యంగా కనిపించింది. అతడు చీకటిలో చిన్నగా నడుస్తూ రైల్వేస్టేషన్ చేరుకునేసరికి గంట ఎనిమిదైంది. స్టేషన్‌లో జనసమ్మర్దం ఏమంత ఎక్కువగా లేదు. రైలుకోసం నిరీక్షిస్తూ అక్కడక్కడ కొందరు ప్రయాణీకులు కూర్చుని వున్నారు. ఏ కోరికలూ లేని విరాగిచిత్తంలా ప్రశాంతంగా వెలుగుతున్నాయి దీపాలు. ఇక ఆ స్టేషన్‌లో మజిలీచేసి పోవలసినది— ఒకే ఒక రైలు. తొమ్మిదివ్వరకుగానీ అది రాదు.

స్టేషన్ దక్షిణపుచివర—ఆకులన్నీ రాలిపోయిన ఒక వ్రోడు క్రింద సిమెంటు బెంచీమీద నిట్టూర్పులు విడుస్తూ కూర్చున్నాడు, ఆశలన్నీ రాలిపోయిన మాన వుడు దామోదరం. రైలు ఎప్పుడు వస్తుందా అన్న ఆరాటం, అంతలోపల తామ ఏ అప్పులవాడి దృష్టి జాలంలో చిక్కుకొనవలసి వస్తుందోనన్న ఆందోళన దోబూచులాడుకొన్నాయి అతని మనస్సులో.

ఊహించిన ముప్పు రానేవచ్చింది. చెట్టువెనుక చిరుతపులిలా అకస్మాత్తుగా ప్రత్యక్షమయ్యాడు ఇంటి యజమాని. 'ఏమయ్యా దామోదరం! నీకోసం రావా లనుకుంటూనేవున్నా, శ్రమ తగ్గించావు.'

ఆపత్సమయంలో అబద్ధమాడవచ్చునన్నారు పెద్దలు. దామోదరం వంటివాడికి ఆపదలనేవి తరగని గని. అందుచేత అతడు ఆ అబద్ధాన్ని ఎంత పెద్ద సంఖ్యతోనైనా గుణించవచ్చు. అయినా, అబద్ధ మాడడానికి కూడా సమయస్ఫూర్తి, చాకచక్యమూ కావాలి.

'లేదండీ! మీకు శ్రమ తగ్గించమనుకొని పొర బడ్డారు. తొందరపనిమీద నేను ఈ రైల్లో మద రాసు వెళ్తున్నాను. ఇప్పుడే ఇంటినుంచి బయలు దేరుతూ రెండునెలల అద్దె మా ఆవిడదగ్గర యిచ్చి వచ్చాను...మరీ అంత అవసరమయితే ఇప్పుడు వెళ్లి తీసుకోవచ్చు.'

'అలాగే!' అంటూ ఇంటియజమాని వెళ్లి పోయాడు. ఎంత అమాయకుడు పాపం— అను కున్నాడు దామోదరం. తన రూపును, తన తీరును చూచి కూడా తేలికగా బోల్తా పడ్డాడు.

తాను అబద్ధమాడినంతలో వచ్చే అపాయమేమీ లేదు. మునిగిపోయిన వాడినెత్తిన ప్రవాహం జానెడైతేనేమి, మూరెడైతేనేమి? ఆయన యింటికి వెళ్లి తిరిగి వచ్చేలోపున తాను రైలెక్కి తుర్రుమన వచ్చు. ఆ చిన్న అబద్ధంవల్ల యింతటి ప్రయోజన ముండగా, ఆ తరవాత ఎవరు ఏమనుకుంటారోనన్న చింత తనకెందుకు?

ఈ స్వల్ప వ్యవధిలో తాను ఆలోచించవలసింది తన భార్య విషయం! ఇక ఆమె ముద్దు మురిపెము అన్నీ ఆమె పుట్టింటివారే తీర్చి ఆనందింతురు గాక!

...కడుపులో పేగులు గుర్రుమన్నాయి. దామోదరానిది మొండిప్రాణం. కడుపులో పిడికెడు ఆహారం పడితే చాలు, అది రెండురోజులకు కావలసిన జీవశక్తిని తయారు చేయగలదు. తెల్లవారి ఎప్పుడో తిన్న ఉపాహారం యింకా ఆకలిపులిని అదిమిపట్టుకొనే వుంది. దామోదరం పైకి లేచాడు. కొళాయిలో మంచినీళ్ళు త్రాగాడు. ఇంతలో పోర్టరు గంట కొట్టాడు. కాట్పాడి పాసింజరు భుగభుగలాడుతూ వచ్చి ప్లాట్ ఫారంలో నిలబడింది. దామోదరం చివరి పెట్టెలో ఎక్కి కూర్చున్నాడు.

ఎదురు దిక్కునుండి ఏదో గూడ్సురైలు రావలసి వుంది. అది వచ్చాకగానీ రైలు బయలుదేరదు. దామోదరం కిటికీవద్ద కూర్చుని ప్లాట్ ఫారంలోనికి చూస్తున్నాడు. ధణధణమంటూ గూడ్సుబండి వచ్చి రెండవ లైనులో ఆగింది.

ఆలోచనలన్నీ నిర్విరామంగా ఒకే వస్తువు చుట్టూ పరిభ్రమిస్తున్నప్పుడు—ఆ వస్తువు కన్నుల ముందు సాక్షాత్కరిస్తుంది. అయితే అది పట్టి భ్రమే కాని అసలు వస్తువు మాత్రం కాదు...ప్లాటుఫారం పై లక్ష్మి పరుగు పరుగున వస్తోంది. ఇది భ్రమేనేమో?... అయినా దాన్ని భ్రమ అని సరిపెట్టుకోలేకపోయాడు దామోదరం. రైలెక్కాలన్న ఆత్రుతతో పరుగెత్తి వస్తూన్నది—తన భార్య లక్ష్మి. ఆమె రైలును సమీపించేసింది. దామోదరం మరెట్టి ఆలోచనలకు తావీయక గబుక్కున రెండవ పార్శ్వంలో రైలు దిగేశాడు. లక్ష్మి రైలెక్కేసింది. దామోదరం గబగబా ముందుకు పరుగెత్తి, స్టేషన్ విడిచి, ఊరిలోపలికి పడివాడు.

ఉన్న ఒక్క ఆశ కూడ ముక్కలైపోయింది. తన భార్యను అంత సులభంగా వదిలించుకోజూచిన తాను ఎంత బుద్ధిహీనుడు! త్రెంచుకొందామన్న తెగనిబంధం యిది. కాకపోతే, లక్ష్మి స్టేషన్ కెందుకు పరుగెత్తుకొస్తుంది?...తాను స్టేషన్‌లో వున్నాడని ఆమె కెవరు చెప్పారు?...ఎంతపని చేశాడు ఇంటియజమాని!

...పొగలు గ్రక్కుతూ రైలు వెళ్ళిపోతోంది.

పాపం, లక్ష్మి! ఆమె ఎంతదూరం వెళ్ళినా, వెనుకకు మరలిరాక తప్పదు. అంతలోపున తన దారి తాను చూచుకోవాలి!

ఈ రాత్రిపూట తన యింటికంటే ఆశ్రయం వేరొకటి దొరకదు. ఇల్లు తాళం వేయబడి వుంటుందేమో? అయినా ఫరవాలేదు. ఒక తాళం చెవి తన భార్యవద్ద వుంటే మరొకటి తనవద్ద వుంది. ఒక బంకులో అరడజను అరటిపళ్ళు కొనుక్కున్నాడు దామోదరం. ఇల్లు చేరుకున్నాడు. తాళంతీసి లోపలికి వెళ్లి తలుపు గొళ్ళెం పెట్టుకున్నాడు. అరటిపండ్లు తిని నీళ్ళు త్రాగాడు. అతని దృష్టి గూటిలోకి పయనించింది. ఆనాడు వచ్చిన రెండు ఉత్తరాలు గూటిలో వున్నాయి. ఆ రెంటినీ తీసి పరిశీలించాడు దామోదరం. కొన ఊపిరితో కొట్టుకుంటూ చివరి బడితెపోటు తిన్న చిట్టెలుకలా కీచుమన్నాడు. ఆ రెండు ఉత్తరాలూ రెండు సమ్మెట పోట్లు! అప్పులవాళ్లు వ్రాసిన ఉత్తరాలవి!

తన జీవితానికి కేంద్ర బిందువైన ఆ యింటిలోకి రాగానే మళ్లీ అతని చిత్తక్షోభ రెక్కలూ విప్పుకుంది. తన కిక విమోచనమే లేదా? ఈ సంసారంలోని సుడిగుండాలలోనుంచి బయట కీడ్చి రక్షించే సాధనమే లేదా? ఉంది!...సంసారాన్ని సాగరంతో ఉపమించారు పెద్దలు. ఆ మహాసాగరాన్ని తరించడం మానవునికి కష్టసాధ్యమని కూడా అన్నారు. కానీ

సంసారికి లక్ష్మీ కటాక్షమే వున్నట్లయితే అతని సంసారం క్షీరసాగరంగా, అతని బ్రతుకు పాలకడలిపై శేషతల్పశయనంగా భాసించగలదు. లక్ష్మీదేవి కటాక్షమే పొకనివారికి సంసారం పసిఫిక్ మహాసముద్రమే మరి! కాంచనం కర్మవిమోచనం! తన కష్టాలు బాపగల సాధనం కాంచనం ఒక్కటే!

జీవిత సాగర తరణానికి లక్ష్మి అనే ఉపకరణం వున్నా అది అందుబాటులో లేనప్పుడు సన్యాసమే యిక ఉపాయాంతరం! అయితే సన్యసించడం కూడా తనకు చేతకాదు. మనిషిలో మానాభిమానా లున్నంతవరకు సన్యాస మనేది సిద్ధించని వరం!

ఇక చిట్టచివరి మార్గం...

వేపాకు చేదైనా అది ఆరోగ్యహేతువైనట్లు, ఈ మూడవ మార్గం మనిషికి భయంకరంగా కనిపించినా—అది అన్ని కష్టనష్టాలను ఒక్కుమ్మడిగా నిర్మూలించి వేయడమేగాక, అవి మళ్ళీ మొలక లెత్తడానికి ఆస్కారమే లేకుండా చేసివేయగలదు. అదే—మరణం!

దామోదరం ఒక కృతనిశ్చయానికి వచ్చేశాడు. దాన్ని ఆచరణలో పెట్టడానికి ముందు ఒకే ఒక కోరిక తీర్చుకోవాలి!...అతని కనురెప్పలు భరింప శక్యంకాని నిద్రబరువుతో వాలిపోతున్నాయి. తాను చావటానికి ముందు ఈ అవకాశాన్ని వినియోగించుకుని కంటి నిండుకు నిద్రపోవాలి. తాను అందుకోగల సుఖం యిదొక్కటే! చచ్చిన పిదప యిది రమ్మంటే రాదు. నిద్రావరాన్ని తనివితీర అనుభవించిన తరువాతనే తన శవం దూలానికి వ్రేలాడాలి!...సత్తువ కోల్పోయిన శరీరాన్ని చాపమీదికి వాల్చేశాడు దామోదరం.

హఠాత్తుగా తలుపు చప్పుడైంది. దామోదరం విరాశగా లేచి కూర్చున్నాడు. తన ఈ ఒక్క కోరిక తీరే అవకాశం కూడా జారిపోతూంది. ఎవడో అప్పులవాడు కాబోలు! తలుపుమీద చేతులతో దబదబ బాదుతూన్న చప్పుడు! బహుశా యింటివాడై వుంటాడు—అనుకున్నాడు దామోదరం. కాని ఆ వ్యక్తి ఎవరో కాదు. లక్ష్మి!.

'ఎవరు? ఎవరు లోపల? తలుపు తియ్యండి! మాట్లాడరేం?...తలుపు...'

ఆమె నట్లే గొంతు చించుకోనిచ్చి, ఆమె కేకలు వినిపించని లోకాలకు వెళ్ళిపోవాలనుకున్నాడు దామోదరంగాని, బయటకేకలు ఎక్కువైపోయాయి.'ఇంట్లో ఎవరో దొంగలు దాగున్నారు నాయనోయ్!...ఏమిటీ విడ్డూరం! ఎవరూ పలకరేం?... నాకేమో భయంగా వుంది; ఇలావచ్చి చూడండీ' అంటూ నలుగురినీ కేక లేస్తోంది లక్ష్మి. దామోదరానికి చిరాకు పుట్టుకొచ్చింది. మనిషి చచ్చేటప్పుడైనా ప్రశాంతంగా చావాలి!...విసురుగావెళ్లి భళ్లున తలుపు తెరిచేశాడతడు. అతనిని చూడగానే అద్భుతాశ్చర్యాలతో బాటు, వికసిత పద్మంలా ఆనందదీప్తుల్ని విరజిమ్మింది లక్ష్మి ముఖం. ఆమె ఆగడం విని యింటి ముందర ప్రోగైన కొందరు ఇరుగు పొరుగులు భార్యా భర్త లిరువురినీ చూచి గలగల నవ్వుకుంటూ తమ తమ యిళ్లకు వెళ్ళి తలుపులు మూసుకున్నారు. దామోదరం కోపంతో బుసలుకొడుతూ, మాటాడకుండా చాపమీద సోలిపోయాడు. కాని లక్ష్మి యిదేమీ పట్టించుకోలేదు. ఆమె తన భర్తను వెన్నంటివచ్చి ఆపుకోరాని సంతోషంతో అతని వక్షంమీద వాలిపోయింది.

'ఎక్కడెక్కడ వెతికానో తెలుసా మీ కోసం? ఆఫీసుకుకూడా వెళ్లలేదటనే మీరు?...పోస్టుమన్ చెప్పాడు. అబ్బ! భయపడిపోయాను. ఇక తిరిగి రారేమోనని! గంటక్రితం అద్దె డబ్బులకోసం యింటివాడొచ్చాడు. స్టేషన్‌లో వున్నారని, మదరాసు వెళుతారని చెప్పాడు. స్టేషనుకు పరుగెత్తుకెళ్లాను. రైల్లో మిమ్మల్ని వెతుకుదామంటే వ్యవధిలేకపోయింది. పెట్టెలోకి ఎక్కికూర్చున్నాక రైలు కదలబోతుండగా ధైర్యంచాలక దిగేశాను కాబట్టి సరిపోయిందిగానీ, లేకుంటే మిమ్మల్ని వెతుకుతూ నా దారి గోదారయ్యుండేది. మీరు తప్పక యింటికి వస్తారన్న ఆశ నాకుంటే గదూ? అబ్బ! తిరిగి తిరిగి నా కాళ్లరిగిపోయాయి...అయితే నన్నిలా వెతుక్కుంటూ వుండ

# సుప్రసిద్ధ చరిత్ర పరిశోధకులు : మారేమండ రామారావుగారు

శ్రీ రాపాక ఏకాంబరాచార్యులు

చారిత్రకులే దేశానికి ప్రగతి సాధకులు. వారు మార్గదర్శులు. గతాన్ని రాబోయే దానితో అను సంధించే సేతువులే వారు. చరిత్రకే జీవితాన్ని అంకితం చేసి చరిత్రాన్వేషణమే తమ జీవిత లక్ష్యంగా నడచిన చారిత్రక తపస్వులు మన ఆంధ్రదేశంలో సువర్ణాక్ష రాలతో లిఖింప తగ్గవారు— చిలుకూరి, కొమర్రాజు, మల్లంపల్లి, నేలటూరి, మారేమండ— మున్నగు వారున్నారు. అటి ప్రధాన చారిత్రక తపస్వులలో ఒకరుగా పేరెన్నికగన్న శ్రీ రామారావుగారు. ఆంధ్ర దేశానికి అపారమైన సేవచేసి చివరివరకు చారిత్రక పరిశోధనతోనే జీవితం గడుపుచూ కీర్తిశేషులవ్వటం ఆంధ్రజాతికి ఒక విషాదగాథ. కాని వారి నడవడిని చూచి ఆంధ్రులు దాసినే ఒరవడిగా చరిత్ర పరిశోధన గావించి వారి ఋణాన్ని తీర్చుకొని వారికి తర్పణం చెయ్యాలని ఈ అక్షర తర్పణం చేయసంకల్పించాను.

## జీవిత సంగ్రహం :

శ్రీ రామారావుగారు 1906 నవంబరు 28వ తేదీని (పరాభవ మార్గశిర శుద్ధ త్రయోదశినాడు) పశ్చిమ గోదావరిజిల్లా పట్టిసము సమీపంలోనున్న పోల వరంలో జన్మించారు. తల్లి లక్ష్మీభాయమ్మ; తండ్రి వేంకటకృష్ణారావు గారు.

రామారావుగారు 1925 లో ఇంటర్మీడియట్ క్లాసులో ఉత్తీర్ణులయ్యేవరకు రాజమహేంద్రవరంలో విద్యానముపార్జన గావించారు. వారు బి. ఏ. ఆనర్సు మద్రాసు క్రిష్టియన్ కళాశాలలో చదివి 1928లో డిగ్రీ సంపాదించారు. 1928-31 ల మధ్య వారు ఆచార్య శ్రీ కె. ఏ. నీలకంఠశాస్త్రిగారి పర్యవేక్షణ క్రింద మద్రాసు విశ్వవిద్యాలయంలో పరిశోధన



కీర్తిశేషులు డా. మారేమండ రామారావు

గావించారు. 'ఓరుగల్లు పాలించిన కాకతీయులు' (Kakatiyas of Warangal) అను వారి పరిశోధన గ్రంథానికి 1937 లో మద్రాసు విశ్వవిద్యాలయం పిహెచ్. డి పట్టం ఇచ్చింది. మద్రాసు విశ్వవిద్యాల

యంలో చారిత్రక విషయంపై పరిశోధన గావించి పిహెచ్. డి. పట్టాన్ని గైకొన్న ప్రథమాంధ్రుడు శ్రీ నేలటూరి వేంకటరమణయ్య గారు. ద్వితీయులు శ్రీ రామారావుగారు.

రామారావుగారు 1932 నుండి 1935 వరకు గద్వాల సంస్థానంలోనుండి ఆ సంస్థాన చరిత్రపై పరిశోధన గావించి ఒక గ్రంథాన్ని వ్రాశారు. అది గ్రంథరూపంలో వెలువడకపోయినా దానిలోని ప్రధానాంశాలు ఆంధ్రేతిహాస పరిశోధకమండలి పత్రికలో ప్రకటింప బడ్డాయి. రామారావుగారు 1935 జూన్ నుండి 1949 జనవరి వరకు గుంటూరు హిందూ కళాశాలలో చరిత్రోపన్యాసకులుగా పని చేశారు. 1949 జనవరిలో వారు హైదరాబాదులోని నిజాం కళాశాలలో ఉపన్యాసకులుగా ప్రవేశించి తరువాత రీడరు, ప్రొఫెసరు పదవులుకూడ నిర్వహించారు. 1959 ఆగస్టులో వారు శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో చరిత్ర శాఖాధ్యకులుగా నియమింపబడ్డారు. వారా పదవిని మంచి సామర్థ్యంతో ఏడు సంవత్సరాల కాలంపాటు నిర్వహించి 1966 నవంబరులో ఉద్యోగ విరమణం గావించారు. కాని యూనివర్సిటీ గ్రాంట్సు కమిషన్‌వారు వారిని 1967 జనవరిలో గుంటూరు హిందూ కళాశాలలో ప్రొఫెసరుగా నియమించారు. 1973 అక్టోబరు 26 వ తేదీని వారు దివంగతులయ్యేవరకు ఆ పదవిని నిర్వహిస్తూనే ఉన్నారు.

దేశంలో పేరెన్నికగన్న ఆచార్యులలో శ్రీ రామారావుగారు ఒకరు. విషయ పరిజ్ఞానం ఉన్నవారంతా జ్ఞానాన్ని ఇతరుల కందించలేరు. కొందరు దానిని గ్రంథరూపంలో అందించినా, వాగ్రూపంలో అభివ్యక్తం చెయ్యడం చాల కష్టం. అభివ్యక్తం చెయ్యడం రెండు విధాలు—విషయం వివేచన పూర్వకంగా మరల ఫలించడానికి ఉచితంగా ఉండేటట్టు శిష్య హృదయాలలో నాటటం ఒకటి. దీనినే విషయ జ్ఞానంతో, వివేచనంతో, శిష్యమనస్తత్వ పరిజ్ఞానంతో శిష్యుల శక్తిని బట్టి, సమయాన్నిబట్టి, సత్యాన్ని మరుగు పడకుండ, అసత్యాలపై వారి దృష్టి పోకుండ, విముగు కలుగకుండ ఆసక్తిని కలిగిస్తూ చెప్పేదే అధ్యాపకత్వం అంటారు.

సామాన్య జనంలో చారిత్రకమైన సత్యాలను చాటిచెప్పి వారికి దానిపై ఆసక్తి కలిగిస్తూ తమ చారిత్రక పరిజ్ఞానంతోను, వాగ్విన్యాస వైఖరితోను, అఖండధారతోను శ్రోతలను ముగ్ధులను చేస్తూ చారిత్రకులను, చారిత్రకులు కాని వారిని కూడా ఆకర్షింపజేసే ఉపన్యాసకత్వం ఒకటి. ఈ రెండు శక్తులు పరిపూర్ణంగా కలిగిన వ్యక్తి శ్రీ రామారావు గారు.

రామారావుగారి పర్యవేక్షణక్రింద వివిధ చారిత్రక విషయాలపై పరిశోధన గావించి పిహెచ్.డి పట్టాలను పొందినవారు చాలమంది కలరు. వారిలో శ్రీయుతులు ఆర్. నరసింహారావు, యమ్. రాధాకృష్ణశర్మ, ఝాన్సీలక్ష్మి, ఎ. సూర్యకుమారి, వి. కామేశ్వరరావుగార్లను ప్రధానంగా పేర్కొనవచ్చును.

రామారావుగారు 1930 నుండి 1966వరకు ఇండియన్ హిష్టరీ కాంగ్రెస్, ఆలిండియా ఓరియంటల్ కాంగ్రెస్, న్యూమిస్మాటిక్ సొసైటీ ఆఫ్ ఇండియా సంస్థలతో సన్నిహితమైన సంబంధం కలిగి ఉండేవారు. వానిలో వారు కార్యనిర్వాహకవర్గ సభ్యులుగాను, కొంతకాలం సహాయ కార్యదర్శిగాను పనిచేశారు. వారు ఉస్మానియా, శ్రీ వేంకటేశ్వరా విశ్వవిద్యాలయాలలో సెనేట్ సభ్యులుగాను, అకడమిక్ కౌన్సిల్ సభ్యులుగాను చాలకాలం ఉన్నారు.

## పరిశోధన:

రామారావుగారు శతాధికంగా వ్యాసాలు — భారతి, ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచిక, ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక, కృష్ణాపత్రిక, ప్రతిభ, ఆంధ్ర ప్రభ, ఆంధ్రపత్రిక, ఆంధ్రజ్యోతి, స్రవంతి, ఆంధ్ర ప్రదేశ్ మున్నగు తెలుగు పత్రికలలోను, ఆంధ్రేతిహాస పరిశోధకమండలి పత్రిక (Journal of Andhra Historical Research society) భారతదేశ చరిత్ర పత్రిక (Journal of Indian History) మున్నగు ఆంగ్ల పత్రికలలోను ప్రకటించారు.

'కాకతీయులను గూర్చిన కొన్ని ఆసక్తి జనకములైన సత్యాలు' 'వెలనాడు ప్రభువుల చరిత్ర', 'రేచర్ల వంశ చరిత్ర', 'కాకతీయుల రాజకీయ చరిత్ర', 'నైజాం రాజ్యంలో కనుగొనబడిన కాకతీయ శాసనముల జాబితా' 'రేనాడు చోళులు', 'ప్రాచీన మధ్యయుగకాలపు భారతదేశ గ్రంథాలయాలు' అను శీర్షికలతో ఆంధ్రేతిహాస మండలి పత్రికలలో ప్రకటింపబడిన వ్యాసాలు వారి పాండితీ పాటవమునకు చక్కని ఉదాహరణములు.

పత్రికా సంపాదకులుగా రామారావుగారు మంచి కీర్తి నార్జించారు. వారు 1945 నుండి 1949 వరకు గుంటూరునుండి 'జర్నల్ ఆఫ్ ఆంధ్రా హిస్టరీ అండ్ కల్చర్' అను పత్రికను, 1951 నుండి 1953 వరకు హైదరాబాదునుండి 'జర్నల్ ఆఫ్ దక్కన్ హిస్టరీ' అను పత్రికనూ నడిపారు.

రామారావుగారు అనేక గ్రంథాలను రచించారు. అందు చరిత్రకు సంబంధించినవి, సాహిత్య పరమైనవి, విద్యా విషయికమైనవి కలవు. రామారావుగారి అభిమాన విషయం కాకతీయ చరిత్రం. వారి పరిశోధనలో నాల్గింట మూడు వంతులు కాకతీయ చరిత్ర పైననే సాగింది. రామారావుగారు ఆంధ్రంలోను ఆంగ్లంలోను గ్రంథాలను ప్రకటించారు.

అందు ఆంధ్రంలో రచించిన గ్రంథాలు— ఆంధ్ర గ్రంథమాలవారిచే ప్రకటింపబడిన 'భారతీయ విద్యా చరిత్రము', వేంకట్రామ అండ్ కో వారిచే ప్రకటింపబడిన 'భారతీయ నాగరికతా విస్తరణము' 'తెలుగు వెలుగు', 'శ్రీమధ్వాచార్య చరిత్రము' మున్నగునవి ప్రధానమైనవి. రాజమహేంద్రవరంలోని ఆంధ్రేతిహాస పరిశోధక మండలివారిచే ప్రకటింపబడిన 'కాకతీయ సంచిక' 'శాతవాహన సంచిక'లకు రామారావుగారు ముఖ్యసంపాదకులు. అంతేకాక వారు పది వరకు చరిత్రాత్మక నాటికలను (ఏకాంకికలు) రచించారు. అందు కొన్నిటిని వేంకట్రామ అండ్ కో వారు ప్రకటించారు.

రామారావుగారు ఆంగ్లంలో అనేక గ్రంథాలు ప్రకటించారు. అవి చరిత్రకు, శాసనాలకు, దేవాలయ శిల్పకళకు, నాణెములకు, విద్యా విషయములకు సంబం

ధించినవై యుండి వారి సర్వతోముఖ ప్రతిభను చాటు తున్నాయి.

వారు రచించిన చరిత్రగ్రంథాలు-'విజయపురిని పాలించిన ఇక్ష్వాకులు' (Ikshwakus of Vijayapuri) 'భారతదేశంలోని ప్రాచీన, మధ్యయుగము లందలి గ్రంథాలయాలు (Libraries in Ancient and Mediaeval India) 'ద్వైతమతముయొక్క తొలిచరిత్ర' (Early History of Dwaita School) 'దక్కను చరిత్ర' (Glimpses of Deccan History) 'కృష్ణదేవరాయలు—ఒక చిత్రణ' (Monograph of Krishnadevarayo) అనునవి ప్రధానంగా పేర్కొన వచ్చును.

శాసన పరిశోధనలో కూడ రామారావుగారు ప్రావీణ్యం గడించారు. 'ఆంధ్రదేశము నందలి శాసనములు' (Inscriptions of Andhradesa) అను శీర్షికతో రామారావుగారు మూడు శాసన సంపుటాలను రచించారు. వానిని శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం ప్రకటించింది.

దేవాలయ శిల్పంపై వారు ప్రత్యేకమైన పరిశోధన చేసి అనేక గ్రంథాలను రచించారు. అందు 'ఆంధ్రదేశము నందలి చాళుక్యుల తొలి దేవాలయాలు' (Early chalukyan Temples of Andhradesa) 'తూర్పు చాళుక్య దేవాలయాలు' (Eastern chalukyan Temples) 'శ్రీశైలంలోని దేవాలయాలు' (Temples of Srisailam) 'కొన్ని ఆంధ్ర దేవాలయాలు' (Select Andhra Temples), 'కళింగ దేవాలయాలు' (Temples of Kalinga), 'కొన్ని కాకతీయ దేవాలయాలు' (Selact kakatiya Temples) 'ఆంధ్రదేశమునందలి శైవదేవతామూర్తులు' (Saivite deities of Andhradesa) 'తిరుమలై, తిరుపతి, తిరుచానూర్ దేవాలయాలు' (Tirumalai, Tirupati, Tiruchanur Temples) అనేవి ప్రధానంగా పేర్కొనవచ్చును. ఇందు తొలి నాలుగు గ్రంథాలు ఆంధ్రప్రదేశ ప్రభుత్వ పురావస్తుశాఖవారు ప్రకటించారు. తరువాతి మూడు గ్రంథాలు శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం ప్రకటించింది. చివరివి తిరుమల—తిరుపతి దేవస్థానంవారిచే ప్రకటింపబడింది.

రామారావుగారు ప్రాచీన నాణెములపై పరిశోధన గావించి అనేక గ్రంథములను రచించారు. అందు ప్రధానంగా న్యూమిస్ మాటిక్ సొసైటీ ఆఫ్ ఇండియా వారిచే ప్రకటింపబడిన 'ప్రకటన గావింపబడ్డ శాతవాహన నాణెముల జాబితా' (List of published Satavahana coins) 'హైదరాబాదుచిత్ర వస్తు ప్రదర్శనశాలలోని కొన్ని శాతవాహన నాణెములు (Select Satyavahana coins in the Government Museum, Hyderabad) 'మద్రాసు ప్రభుత్వ చిత్ర వస్తు ప్రదర్శనశాలలోని కొన్ని శాతవాహన నాణెములు (Select Satavahana coins in the Madras Government Museum—Egmore), 'ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ పురావస్తు శాఖ వారిచే ప్రకటింపబడిన 'తూర్పు చాళుక్యుల నాణెములు' (Eastern Chalukyan coins) 'విష్ణుకుండినుల నాణెములు' (Vishnukundin coins) 'బంగారు—వెండి నాణెములు' (Gold and silver coins) అను గ్రంథాలను పేర్కొనవచ్చును.

అంతేకాక రామారావుగారు 'నాగార్జునకొండ సావనీర్' 'బుద్ధజయంతి సావనీర్'లను ప్రకటించారు. 'ఆంధ్రదేశ ప్రాచీన చరిత్రనుగూర్చిన పరిశీలనలు' (Studies in the Early history of Andhradesa) అను విషయంపై విలియం మేయర్ ఎండోమెంటు వారి ఆధ్వర్యమున రామారావుగారు 1968 లో మద్రాసులో మహోపన్యాసాలు గావించారు. వానిని మద్రాసు ప్రభుత్వం ప్రకటించింది. 'కర్ణాటక—ఆంధ్ర సంబంధాలు' (Karnataka-Audhra relations) అను విషయంపై ధార్వారు కర్ణాటక విశ్వవిద్యాలయంలో రామారావుగారు మహోపన్యాసాలను చేశారు. వానిని ధార్వార్ విశ్వవిద్యాలయం ప్రకటించింది.

రామారావుగారు అనేక వ్యాసాలను, గ్రంథాలను ప్రకటించారు. తమ ఉపన్యాసాలచేతను, వ్రాతలచేతను ఆంధ్ర చరిత్రకు అపూర్వ సేవచేసి తరువాతి వారిలో చారిత్రక విమర్శలో నిత్యనూతనోత్తేజాన్ని కలిగించి ఆంధ్ర చారిత్రక మండలంలో అపూర్వ జ్యోతియై నిలిచిన శ్రీ రామారావుగారికి ఆంధ్ర ప్రజానీకం తరపున నా హృదయ పూర్వక నివాళులను సమర్పించుచున్నాను.

# శ్రీ రావూరి దొరస్వామి శర్మ

ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడెమీ ప్రకటించిన తిక్కన పద్యప్రయోగ కోశమును కడచిన 1973 జూను మాస భారతిలో — శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు సమీక్షించుచు, ఎనఁగు శబ్దములో అరసున్న లేదని సిద్ధాంతీకరించిరి. ఎనఁగునకు ఎనవు అను రూపాంతరము గలదు; అరసున్న మీఁది గకారము వకారము గాదు; ఎనఁగులో అరసున్న యున్న ఎనవు అను రూపము రాదు అని వివరించిరి.

ఎనఁగు — సబిందుకమని మా సిద్ధాంతము.

ఎనగు శబ్దము నిర్బిందుకమను సిద్ధాంతమునకు వారు గావించిన సమీక్ష, అందలి మా సమాధానము క్రిందఁ బ్రదర్శింపఁబడును.

(1) 'ఎసంగు—అను రూపము నిర్ధారణ చేయు (తిక్కన) ప్రయోగ మొకటియును లేదు. వచనములలో నున్నంత మాత్రమున అది ఎనగులో అర్ధానుస్వారము గలదని నిరూపించదు. తిక్కనలో కాకపోయినను నితర కవిప్రయోగములందైన ఎసంగు అను రూపము నిర్ధారకముగాఁ గానరాలేదు; కాఁబట్టి యిది నిర్బిందుకముగా గ్రహింపవలెను' — అని వేంకటరావుగారి సమీక్ష.

వచనములలోనుండి నిర్ధారకముగాఁ జాలదనుట లాక్షణికుల పరిపాటి; ఇది కొంతవఱకు సమంజసమే. పద్యములలో నున్నను పాఠాంతరములు పఠించి రూపు మాపుట కతిపయ లాక్షణికుల సంప్రదాయమై కాన వచ్చుచున్నది.

న, జ్జనముల్ దమయంతి యన నెసంగిన దానన్
(నన్నయ-భారత-అరణ్య-2-99)

పతి పురోహితు తోడ సంభ్రమ మెసంగ
(తిక్కన-ఉద్యోగ-1-255)

ఇత్యాది నన్నయ తిక్కన పద్యములలో—ఎసంగు— అనుపాఠమున్నను పాఠాంతరములఁ బ్రక్షిప్తము చేసిరి. తిక్కన విషయమెట్లున్నను, పద్యములలో గణబద్ధముగా—ఎసంగు— అను రూపముగల ప్రయోగములు పూర్వకవుల రచనలలోఁ బెక్కులున్నవి. మచ్చునకుఁ గొన్ని చూపెదను—

సంద్రదంబనఁగ నిట్లె+సంగుచుండు
(ఆంధ్ర కౌముది పుట 25)

క్రేళ్ళేలు నా, నంగుళి సంజ్ఞ లె+సంగు
(వేంకటేశాంధ్రము—మానవ పద్య-41 ప)

(ఇది ప్రాసయతిలోఁ గలదు గాన నిర్ధారకము)

చను తను నొప్పు నె+సంగు ననెడు పేళ్ల
(సాంబ నిఘంటు- 39 ప)

ప్రసూ. నాతి మనోజ్ఞ **మూలముల**
నత్తి నెసంగు మధూక సాలముల్
(మనుచరిత్ర 3 80)

నభో, వాటి నెసంగె నంత సురవార
వధూ ముద వార వార్భటుల్
(వసుచరిత్ర 2-156)

వలపటు నెసంగు శృంగార వనములోన
(దశావతార చరిత్ర-1-106)

అంగదులఁ జేలఁ దద్దయు రంగెసంగి
(అచ్చ తెలుఁగు రామాయణము బా-7 ప)

శుభ లక్షణా రూఢి సొంపెసఁగి
(రసికజన మనోభిరామము—1-17)

వడిఁ దొల్లిటి రూపువాసి నాసి యెసంగన్
(విజయ విలాస—2—45)

నేల యీనిన రీతి నిండి యెసంగు
(పల్నాటి వీరచరిత్ర)

మాసిన చీరఁగట్టి యవమాన మెసంగఁగ
నేడుగాఁగ
(శ్రీనాథుని చాటువు, చాటుపద్యమణి 1–124 పుట)

మౌక్తిక మాలాక్రమము లెసంగగన్
(అప్పకవి 4–255)

ఈ పై ప్రయోగ పరంపర—ఎసంగు—అను సబిందుక రూపమున్నదనుటకు నిర్ధారకమనుటలో సందియము లేదు.

(2) 'ఎసగునకు ఎసవు అను రూపాంతరము గలదు. సాధారణముగా అనుస్వార ఘటిత శబ్దములు వకారములు గావు'—అని రావుగారి సమీక్ష.

ఎసఁగునకు ఎసవు అను రూపాంతరము గలదనుట నిజము. కాని అనుస్వారము (నిండుసున్న, అరసున్న) పూర్వమందుఁగల గకారము వకారము కాదను అను శాసనము చింత్యము. కొన్ని కాకపోవచ్చు; అగునవి పెక్కులున్నవి; చూడుఁడు.

| | | |
|---|---|---|
| వేసఁగి — | వేసంగి — | వేసవి |
| ఒసఁగు — | ఒసంగు — | ఒసవు |
| పొసఁగు — | పొసంగు — | పొసవు |
| మెసఁగు — | మెసంగు — | మెసవు |
| నిసుఁగు — | నిసుంగు — | నిసువు |
| దొసఁగు — | దొసంగు — | దొసవు |
| ముసుఁగు— | ముసుంగు — | ముసువు |
| విసుఁగు — | విసుంగు — | విసువు |
| మడుఁగు— | మడుంగు — | మడువు |
| మఱుఁగు— | మఱుంగు — | మఱువు |
| నురుఁగు — | నురుంగు — | నురువు |
| పొదుఁగు — | పొదుంగు — | పొదువు |
| పెరుఁగు — | పెరుంగు — | పెరువు (వర్ధిల్లు) |
| మొఱుఁగు— | మొఱుంగు— | మొఱువు |

ఈఁగ— ఈవ, ఊఁగు— ఊవు, మ్రాఁగ— మ్రావ, లోఁగు—లోవు, ప్రోఁగు—ప్రోవు, రేఁగు— రేవు (విజృంభించు), తీఁగ— తీవ – 'క్వచిద్గ కారోవః' అను చింతామణి సూత్ర వివరణమున 'వాదేశము వచ్చుచో ముందటి ఖండము లోపించును' అని ఆంధ్ర వ్యాకరణ సంహితలో వ్యాఖ్యానింపఁబడినది.

వేంకటరావుగారు గూడ సాధారణముగా అనుస్వార ఘటిత [1]గకార శబ్దములు వకారములు కావు అని వ్రాయుటలోఁ జోటు చేసికొన్న సాధారణ శబ్దమే యిది ప్రాయికమని వారికి సమ్మతము గాకున్నను యథార్థమును రూఢము చేయుచున్నది.

దీనిం బట్టి అరసున్న మీఁది గకారము కొన్నిట వకారము గావచ్చుననుట స్పష్టము. దానం జేసి ఎసఁగు శబ్దములో అర్ధ బిందువున్న ఎసవు అను రూపము రాదు; ఎసగు అని నిర్బిందువుగా నున్నప్పుడే ఎసవు అను రూపము వచ్చును—అను వ్రాత అపసిద్ధాంతము, అపరిశీలితము.

3) "తిక్కన ప్రాసలో ఎసఁగుశబ్దము ప్రాసలో నొకపట్టున ప్రయోగించినాఁడు.

క. బిగు వెడలక నిలిచి...న్రమంబై పె
ల్లగు మావేగము గడపి యె
సఁగుం బార్వస్థితిన బ్రదుకు సమకూరంగన్
(శాంతి—3—88)

ముద్రితప్రతిలో దీనికి పాఠభేదమున్నది.

'పెల్లగు మా వేగము గడపి యె
స గొనుఁబురాస్థితిన బ్రదుకు నమకూరంగన్.'

ఇచట పదము ఎసగొను...పాఠభేద ముండుటచే నిచట ఎసఁగు శబ్దములేదు. తిక్కన ఖండఖండ ప్రాస చేయలేదు" అని రావుగారి సమీక్ష.

ఎసగులో అరసున్న లేదన్నప్పుడు ఎసగొను పాఠభేదము సంగ్రహింపనేల ? పాఠభేదము సమకూర్చుట చేతనే సమీక్షా కారులవంటి వారెవరో (తిక్కన కృతిలో ఖండాఖండ ప్రాస లేదనువారు) ఇట్టి పాఠము ప్రక్షిప్తము చేసిరనియు, నీ పాఠభేద ప్రక్షేపణ కార్యము పుట్టకుటి ప్రభాత న్యాయమున ఎసగు సార్ధబిందుక (సబిందుక) మని నిరూపించెడు ననుట చెప్పక చెప్పుచున్నది.

---

1. ఇందు గకారములు వకారములు కావనుట సమీచీనము గకార శబ్దము లనుట—ప్రమాదము.

**కూచిమంచి** తిమ్మకవి సర్వలక్షణసార సంగ్రహమున ఈ క్రింది తిక్కన భారత పద్యమును సార్ధ బిందు నిర్బిందుక ప్రాసకు లక్ష్యముగా నొసఁగెను.

‘తగ నక్కురు వృద్ధునకు నొ
సఁగె నాఁటికి నెల్ల దృష్టి సాత్యవతేయుండు’
(ఆశ్రమ–2–121)

ఈ పద్యమునే[2] ఆంధ్ర ప్రయోగ రత్నాకరమున గణపవరపు వేంకటకవి యీ సందర్భముననే యుదాహరించెను.

ఇందుఁ బ్రాసలో నున్నది ‘ఒసఁగు’, ఎసఁగు—కాదు. కాని తిక్కన ఖండా ఖండ ప్రాస చేసినాఁడనుటకిది ప్రమాణమగును. తిక్కన ఖండాఖండ ప్రాస కూర్చినందులకు అప్పకవియే కాక తత్పూర్వాపర లాక్షణికులు ముద్దరాజు రామనాదులు ప్రయోగములఁ బ్రదర్శించిరి. తిక్కన ఖండాఖండ ప్రాస ధారాళముగఁ బ్రయోగించెనని వజ్ఝల శాస్త్రిగారుకూడఁ దమ వ్యాకరణ సంహితాదులలో నిరూపించిరి. ఎసఁగువలె ఒసఁగు శబ్దము సయితము నిర్బిందువని వేంకటరావుగారి మతము. ఈ సమీక్షలో దాని ప్రసక్తి లేదుగాని రావుగారు పరిష్కరించిన శబ్దరత్నాకర నిఘంటువనుబంధములో ‘సవరణలు— వివరణలు’ అను శీర్షిక క్రింద నిట్లు వివరింపఁబడినవి. ‘ఒసగు—ఈ శబ్దమును సార్ధబిందుకముగా ఒసఁగు అనురూపముతో శ. ర., సూ.ని గ్రహించినవి కాని పూర్ణబిందు సహితమైన నిర్ధారక ప్రయోగ మొక్కటియుఁ జూపట్టదు. ఒసగునకు ఒసవు అను రూపాంతర ముండుటయు నిది నిర్బిందుకమని తెలియఁ జేయుచున్నది.’ భారతిలోను శ. ర. లోను ఎసగు–పొసగు శబ్దములను గూర్చి (నిర్బిందువు లమటకు) తి. రామచంద్రగారి భారతి వ్యాసము చూడఁగోరిరి.

ఒసంగు పొసంగులకు నిర్ధారక ప్రయోగము లనేకములు గలవు. అందు నాకు గుర్తునకు వచ్చినవి కొన్ని :

ఒసంగు—

సత్కరుణా దృష్టి నొసంగు
సౌఖ్యము తెలుఁగన్ శక్యమే నీకు
(మనుచరిత్ర–2–65)

సర్వ సద్గుణ గణంబుల ప్రోవగు
నీ కొసంగితిన్
(వసుచరిత్ర—3–16)

కాం, క్ష పరిపూర్తిగా వరమొసంగెద వేఁడు
(పాండురఁగ–4–107)

ప్రతిధ్వను లొసంగం బోయి ప్రవయ్యంబడన్
(రామాభ్యు–8–72)

వనితకుఁ దానొసంగుటయు
వంచనఁ బొంచిన బోటి
(పారిజాత–2–74)

సవతి మొగంబు చూచుచు
నొసంగిన పల్లవవిరాఁది కిన్కునన్
(కవికర్ణ–4–30)

వైభవ మెల్లప్పుడు మా కొసంగి
యను కంపాలీలం బ్రోవుతన్
(రసికజన—1—4)

శ్రీ లెల్లప్పుడొసంగ
నీ సకల ధాత్రీ చక్రమున్
(విజయ 1–1)

ఇంపొసంగు నీయర్మిలి యెల్ల వమ్ముగాఁగ
(నిర్వ - ఉ – రామా 9–88)

పొసంగు—

సంధికి నేఁగి కార్యము పొసంగక
కృష్ణుఁడు రాకయున్.
(భార—ఉద్యోగ– 4–165)

నిన్ను రమ్మనుట పొసంగ దొక్కదినమైనను
(ఉత్తర హరి—1—69)

సాంధ్య రశ్మి సూత్రమునఁ బొసంగి
(పారిజాత—2—43)

దేవి తమోమషీరసము తేటఁ బొసంగఁగ
(శృం—నైషధ– 8—170)

2. అముద్రితము; లిఖితప్రతి తంజావూరు సరస్వతీమహలు గ్రంథాలయమున నున్నది. D. no. 695.

చాటిన వార్త దిక్కులఁ
బొ౦+సంగ వినంబడినన్
(పాంచాలీ—1—67)

గురూ పరిస్థితిఁ బొసంగి
గుంఫనం బెలర్పఁగా
(అనంతుని ఛందము—2—76)

జనల్ జన యకంబు బుష్ణ
కర సంఖ్య విశ్రాంతులన్
బొసంగి కవి పుంగవుల్
పలుక భూమిలోఁ బృథ్వి నా
(అప్పకవి—4—316)

ఎసంగు, ఒసంగు, పొసంగు శబ్దములు పఠింపకములని నిష్కృష్టార్థము—

4) ఎసగు శబ్దములో అరసున్న లేదనుటకు 'ఒప్పెసగు రూఢా పూర్వ సత్కీర్తితో' అను రాఘవ పాండవీయ ప్రయోగమును జూపిరి. ఈ ప్రయోగమునే 'శ్లేషే సఖండ నిఖండ్యోర్మేళనం క్వచిత్ చిన్మత'మ్మను అధర్వణ కారికకు లక్ష్యముగా (శ్లేషయందు సఖండ నిర్ఖండు పదములను ఏకముగా వాడుట క్వాచిత్కముగ నంగీకరింప వచ్చును) అహోబల పండితుడు ప్రదర్శించి యుండఁగా ఎసగులో అరసున్న లేదని యెట్లు చెప్పగలము?

ఈ సందర్భమునఁ ప్రసక్తాను ప్రసక్తముగ అప్పకవీయ రాఘవ పాండవీయ పద్యములకు వేంకటరావుగారి వ్యాఖ్యలోని యపూర్వ వైచిత్రి యించుక ప్రపంచించెద—

'అప్పకవి క్వచిద్గ కారోవః' అను సూత్ర వివరణ సందర్భమున నిట్లు చెప్పినాఁడు.

'ఆఁగె, లోఁగెను, వీఁగెను, దాఁగె, నేఁగె
వాఁగె నను నివి మొదలగు వాక్యములను
బొదలు నక్షరముల చిన్నబొల్లు (ట్ల?) పైగ
కారములు గాని యనునాసికములు గావు'
(2–116)

ఇచట –అర్థమింప వున్నమ నివి, శబగత 'గ'కారములుగాని సరళములుగావు— ఇవి 'వ'గా మారవు —అనగా ఆవెము, లోవెను, వీవెను, అమరూపాంతరములు పొందవు. అను నాసికములులేని 'గ' కారము 'వ' కార మగును అని యర్థము?

ఇది వేంకటరావుగారి అప్పకవి పద్యార్థ వివరణము.

శబ్దగత గకారములు సరళములు గావనఁగా అర్థ మేమో? గకారము సరళము గాదా? మఱి అను నాసికములు లేని గకారము వకార మగును—అనఁగా నేమో? అనునాసిక మనఁగా అరసున్న యని యర్థమా? సున్నకు అనుస్వారమని పేరు–ఇది అరసున్న, నెఱసున్న యని యిరు తెఱఁగులు. అనునాసికము సున్న యనఁబడదు. అనునాసికము వేఱు, అనుస్వారము వేఱు. సమీక్షకారుల పై పద్యార్థము అస్తవ్యస్తముగా నున్నది. అసలు పై అప్పకవీయ పద్య చతుర్థ పాద పాఠమే పొరపాటు. ఆఁగె మున్నగు శబ్దములలో చిన్న బొట్లపై (అరసున్నలపై) నున్న గకారము వకారము గాదని యప్పకవి భావము. 'చిన్నబొట్లపై గకారములు గాని యంతస్థములు గావు' అను రీతిఁ బాఠమున్న సందర్భోచితముగా నుండును. (వకారము అంతస్థము)

నా సమీక్షతో వెలువడిన వావిళ్లవారి అప్పకవీయము 6–వ ముద్రణ (సం–1962) ఈ పాఠమును (సవరణను) గ్రహించియున్నారు. మఱి యీ సవరణను గూర్చి యీ పద్యార్థమును గూర్చి నా సమీక్షలో విరామర్శించియున్నాను. రావుగారు పరికింప లేదేమో?

నా పరిష్కృత గ్రంథమును టీకింపకున్న సరియే. కాని 1951 సం.లో. వెలువడిన అప్పకవీయము వేంకటరావుగారి ఉపోద్ఘాతముతో ముద్రితమైనది. (ఉపోద్ఘాతమునియందు లేదు; ఆ రచన కెట్టి శీర్షికయు లేదు) రావుగారి మున్నుడికిఁ దరువాత శ్రీ కందాడై కృష్ణమాచార్యుల పీఠిక గలదు. ఆ పీఠికలో ఈ పద్యార్థము చర్చింపఁబడి నా సవరణ పాఠము పేరు చెప్పక పీఠికాకారులచే స్వోపజ్ఞముగాఁ ప్రదర్శింపఁబడినది. నేను తన్ముద్రణ కాలమున అప్పకవీయము సవరణలఁ కొన్నింటిని వ్రాసి వావిళ్లవారి కిచ్చితిని. అప్పుడు వావిళ్ల సంస్థలోఁ బండితులుగాఁ బని చేయుచుండిన కృష్ణమాచార్యులు నా సవరణల

గ్రంథాంత శుద్ధ పత్రమునఁ గూర్చి, ఆఁగే లోఁగె వను పద్యము సవరణను బీఠికలోనిచ్చి స్వోపజ్ఞముగ బ్రసంగించిరి. ఆచార్యుల యిమ్మహోపకార్యముమగూర్చి 'పత్యసందేశ' మను శీర్షికతో నా వ్రాసిన వ్యాసము శాస్త్రుల యనుమతితో 1-6-1953 త్రిలింగలోఁ బ్రకటింప బడెను. మఱి దివ్య ప్రభా వివరణ సహిత మైన ఆంధ్ర భాషాభూషణమునకు (1953 సం) శ్రీ వడ్లమూడి గోపాలకృష్ణయ్య వ్రాసిన పీఠికలో 'గకారములు గాని యంతస్థకములుగావు' అను నా సవ రణను స్వీకరించి, అప్పకవీయ పీఠికాకారుల సంగ్రహణ వృత్తాంతము ప్రస్తావింపఁబడెను. (పీఠిక 106 పుట) వేంకటరావుగారు తమ సంపాదకత్వమున వెలువడిన అప్పకవీయములోని పీఠికాగతమగు పై పద్యము సవరణ నైనఁ జూడకుందురా? చూచియున్న పై అపపాఠము అపార్థము అవతరించి యుండదు గదా?

మఱొక వింత—

రాఘవ పాండవీయ ప్రయోగ విషయ మిట్లు వివరించిరి.

'రాఘవ పాండవీయమున, 'ఒప్పెనగ రూఢాపక్తి' (1-26) లో ఎసగ శబ్దము గలదు. ఇచట రామా యణార్థమున ఒప్పె+సగ రూఢాసక్తి — సగరుడు పుట్టుట కాసక్తి అని, భారతార్థమున ఒప్పెసగ— రూఢాసక్తి అని పదచ్ఛేదము. సగర శబ్దము సంస్కృత శబ్దము గాన అందరసున్న ప్రసక్తిలేదు—'

వేంకటరావుగారొసంగిన పాఠము తదర్థము దోష భూయిష్ఠము. పద్యాశ్వాస సంఖ్యలుగూడఁ బ్రమాద పతితములే.

ఆ పాఠ మిట్లున్నది.

'అనఘ్రుశీఁ బృథివీశుఁ డొప్పె
సఁగు రూఢా పూర్వ సత్కీర్తితోన్'

(3—15)

రామాయణార్థమున — ఒప్పెసఁగు+రూఢా పూర్వ సత్కీర్తితో అని పదచ్ఛేదము. పృథివీశుఁడు. రూఢ—ప్రసిద్ధమైన, అపూర్వ సత్కీర్తితోన్, ఒప్పెసఁగున్—అని అర్థాన్వయము.

భారతార్థమున—ఒప్పె— సగురు — ఊఢ— అపూర్వ సత్కీర్తితో అని పదచ్ఛేదము. సగురు— తండ్రితోఁగూడినట్లుగా, ఊఢ—వహింపబడిన, అపూర్వ సత్కీర్తితోన్, ఒప్పెన్—అని యర్థాన్వయము — (చూ—ముద్దరాజు పెదరామన రా—పాం...వ్యాఖ్య).

అర్థమిట్లు వ్యాఖ్యాతమై యుండఁగా రామా యణ పక్షమున సగురుడు పుట్టుట కాసక్తియను నర్థ మెట్లుపుతిల్లినదో ? రావుగారి 'సగరూఢా సక్తి' పాఠములో వారి మతప్రకారము సగర శబ్దమునే గ్రహించినను బదచ్ఛేద మెట్లో? సగర + ఊఢ— సగరోఢ యగును. సగరు అని ఉకారాంత శబ్దముగా భావించిరా ? (సగరు + ఊఢ). మూలగ్రంథమును దద్వ్యాఖ్యను జూడక వ్రాసిరా? పరిశోధనా పరమేశ్వరు లిట్టి సవిరాక్షను సంతరించుట శోచనీయము. పై పరా మర్శనుబట్టి.

ఎసఁగుశబ్దము సార్థబిందుక మనియు, అర సున్నవిరాఁది గకారమునకు పైతము వకారము రావచ్చు ననియు విజ్ఞులు గ్రహింతురు గాక.

———



# 'బడి=ఎడమ'

"'కవ్వడి. కవ+వడి కాదు' అను వ్యాసములో శ్రీ తిరుమల రామచంద్రగారు 'కవ్వడి<కవ్+బడి–>కవ్+వడి–>కవ్వడి, అయ్యుంటుం దేమో' అని నా మనస్సులో చాలకాలంగా మెదలుతూంది. కవ్, కవి, కవియు అనే క్రియలకు కవియు, ఆక్రమించు, ప్రేరించు అనే అర్థా లున్నాయి. కవియు+బడి–>వడి. బడితోను కవిసేవాడు, బడితోను కవియ బడే వాడు అని అర్థం చెప్పుకోవచ్చు. మరి బడి అంటే ఏమిటి? బడి అనే పదానికి ఎడమ అనే అర్థం వుంటే ఎడమచేతితోను కవిసేవాడు, లెఫ్ట్ హాండర్ కూడ అని చెప్పుకోవచ్చు. కాని తెలుగు నిఘంటువులు చూస్తే బడి పదానికి ఎడమ అనే–అర్థం కనిపించదు" అని వ్రాసూ, సాంబోపాఖ్యానములో "హరుబడి కంటికి హరికుడి కంటికి" అనే పద్య పాద ముదహరించి "శ్రీ డాక్టర్ యశోదారెడ్డిగారే నాచనసోముని ఉత్తర హరివంశములోని మరో బడి పదం చూపి పుణ్యం కట్టుకొన్నారు" అని "ఇది నిఘంటువులకు ఎక్కక పోవడం ఎంత దురదృష్టం" అని 1973 అక్టోబరు భారతిలో వ్రాసియున్నారు. 'బడి' ప్రయోగములను శ్రీ రెడ్డిగారి కడ వారు తెలిసికొనుటలో గాని వారికి వారు "కృతజ్ఞత" తెలుపుకొనుటలో గాని 'వారిని సంచార నిఘంటు'వనుటలో గాని కాదనగలవారుండ జాలరు. కాని 'ఇది నిఘంటువులకు ఎక్కకపోవడం ఎంత దురదృష్టం' అనుటే విచార్యము.

'బడి' పదమునకు 'ఎడమ' అని పలు నిఘంటువులలో గలదు. వాని నెత్తిచూపుటయే ఈ వ్యాసోద్దేశ్యము.

1) బడి=ఎడమది

(సూర్యరాయాంధ్ర నిఘంటువు. సంపుటము 5 పుట 1056.)

ఆ నిఘంటు సంపాదకులు, శ్రీ తిరుమల రామచంద్ర గారు శ్రీ యశోదారెడ్డిగారి కడ దెలిసికొని ప్రచురించిన నాచన సోమనాథుని ఉత్తర హరివంశములోని పద్య పాదమే ఉదహరించియున్నారు. ప్రయోగాంతరము చూపకపోవుటచే నిఘంటు సంపాదకులు పొరబడిరేమోయని చూడగా 'కుడి' కడను దీనినే యుదహరించి యున్నారు (చూడుడు.సూర్యరాయాంధ్ర నిఘంటువు ద్వితీయ సంపుటము. పుట 346.)

2) బడి=ఎడమది. అవ్య. ద్రు.

వావిళ్ల నిఘంటువు 4 వ సంపుటము. పుట 2167.

3) బడి=ఎడమది. వై. విణ.

ఆంధ్ర శబ్ద రత్నాకరము. తృతీయ సంపుటము. పుట 1246.

ఇట్లు పలు నిఘంటువులలో గల 'బడి'ని శ్రీ తిరుమల రామచంద్రగారు గుర్తింపక 'ఇది నిఘంటువుల కెక్కలేద'నుట నిజముగు దురదృష్టమే. బహుశః వారు శబ్ద రత్నాకరము మాత్రమే చూచి యట్లు వ్రాసిరేమో.

—శ్రీ టి. పి. భాష్యకారాచార్యులు.

## పండిత రాయల వెక్కిరింపులు

1973 నవంబరు భారతిలో కలగూరగంపలో 'పండిత రాయల వెక్కిరింపులు—ఒక అనుమానము' అనే పేరుతో శ్రీ పాతకోట రాధాకృష్ణ మూర్తిగారి విమర్శ చూచాము. దానికి నా సమాధానం:

(1) 'ధుత్తూరముమ గురించి చెప్పిన శ్లోకాను వాదంలో ధుత్తూర ప్రసక్తియే లేదు' అన్నారు. కాని ఉంది. నా పద్యాన్ని మరోసారి పరిశీలిస్తే అందుల

'ధూర్త' అనే సంబోధన కనబడుతుంది. మోసగాడు, ఉన్మత్తు అనే రెండు అర్థాలు గల ఈ పదాన్ని వదిలేస్తే సొగసు ఏముందీ?

(2), (3) లలో అన్నట్లు కేళింకురుష్వ, క్షుద్రాశ్మశర్కరేతి అనే మాటలను వదిలేశాము. నిజమే. కాని అందువల్ల అర్థం చెడిపోయే ప్రమాదం ఏమీ లేదు.

(4), (6), (7) లలో నా అనువాదం మక్కికి మక్కిగా లేదని వారి అభిప్రాయమైనట్లు తోస్తోంది. ప్రత్యక్షరానువాదం సాధ్యమూ కాదు, అవసరమూ లేదు.

ఇంక (5) వ సందేహాన్ని గురించి: 'పెరుగున్ నీ యెడ కల్పవృక్షములు నీవే వశాళి స్వర్వాటికన్' అనే నా పద్యంలో యతి తప్పినది అని వారు అనుకున్నారు. కాని యతిభంగం కానేలేదు. నేను ప్రయోగించినది అఖండయతి. 'దంతంబుల్ పడనప్పుడే తనువునందా రూఢి యున్నప్పుడే' అని అఖండయతిని ప్రయోగించిన ధూర్జటిని స్తుతిమతియైన ఆంధ్ర కవి అని ప్రశంసించారు కదా, అటువంటప్పుడు అదే ప్రయోగాన్ని నేనెందుకు చేయకూడదూ? నా పద్యాలలో ఈ అఖండ యతులను నేను యథేచ్ఛగా ప్రయోగించాను. వాటిని అప్పకవి ఒప్పుకోకపోతే మించిపోయింది లేదు.

'మానుగ విశ్రమాక్షర సమంచితమై
  స్వర మాదినన్ తదీ
యానుగుణాక్షరంబు కొనియైనను
  చెప్పగ నొప్పు నీ క్రియన్
భాను సహస్రభాసి వృషభాధిపు
  డన్నటు లర్థ యుక్తమై
పూనివచో నఖండ పడి పొల్పుగు
  నాది కవి ప్రణీతమై'

అని ఢంకా బజాయించిన భీమకవి ఉండనే ఉన్నాడు నా కొమ్ము కాయడానికి.

— శ్రీ పుహిళన నళినీమోహన్.



# గ్రంథవిమర్శలు

## మోహనాంగ విరచిత మారీచీ పరిణయము

(ప్రచురణ : డా. కావుటూరు వెంకటరామ చంద్రరావు, ఎం. ఏ; పిహెచ్. డి. హిస్టరీ లెక్చరరు' 'మానస' 435-4. తెక్కలిమిట్ట, నెల్లూరు. క్రౌను 1/8 పే. 66+117 లు వెల రు 5/-లు.)

పూర్వము సమదర్శిని తక్ల ఉగాది సంచికలో (1929-30) శ్రీ సెట్టి లక్ష్మీ నరసింహముగారు ప్రచురించిన మారీచీ పరిణయములో అవతారిక చతుర్థాశ్వాది పద్యగద్యములు, కథా సంగ్రహము ఇందులో పునర్ముద్రితములైనవి. అది ప్రధాన గ్రంథమైనా సంపాదకులు విపులమైన ఆంగ్లో పోద్ఘాతము ఆంధ్రప్రస్తావనాదులు చేర్చి పెద్దగ్రంథముగా చేసినారు. మూలగ్రంథము 29 పేజీలు మాత్రమే తక్కినది 154 పేజీలైనది. సమదర్శిని లోని గ్రంథము ఆంధ్ర విమర్శకులకు తెలియక పోలేదుగాని ప్రామాణిక చరిత్ర పరిశోధకులు శ్రీ మల్లంపల్లి, శ్రీ వేలటూరి వంటివారు పట్టించుకొనలేదు. అందులకు కారణము దానిని నమ్మక పోవుటయే యనదగును. కాని ఈ మధ్య 1970 ఏప్రిలు భారతిలో శ్రీ కొండూరి వీరభద్రాచార్యులు వ్యాసమొకటి ప్రచురించి ఆంధ్రుల దృష్టిని దానిపై మళించినారు. అందుకు ఫలితముగా ఈ విపుల గ్రంథము వచ్చినది. ఇప్పుడీ విషయము బుద్ధిమంతులు పట్టించుకొనక తప్పదు.

ఇప్పుడు విచారించవలసిన విషయ మొక్కటియే, మన తెనుట మంచిన గ్రంథము శ్రీకృష్ణదేవరాయల కుమార్తె మోహనాంగి వ్రాసినదా, కాక శ్రీ సెట్టి లక్ష్మీనరసింహముగారు స్వయముగానో మిత్రుల ద్వారానో రచన చేసి ఆమె పేర ప్రచురించిరా అను విషయము! సంపాదకులు ఉభయ వాదములకు గల ఆధారములను మొత్తముమీద దాచకుండ న్యాయముగానే ప్రవర్తించిరి కాని మోహనాంగి కృతమే యని భ్రాంతిపడి లోకమును భ్రమ పెట్ట పూనుకొన్నారు. మాననీయులైన డా. గోపాలరెడ్డిగారికి సంపాదకులీ భ్రాంతి కలిగించి వారిచేత తొలి పలుకు వ్రాయించి వారి ఆమోద ముద్రను సంపాదించిరి. డా. రెడ్డిగారు స్థూలముగా తప్ప గ్రంథము పరీక్షించినట్లు తోపదు.

సంపాదకుల కీ గ్రంథములో ఎన్నో చరిత్ర విరుద్ధాంశములు కనిపించినవి. కాని అట్టివి రాయ వాచకము నను శ్రీకృష్ణరాయ విజయము నను కలవని సరిపెట్టుకొనిరి. రాయ వాచకము రాయల అనంతరము వ్రాయబడినది కాని ఆయన జీవించియుండగా పుట్టినది కాదు. సంపాదకులు కావ్యేతర విషయములందు చూపిన శ్రద్ధ కావ్యభాగ పఠనములో చూపలేదు.

18 వ శతాబ్ది తృతీయ భాగములో ఛాటరుటను అను యువకుడు తానే కొన్ని కావ్యములు వ్రాసి అవి మధ్యయుగ కవులవని ప్రచురించి కొలది కాలము ఆంగ్ల పాఠకులకు భ్రాంతి కలిగించెను. కాని త్వరలోనే సూక్ష్మబుద్ధులగు ఆంగ్ల విద్వద్విమర్శకులు దాని నిజ స్వరూపము బయలు పరుపగా, ప్రతిభాశాలియైన ఆ యువకుడు 18 సం.ల వయస్సున ఆత్మహత్య చేసుకొనెను. శ్రీ సెట్టివారు ఎన్నడో దివంగతులైనందున ఇందులో మన కట్టి చిక్కులేదు. ఛాటరుటను కల్పిత కావ్యాలలో కనబడే కవితా ప్రతిభ కూడా ఈ కల్పిత కావ్యఖండములో కనబడదు. శ్రీ సెట్టివారు అప్పటికే పరిణతుడు, లబ్ధ ప్రతిష్ఠుడు, ఉడుకు రక్తమున్న ఛాటరుటనువంటి యువకుడు కాడు.

మోహనాంగి విరచితమని శ్రీ సెట్టివారు ప్రచురించిన గ్రంథము ఆమె రచించినదా కాదా అని సందేహించుటకు కారణ మేమని ప్రశ్నించుటయు కొంత సబబే, కాబట్టి ప్రాథమికముగా సంశయము కలిగించు సందర్భములు ముందు పేర్కొందుము.

1. సంచికలో ప్రచురించినప్పుడు శ్రీ సెట్టి గారు తమకు మూలప్రతి ఎక్కడ నెట్లు లభించినదో, ఎట్లున్నదో, దేనిమీద వ్రాయబడినదో– ఇట్టి వివరము లేనియు సూచన మాత్రముగా కూడ తెలుప లేదు.

2. మూలగ్రంథ కథా సంగ్రహమంతా ఇచ్చినారు కాని మూలగ్రంథమును తాము ప్రచురింపలేదు. అట్టి ప్రయత్నము కూడ చేయలేదు. వారే కోరినచో వారికి ఆశ్రయదాతలు మిత్రులు నైన జయపురం మహారాజులు విక్రమ దేవవర్మగారు గాని ఆంధ్రసాహిత్య పరిషత్తువారుగాని కళ్లకద్దుకొని ప్రచురించి యుండే వారు.

3. మూలగ్రంథమును వారితరులకు చూపిన జాడగాని, చూచినామను వారి ప్రమాణముగాని ఇంతవరకు లేదు. ఈకావ్యపు టునికి సాహిత్యవేత్తల ఎరుకలో చాలకాలమునుండి యున్నదని సంపాదకులు ఐదుగురిని (పే. 45, 50) ఉదాహరించిరి కాని అందరివి సమదర్శిని ప్రచురణ తర్వాతివే.

పై సందర్భములు చాలును. ఇది శ్రీ సెట్టి వారి సృష్టియా నిజముగా మోహనాంగి కృతమా అని సందేహముతో జాగరూకతతో ముందుకు పోగుటకు సంపాదకులును ఆ సందేహముతోనే ప్రారంభించి నట్లున్నారు.

కాని సంపాదకులకు సూటిగా నిర్ణయము చేయకుండుటకు ఇంకొక విషయము అడ్డు తగిలినది. అది కావలి వెంకటరామస్వామిగారు 1929 సం. లో ప్రచురించిన Bio-Graphical Sketches of Deccan Poets అను గ్రంథములో మోహనాంగీ కృతమైన మారీచీ పరిణయ గ్రంథ ప్రస్తావ ముండుట. ఇక్కడనే సంపాదకులు మొదటి తప్పటడుగు వేసినారు. దానితో వారి పరిశ్రమయంతయు తప్పుదారి పట్టినది.

కావలివారి గ్రంథములో మోహనాంగీకృత మారీచీ పరిణయ ప్రస్తావ ముండుటచేత దీనిని 1829 తర్వాత శ్రీ సెట్టివారు గాని మరియొకరు గాని సృష్టించి యుండుట సాధ్యముకాదని సంపాదకులు (పే. 11) నిర్ధారణ చేసినారు. ఎందుకు అవ కాశము లేదో ఏమాత్రము ఆలోచన గలవారికైనను స్ఫురింపదు. కావలివారు ప్రస్తావించిన గ్రంథము ఇదియే యని సాక్ష్య మేమున్నది? ఈ గ్రంథము మోహనాంగీకృతమని నిశ్చయించి తమ పార్టీ పక్షము వాదించు లాయరు వాదమువలె ఉన్నది కాని న్యాయాధికారి హోదాలో చెప్పునట్టిదిగా లేదు, సంపాదకుల పద్ధతి.

ఇట్లు నిశ్చయించి శ్రీ కావలివారి గ్రంథములోని విషయములు ప్రామాణికము అని బలపరచుటకు దాని ముఖపత్రములో 'Compiled from onthentic documents' అని యున్నందునను, పీఠికలో గ్రంథ సామగ్రి తాము సంచారములో సేకరించితిమని వ్రాసి యున్నందునను అందలి విషయము లన్నియును ప్రామాణికములుగా గ్రహింపవలెనని సంపాదకులు నిశ్చయించిరి. నిజ మాలోచించినచో కావలివారి గ్రంథములోని విషయము లన్నియు ప్రామాణికములు కావనియే గాక అందులో ప్రస్తావించిన మారీచీ పరిణయము ప్రస్తుత గ్రంథము కాదనుటకే ఎక్కువ ఉపపత్తులు కల్గవని ధ్రువపడును. ఈ గ్రంథమునకు సంబంధించిన విషయములు కావలివారి గ్రంథమునుండి సంపాదకులే ఈ క్రింది విధముగా ఉదాహరించినారు :

'This poetess was a princess, and the daughter of Ktishnaroya she, received an excelent education in her infancy and was well versed in rhetoric and poetry, while in the bloom of youth she married Rama-royalu, after which she still continued her studies, and employed much of her time in reading those works, in Telugu composed by poets at her father's court; by constant

application she attained to considerable preficiency, in the art of versification, and wrote a poem entitled 'Marichi Parinaya' the subject of which is taken from Mahabharat; in this poem very elegant description is given, of the Marichi damsels, the work consists of five books; this Princess had no issues and became unfortunately a widow; in the prime of life (according to tradition) she was immolated on the funeral pile of her husband' (Deccan poets, pp. 77-78.)

(N. B. The punctuation marks are copied from the present book as found on P. VIII.)

పై దానితో మోహనాంగి రామరాయల భార్య యనియు తన యౌవనములో (Prime of Life) భర్తతో సహగమనము చేసినదనియు ఉన్నది గదా! ఈ గ్రంథము రచించినది మోహనాంగియైనచో 1518 లోపున రచించి యుండవలెను. అప్పటి కామెకు 15 సం.ల వయస్సైనను ఉండవలె. రామరాయలు తల్లికోట యుద్ధములో 1565 లో మరణించె ననునది తిరుగులేని సత్యము. అప్పటికి మోహనాంగి 62 సం.ల వృద్ధురాలై యుండవలెను. అట్టిదానిని యౌవన మనుట ఎంతలాగినను పొసగునా? పదేళ్ల వయస్సులోనే గ్రంథ రచన చేసినదన్నను 57 సం.ల వయస్సుండును కాబట్టి కావలివారి గ్రంథము పూర్తిగా ప్రామాణికము కాదు.

ఈ గ్రంథమును గూర్చి కావలివారి గ్రంథములో తెలిపినది చూచినచో శ్రీ సెట్టివారు ప్రమరించినది అది కాదనుటకు ఆధారము లున్నవి.

1. శ్రీ కావలివారు అది 5 ఆశ్వాసముల (Five Books) గ్రంథమన్నారు. శ్రీ సెట్టివారు 6 ఆశ్వాసముల కథాసంగ్రహ మిచ్చినారు.

2. కావలివారు కథామూలము మహాభారత మన్నారు. శ్రీ సెట్టివారి గ్రంథావతారిక రామాయణ కథాసంబంధి యనుచున్నది.

3. కావలివారు గ్రంథములో మరీచి కన్యకల మధుర వర్ణన మున్నదన్నారు. శ్రీ సెట్టివారి కథ సంగ్రహములో దాని సూచనయే లేదు. పైగా మారీచుని పెంపుడు పుత్రిక కనుక నాయికకు మారీచి యని పేరు వచ్చినదన్నారు.

సంకుసాల నృసింహకవి కవికర్ణ రసాయనములోని 'ఉద్ధతుల మధ్య పేదల కుండ దరమె' అను పద్య పాద సందర్భమును గూర్చి మోహనాంగి యను పేరుగల రాయల కుమార్తె చతురంగ క్రీడలో ప్రస్తావించె ననియు, ఆమె గ్రంథమును రాయల సభలో పఠనము చేయుచున్నప్పుడు తెనాలి రామలింగడు కొంటె ప్రశ్న వేసెననియు రెండు కథలు ఆంధ్రదేశములో ప్రచారములో నున్నవి. కావలివారి గ్రంథ ప్రస్తావము వినియుండవచ్చు గాని శ్రీ సెట్టివారు చూచినట్లు తోచదు. ఈ కట్టుకథలు ఆధారముగా తమకు తెలిసిన విజయనగర చరిత్రను అనుసరించి శ్రీ సెట్టివారు అవతారిక రచించినట్లు భావించుట సమంజసము. 99 గద్యపద్యము లున్న అవతారికలో విజయనగర చరిత్రకు సంబంధించిన విరుద్ధాంశము లెన్నో కలవని సంపాదకులే వివరించినారు. ముఖ్యమైన వివి.

1. 1518 లో రాయలకు కలిగిన కుమారుని పేరు తిరుమలరాయలు కాగా ఇందులో సదాశివనామ మున్నది. అతని కా పేరుకూడ నున్నదేమో యని సంపాదకులు సూచించిరి. మరియు అచ్యుతదేవరాయల తర్వాత ఆయన సోదరపుత్రుడు సదాశివరాయలు సింహాసన మెక్కి 1542-1576 రాజ్యపాలన మొనర్చెను; కావున ఈ గ్రంథము మోహనాంగికాక సదాశివరాయల పిమ్మట రాయలపుత్రుని నామము తెలియనివారు ఎవరో వ్రాసియుందురని ఊహచేసిరి, సంపాదకులు.

2. ఈ అవతారిక సాళువవంశమూ తుళువ వంశము ఒకటే యనుచున్నది. దీనికి ఆనాటి ఆధారము లేవియు లేవు. కాని శ్రీ కందుకూరి వారును కొమ్మరాజువారును అట్లే చెప్పియున్నందున వారు ఈ మారీచీ పరిణయ మాధారము చేసికొనియే చెప్పిరేమోయని ఊహ చేసిరి. వారి వ్రాత లాధారము చేసుకొనియే శ్రీ సెట్టివారు కల్పించియుందురని ఊహించలేక పోయిరి.

3. శాసనములును, ఆముక్తమాల్యదయు రాయలు ఉదయగిరిలో పట్టుకున్న గజపతి తిరుమల కాంతరాయులనియు, కొండపల్లిలో పట్టుకొన్నది ప్రహరేశ్వరుడనియు చెప్పుచున్నవి. ఈ అవతారిక ప. 75 ఉదయగిరిలో ప్రహరేశ్వరపాత్రుని పట్టుకొని కిరీటము త్రొక్కె ననుచున్నది. తిరుమల కాంతరాయలు మొదట ఉదయగిరిలోనుండి పారిపోయి కొండపల్లిలో పట్టుపడెనని ఊహింప నిది ఈపొరపాటు సవరింప వీలులేనిదనియు రాయల తర్వాత ఎవరో ఈ గ్రంథము వ్రాయుచు తెలియక పొరపాటుచేసి యుందురని సంపాదకులు సమర్థించిరి.

4. శాసనములు, పారిజాతాపహరణము, న్యాయనిజా వ్రాత రాయలు కొండవీడు ముట్టడిలో వీరభద్రుని పట్టుకొనెనని చెప్పుచున్నది. మరియు ఆముక్తమాల్యద రాయవాచకము రాయలు పిలిచినను ప్రతాపరుద్ర గజపతి యుద్ధమునకు రాక వింధ్యారణ్యములకు పారిపోయి తన కుమార్తెను రాయల కిచ్చి వివాహము చేసెనని చెప్పుచున్నది. ఈ అవతారిక 76, 77 పద్యములు వీరభద్రరాజు కనకగిరిలో నుండగా పిలిచినను యుద్ధమునకు రాక వింధ్యారణ్యములకు పారిపోయి తన కుమార్తెను రాయల కిచ్చెనని చెప్పుచున్నది. తెలంగాణములోని కనకగిరినుండి వింధ్యారణ్యములకు పారిపోవుట అసంభవము. వీరభద్రుడు ప్రతాపరుద్ర గజపతి కుమారుడు. అతడు తండ్రి ప్రతినిధిగా కొండవీడు పాలించుచుండెను గాని కనకగిరి నెప్పుడు పాలింపలేదు. కాబట్టి 'వీరభద్ర' అనునది 'వీర రుద్ర' అని సవరించిన గాని కుదరదు. అట్లు సవరించుటకు 90 వ పద్యము అడ్డము వచ్చును. అందులో నరపతియైన వీరభద్రుని పుత్రిని ఓఢ్రుడై గజపతియగు ప్రతాపరుద్రుని పుత్రిని రాయలు పెండ్లాడెనని యున్నది. కాబట్టి రాయలు తండ్రి కుమార్తెనే కాక అతని కుమారుని పుత్రిని గూడ వివాహమాడె ననవలసి వచ్చును. దీనిని ప్రస్తావించి సంపాదకులు అట్టి వివాహము ఆచార విరుద్ధమైనను నిషిద్ధము కాదని సమర్థించిరి.

5. విజయనగరమువారికే గాని నరపతులను పేరు గజపతులకు లేదు. కావున వీరభద్రుని నరపతి యనుటయు పొరపాటే.

6. సంపాదకులు XXXVII పేజీలో అవతారికలోని 76, 77, 81, 90 పద్యములలోని విషయములు సమర్థింప వీలుకానివనియు అవి గ్రంథకర్తకు చరిత్ర తెలియనందున దొరలినవనియు కావున ప్రస్తుతము నమ్మరానివనియు సంపాదకులు ఉద్ఘాటించిరి.

ఇందులో ఇన్ని అసందర్భము లున్నను విజయనగర చరిత్రకు ఆధార గ్రంథముగా ఇది రాయ వాచకమునకును కృష్ణరాయ విజయమునకును తీసిపోదనియు, అథమ పక్షము 200 సం.ల నాటిది కనుక దీనిని నిర్లక్ష్యము చేయ వీలులేదని సంపాదకు లుద్ఘాటించిరి.

సంపాదకు లంగీకరించి చూపినవి కాక మరి కొన్ని అసందర్భములును మా కిందులో కనిపించినవి.

1. ఇందలి 10 వ పద్యములో రాయల కవితలో పెద్దన అల్లిక బిగి, తిమ్మకవి ముద్దుపలుకు, 'పాండురంగ కవిగతిం బదక్రమంబు' కలవనియున్నది. దీనిని ప్రస్తావించి సంపాదకులు రామకృష్ణుడు రాయల సమకాలికుడా కాదాయని మాత్రమే ముఖ్యముగా విచారణ చేసిరి. ఉద్భటారాధ్య చరిత్రము వ్రాసిన రామలింగకవియే రామకృష్ణుడని పరిశోధకులు అంగీకరించిన తర్వాత వారిద్దరి సమకాలికత్వమునకు సందేహము లేదు. కాని పాండురంగకవి అనుట పాండురంగ

మాహాత్మ్యము వ్రాసిన తర్వాతగాని సాధ్యము కాదు గదా! వసుచరిత్ర రచన (1570) తర్వాతనే పాండురంగ మాహాత్మ్యము వ్రాయబడెనని డా. నే. వెం. రమణయ్యగారు యుక్తియుక్తముగా వాఙ్మయ వ్యాస మంజరిలో నిర్ధారణ చేసినారు. కాబట్టి 1518 లో మోహనాంగి 'పాండురంగకవి' అనుట పొసగదు. ఇది ఎవరో 1570 తర్వాత వ్రాసినారు. ఈ విషయము సంపాదకులు ప్రత్యేకముగా పట్టించుకొనలేదు.

2. ఆధునికులు పలువురుచేయు పొరపాటు ఒకటి ఇందులో కనబడుచున్నది. 20 పద్యము స్త్రీలను గూర్చి 'పీండ్రడకుఁ బాకమున్నది' అని మోహనాంగి యన్నట్లున్నది. చక్రవర్తి కూతురు, శ్రీ సెట్టి లక్ష్మీనరసింహముగారివంటి మధ్యమ కుటుంబములలోని ఆడుబడుచులు చెప్పదగిన మాటలుగాని చక్రవర్తి కూతురు తన కవ్వయించుచు చెప్పదగినవి కావు.

3. ఇట్లే ఆధునికుల శైలిని పట్టియిచ్చు పద్యము లెన్నో యిందున్నవి. ముఖ్యముగా, 1, 4, 18, 23, 25, 28, 29, 34, 36, 38, 74, 82, 83 పద్యములు చూడదగినది.

4. తిరుమలాంబ రాజపుత్రిక, చిన్నాదేవి వేశ్య. తిరుమలదేవి పుత్రికయైన మోహనాంగి చిన్నాదేవిని రాయల పత్నిగా చెప్పకుండును గాని 'చిన్నాంబా మనోహరుండును' (వ. 17) అని చెప్పి యుండదు. పైగా ఈ గ్రంథము ఆముక్తమాల్యదను పేర్కొను చున్నది. ఆముక్తలో రాయల పత్నులలో చిన్నాదేవి పేరులేదు. ఆమె 1518 ప్రాంతములో మరణించినదని సంపాదకులు దీర్ఘచర్చ చేసినారు.

5. గ్రంథ మధ్యములో ఆశ్వాసాదిలో ఒక్క కందపద్యములో కృతిపతిని సంబోధించుట ఆంధ్ర కవుల నియతాచారము. ఇక్కడ చతుర్థాశ్వాసాదిలో కృతిపతికి కుమార జననము అతనికి ఆశీర్వచనాదులు 4 గద్య పద్యములలో విస్తరింపబడినవి. ఇది కృత్రిమము. అసందర్భములలో అగ్రగణ్యము.

6. గ్రంథ కథా సంగ్రహము చూచినచో అది పిచ్చివాని అసందర్భ కల్పనగా కనబడుచున్నది. సహృదయ చక్రవర్తియగు రాయలు ఇట్టి గ్రంథము విని ఆనందించి యుండువనుట ఆయన సహృదయతకే కళంక మాపాదించునదిగా నున్నది.

ఇన్ని చిక్కులు అసందర్భములు ఒక్క ఊహతో విడిపోగలవు. అది ఈ గ్రంథము శ్రీ సెట్టి లక్ష్మీ నరసింహముగారు స్వయముగానో మిత్రుల చేతనో వ్రాయించి మోహనాంగి రచించినట్లు ప్రచురించినారనుట. ఆయన కప్పటికి తెలిసిన చారిత్రక విషయములను గ్రథనము చేసినారు.

అయితే శ్రీ సెట్టివారు దీనిని సృష్టించుటకు కారణమేమని బుద్ధిమంతు లడుగ వచ్చును. వాల్మీకి సీతాదేవి చేత 'అహిరేవ హి జానాతి హ్యాహేః పాదాన్ నసంశయః' అనిపించిన మాటలు గుర్తుకు వస్తున్నవి. ఈ కాలపువారు, ముఖ్యముగా శ్రీ సె. ల.న వంటి వ్యావహారిక భాషావాదులు, పూర్వకవులవలె పద్యరచన చేయగలరా అని సవాలు రాగా దీనిని వారు రచించి యుండవచ్చును. వ్రాసినది మొత్తము 103 గద్య పద్యములే కదా! తక్కిన గ్రంథము వ్రాయు శ్రమ లేకుండ కథా సంగ్రహ మిచ్చినారు.

కాక అప్పటికే ఆముక్తమాల్యదను రాయలు రచించెనా లేదా యనువాద మున్నందున, రాయల రచనను ధ్రువపరచుటకు (ప. 93) ఇది వ్రాసిఉండ వచ్చును. ఆముక్తమ రాయలే రచించెనని ఆవేశముతో గ్రంథరచన చేసిన శ్రీ వెల్లాండ ప్రభాకరామాత్యులవంటివారు దీనిని ఉపయోగించు కొనిరి.

ఇవి యన్నియు కావచ్చును. మరి ఎన్ని కారణములైన నూహింప వచ్చును.

సంపాదకులే ఇందులోని అసందర్భములను చాలవరకు స్పష్టపరచియు విజయనగర చరిత్రకు ఆకర గ్రంథముగా దీనిని పరిగ్రహింపదగునని ప్రతిపాదించుట చరిత్ర సత్యమునకు అపరాధముచేయుటే. పైగా చరిత్రాధ్యాపకులైన సంపాదకులీ ప్రతిపాదన చేయుట సంతాపకరము.

సంపాదకులు ప్రసిద్ధ పరిశోధకులైన డా. వేటూరి వెంకట రమణయ్యగారి వంటివారిని ఈ గ్రంథము నిజానిజములు తేల్చుడని సవాలువంటిది వేసినారు. అది పుట్టలో నిదురించుచున్న మహా భుజంగములను మేలుకొలుపుట వంటిదే కాగలదు. సత్యచరిత్ర పరిశోధనకు వారు వినియోగించుచున్న కాలమును ఓపికను వృథావేయుడని కోరుట వంటిది.

సంపాదకులకు కల చరిత్ర విజ్ఞానమును ఇంత కంటె ప్రయోజనకరములును యథార్థములును అగు విషయముల వైపుకు మరలించి చరిత్ర పరిశోధనకు సహాయ భూతులు కావలసినదని అర్థించుచున్నాము.

— శ్రీ నోరి నరసింహశాస్త్రి

## భాషాచారిత్రక వ్యాసావళి

[కర్త: డాక్టర్ తూమాటి దోణప్ప, ఆంధ్ర విశ్వవిద్యాలయం, వాల్తేరు. ప్రచురణ: ఆంధ్ర సారస్వత పరిషత్తు, తిలక్ రోడ్, హైదరాబాదు. డెమ్మీ సైజు 353 పుటలు. వెల తొమ్మిది రూపాయలు.]

డాక్టర్ తూమాటి దోణప్పగారు తెలుగుభాషా చరిత్రకు సంబంధించి వివిధ పత్రికలలో ప్రచురించిన అమూల్యములయిన వ్యాసాల సంకలనం ఈ భాషా చారిత్రక వ్యాసావళి. ఇది హైదరాబాదు ఆంధ్ర సారస్వత పరిషత్తు వారిచేత వారి ప్రణాళికలలో ఒకభాగ మయిన పండిత పారస్వతం కింద ప్రకటించ బడింది. శబ్దస్వరూప నిరూపణం భాషా విజ్ఞానంలో ఒక భాగం. తెలుగులోని దేశ్యేతరపదజాలం యొక్క స్వరూప స్వభావాలనూ, పుట్టు పూర్వోత్తరాలనూ నిర్ణయించడానికై చేసిన పరిశ్రమఫలమే యిందులోని వ్యాసాలు. ఈ సంపుటిలో నన్ని కవి ద్వయం—అన్యదేశ్యాభాసములు. నన్నయ — అన్యదేశ్యాభాసములు, వికృతివివేక కర్తృత్వం, ఆంధ్రభాష— హకారాది పదాలు, శ్రీనాథయుగం—అన్యదేశ్యాలు, తెలుగులో బుడతకీచు నుడులు, మరాఠీలోని తెలుగు నుడులు, తెలుగులోని కృతక ప్రామాణిక రూపాలు అని మొత్తం ఎనిమిది వ్యాసాలు ఉన్నాయి. డాక్టర్ దోణప్పగారి బహుభాషా పాండిత్యం. సుశిక్షితమయిన వారి పరిశోధనాపద్ధతీ, తార్కికమూ హేతుబద్ధమూ అయిన వారి వాదధోరణీ ఏ విషయం గురించైనా సమగ్రంగా పరిశీలించి కానీ నిగ్గు తేల్చకపోవడంలో వారికున్న ఓర్పు నేర్పులూ, విషయ ప్రతిపాదనలో వారి స్పష్టవైఖరీ—ఈ అన్నింటినీ మించి తమ వ్రాతల ప్రామాణికతకై వారు తీసుకునే ప్రయాస శ్రద్ధాసక్తులూ ఈ లక్షణాలన్నీ వారి యీ వ్యాసాలలో మనకు అంతటా కనిపిస్తుంది. ఉత్తమ పరిశోధకులకు ఉండవలసిన ముఖ్యలక్షణాలు ఇవి అని వేరే చెప్పనవసరం లేదు.

నన్నెచోడుని కుమారసంభవంలో ప్రయుక్తము లయిన కైపు 'తరవారి' బాకు అనే పదాల ఆధారంతో, అవి అన్యదేశ్యాలనే భ్రాంతితో అవి ఆధారంగా చేసుకుని నన్నెచోడుని కాలనిర్ణయం చెయ్యడానికి ప్రయత్నించిన శ్రీ వేదం వెంకటరాయశాస్త్రి, శ్రీ దేవరపల్లి వెంకట కృష్ణారెడ్డిగారల వాదం సరి కాదని శ్రీ దోణప్పగారు నన్నికవిద్వయం— అన్యదేశ్యాభాసములు అనే యిందులోని తొలివ్యాసంలో నిరూపించడానికి ప్రయత్నించారు. నన్నెచోడుడు ప్రయోగించిన కైపు, అరబ్బీభాషా జన్యమయిన కైపు భిన్న వ్యుత్పత్తికము లనీ, మొదటిది శుద్ధదేశ్యమనీ, రెండవది అచ్చంగా అన్యదేశ్యమనీ - నిఘంటుకారుల అలసతవల్ల కావచ్చు లేదా ఏమరుపాటువల్ల కావచ్చు – ఈ రెండు పదాలూ ఏకారోపం కింద ఏకరూపంగా సంగ్రథితం కావడం పొరపాటనీ యిందులో సయుక్తికంగా నిరూపించారు. అలాగే 'తరవారి' శబ్దాన్ని గురించి చర్చిస్తూ దీన్ని సంస్కృతపదంగా సంస్కృత ప్రామాణిక నిఘంటువులే పేర్కొని ఉండడమూ, నవీన ఔత్తరాహ భాషా నిఘంటువులలో ఈపదం సంస్కృతమూలకంగా ప్రదర్శితమయి ఉండడమూ, తెలుగు నిఘంటువులు దాన్ని తత్సమంగా ఉల్లేఖించి ఉండడమూ—విశేషించి ఆపదం సంస్కృతకావ్యాల్లో, గ్రంథంలో ప్రయుక్తమయి ఉండడమూ వివరంగా ప్రదర్శించి శ్రీ దోణప్పగారు తుదకు అది అన్యదేశ్యంకాదని సిద్ధాంతిక

రించారు. అన్యదేశ్యమయిన ఈ శబ్దమే సంస్కృతంలోకి ప్రవేశించి ఉండకూడదా? అని ఒక పూర్వపక్షం వేసుకుని దానికి సమాధానంగా అది అరబ్బీ - పారసీ భాషా కోశాలలో ఎక్కడా కనిపించదనీ, అలా వాటిలోకి ఎక్కక పోవడమే అది అన్యదేశ్యంకాదు అనడానికి ఋజువు అనీ సిద్ధాంతం చేశారు. ఇక తరవాతిపదం బాఁకు. నన్నెచోడుని పద్యంలో యిది ప్రయుక్తమయియున్న సందర్భాన్నిబట్టీ— ఇతర స్థలాల్లో అతని ప్రయోగసరళినిబట్టి అది సరళాది అయిన బాఁకు కాదనీ, పాచి, శైవలం అనే అర్థం కలిగిన 'పాఁకు' అని పరుషాదియైన పదం అనీ శ్రీ దొణప్పగారు నిర్ద్వంద్వంగా నిరూపించారు. 'కావున పోరఁ బాఁకు దాల్చి నీరుగొన్నటు' అనుపాఠమే సాధువనీ, చోడకవి ప్రయోగపఙ్క్తికి సమ్మతమనీ తుదిని సిద్ధాంతం చేశారు. అక్కడిశబ్దం బాఁకు కాదు పాఁకు అని నిరూపించినా శ్రీ దొణప్పగారు 'పాఁకు దాల్చి నీరుగొన్నటు' అని వారంగీకరించిన పాఠానికి ఆ పద్యంలో అర్థ సమన్వయం ఎలా కుదురుతుందో తెలపలేదు 'పాఁకు దాల్చి నీరు గొన్నటు పోరను ప్రతిబలంబు నెల్ల పాయవడఁగ దోలి గొడుగు క్రింది రూపుఁబొడిచి జయంబు నీకిత్తు నధిప! నన్ను వింతనమ్ము' అనే అన్వయం సారస్యము సముచితము అన్నారు. ఈ అన్వయం ఎలా 'సారస్యమో' అర్థవంతమో నాకు బోధపడడంలేదు. 'పోరఁ బాఁకు దాల్చి' అనీ, 'పాఁకు దల్చి' అని ఉన్నపాఠాలే అర్థవంతములని తోస్తుంది. చెరువులో నీళ్ళు తాగేటప్పుడు ముందుగా నీటిపయిని అలముకొని ఉన్నపాచిని — పాకుడును — పక్కలకు తొలగించి నీళ్ళు గ్రహించినట్లుగా—రాజుకు ముందుగా మూగిఉన్న సైన్యంలోకి చొచ్చుకొనిపోయి ఆ సైన్యములను — పాచిని రెండువైపులకూ తొలగించినట్లుగా రెండు వైపులకూ తరిమి (పాయపడునట్లుతోలి) నీరు గ్రహించినట్లుగా గొరుగుకించి రూపును పొడిచి— అలా లభించిన విజయాన్ని నీకిస్తాను అని పద్యార్థం. 'పాఁకు దల్చి'—అన్నప్పుడు తల్చి—తలఁగు—(ప్రేర) తలఁచు (రూ) తల్చు—దాని క్త్వార్థకంగా తల్చిగా ప్రయుక్త మయిందనుకో వచ్చు. లేదా 'పాఁకు దాల్చి' అన్నప్పుడు తాలు (ప్రేర) తొలుచు (రూ) తాల్చు—దాని క్త్వార్థకంగా తాల్చి అని ప్రయుక్తమయిందనుకో వచ్చు. అపుడు తాల్చు అంటే దూరము పోవునట్లు చేయు, తొలు చేయు అని అర్థం కుదురుతుంది. ఇది శ్రీ వేటూరివారు తెలిపిన అర్థం. 'శ్రీ వేటూరి వారి విలువును అనుసరించి పక్షాంతరముగా అన్వయించినను తకరారులేదు' అని వారు ఈ పాఠమును పాక్షికంగా అంగీకరించే ఉన్నారు. కానీ అర్థవంతమయిన దాన్నే ప్రధానపాఠంగా గ్రహించి ఉండవలసిందని నా సూచన.

నన్నయ-- అన్యదేశ్యాభాసములు అనే వ్యాసంలో శ్రీ దొణప్పగారు నన్నయ ప్రయోగములుగా తలపబడు గాడీలు. సవతు అనే పదాలను గూర్చి చర్చించారు. శ్రీ దేవరపల్లి వెంకటకృష్ణారెడ్డిగారు ఊహించినట్లు 'గాడీ' తురుష్కభాషా పదము కాదు. హింద్వార్య భాషా జన్యమయిన అన్యదేశ్యము అని మొదట తేల్చి ఆ తరువాత సాధుపాఠ నిర్ణయంకోసమని దేశంలోని వివిధ గ్రంథాలయాల్లో ఉన్న తాళపత్రప్రతుల్లోనూ, కాగితపు వ్రాతప్రతుల్లోనూ, నేటిదాకా ముద్రితములయిన వివిధ భారత ప్రతుల్లోనూ కానవచ్చే పాఠాల నన్నిటినీ సేకరించి తమ పరిశీలనఫలంగా ఎక్కువ తాళపత్ర ప్రతుల్లో 'గాడిదలను' అనుపాఠమో లేక దానిపర్యాయ వాచకాలయిన ఖరములు, గంధర్వహయములు ఇత్యాది పాఠములో ఉండడమూ—'గాడీలు' అన్నపాఠం నడుమంత్రపు పాఠంగా 1907 కు పూర్వం ముద్రితమయిన ప్రతుల్లో ఉండి, ఆ తరువాత ముద్రిత గ్రంథాల్లో అది 'గాడిదలను' అని సాధుపాఠంతో పరిష్కరింప బడడమూ చక్కగా వివరించారు. అలాగే 'సవతు' అన్నచోట కూడా తాళపత్రాది వివిధ ప్రతుల్లో ఉన్న వివిధ పాఠాలను సేకరించి వానిలో 'సరియు' ఘటిత పాఠములును, తత్పర్యాయా లయిన సాటి, సమము ఇత్యాది ఘటిత పాఠములును సంఖ్యలో చాలా అధికంగా ఉన్నట్లు నిరూపించి 'సరియుఁగావు' అనునదే సాధుపాఠమని సిద్ధాంతం చేశారు. ఇలా ఒక్క సంఖ్యాబలంచేత మాత్రమేకాక నన్నయ్య ప్రయోగ సరళివల్లకూడా ఆ పాఠమే సాధువు అంటూ స్థలాం

తరాల్లోని నన్నయ ప్రయోగాంతరాలను సాక్ష్యంగా చూపారు. ఇలా సాధుపాఠస్థాపనంతో మాత్రమే తృప్తి పడక 'సవతు' అనేది ప్రకృతభవమే కానీ, శ్రీ దేవరపల్లి వారు భ్రమించినట్లు హిందీనుండి ఎరవు తెచ్చుకొనిన అన్యదేశ్యం కాదు అని నిరూపించారు. ఈ రెండు ప్రయోగాలకు సంబంధించి వారు వివిధ గ్రంథాలయాల్లో ఉన్న తాళపత్ర ప్రతుల, వ్రాతప్రతుల పాఠాలను సేకరించడంలో వారు చూపిన శ్రద్ధ, పడిన పరిశ్రమ వారి సత్యాన్వేషణ దీక్షను తెలియజేస్తుంది.

వికృతి వివేక కర్తృత్వం అనే వ్యాసంలో వికృతి వివేకం అథర్వణకృతం కాదనీ, అహోబల పండితుడు దాన్ని వ్రాసి గ్రంథ ప్రామాణ్య సంసిద్ధికై అథర్వణుడి పేరు పెట్టాడనీ పండితలోకంలో ఇది వరకే ఉన్న అభిప్రాయాన్ని అంతరంగికము లయిన మరికొన్ని సాక్ష్యాలతో బలపరిచి సిద్ధాంతీకరించడానికి శ్రీ దొణప్పగారు ప్రయత్నించారు. 'దోషా భూషోత్తరీయాణి విశ్నైత్వం నాస్తి మధ్యయః' అన్నకారికను ఆధారం చేసుకుని సాగించిన చర్చలో 'తాయెతు' శబ్దాన్నిగురించి చర్చించిన తెలుగు లాక్షణికుల అభిప్రాయాల నన్నిటినీ ఒకచోట క్రోడీకరించి—15 వ శతాబ్దికి పూర్వం అది మన భాషలో ప్రయుక్తం కాలేదనీ, ఇది మాత్రమేకాక అరబ్బీ, తురుష్కాది అన్యభాషా పదా లేవీ కూడా ఆనాటి సాహిత్యంలోనూ, శాసనాల్లోనూ కనిపించవనీ చెబుతూ 'తాయెతు' అన్యదేశ్యపదమే అని స్థాపించి, దాని స్వరూపాన్ని గురించి తెలుపుతున్న వికృతి వివేకకారిక 15 వ శతాబ్ది తరువాతి కాలంలో రచింపబడి ఉంటుందని, అందుచేత వికృతి వివేకం అథర్వణ కృతం కాదనీ నిరూపించారు.

ఆంధ్రభాష—హకారాది పదములు అన్న తరువాతి వ్యాసంలో తెలుగులో ఉన్న హకారాది పదాలలో రమారమి మూడింట రెండువంతులు తత్సమములు, తద్భవములు పదికి బొటాబొటి, కన్నడమునుండి ప్రతిదేయములు పలుబది పైచిలుకు, మిగిలినవాటిలో ముక్కాలు మువ్వీసము అరబ్బీ పారసీకాది భారతీయేతర భాషలనుండియు, మరాఠీ, మొదలయిన నవీన ఔత్తరాహ భాషలనుండియు సంసర్గవశమున ప్రవేశించిన అన్యదేశ్యములు, ఆంగ్లపదములు ఒక కొన్ని, పండితులు పామరులు సృష్టించిన కృతక ప్రామాణిక రూపములు మరికొన్ని, తక్కినవి వ్రేళ్లమీద లెక్కింపదగిన ధ్వన్యనుకరణ శబ్దములు అని నిరూపించి, తెలుగునకు సొంతమయిన హకారాది పదములు బొత్తిగా లేవని సిద్ధాంతం చేశారు.

శ్రీనాథయుగం—అన్యదేశ్యములు అన్న వ్యాసంలో తొలుత శ్రీనాథయుగానికి చెందిన కావ్యసంచయాన్ని నిర్ధరించుకొని, వాటిలో ప్రయుక్తము లయిన అన్యదేశ్య శబ్దజాలం పుటు పూర్వోత్తరాలను అకారాదిగా కూర్చి చూపారు. శ్రీనాథుని కాలంలో అన్యదేశ్య శబ్దజాలం అంతగా తెలుగులో ప్రవేశించడానికి చారిత్రకము లయిన కారణాలు హేతుబద్ధంగా తెలిపారు.

తెలుగులో బుడతకీచుపదులు అన్న వ్యాసంలో తెలుగులో ప్రవేశించిన పోర్చుగీసు పదజాలాన్ని అకారాదిగా కూర్చి, రూపాంతరాలతో, అర్థవివరణలతో వాటిని ప్రదర్శించడం మాత్రమేకాక ఆయాపదాలు తెలుగులో ప్రవేశించడానికి కల చారిత్రక కారణాలను తెలుపుతూ ఆనుషంగికంగా పోర్చుగాలు చరిత్ర, బుడతకీచు భాషా చరిత్ర, దానివ్యాప్తి, బుడత కీచులతో తెలుగుదేశానికీ,తెలుగుప్రజలకూ ఉండిన ప్రత్యక్ష పరోక్ష సంబంధాలను వ్యక్తపరిచే చారిత్రక సన్నివేశాలనూ, బుడతకీచులు మనదేశానికి తెచ్చిన వృక్షగుల్మాది సంపదనూ వివరించారు. తెలుగులో ప్రవేశించిన బుడతకీచు నుడులనుగురించి తమకు పూర్వం జరిగిన కృషిని సమీక్షించి, తాము కూర్చిన పదపట్టికకు భూమికగా దానిని సైనిక సంబంధములు, నావిక పదములు, క్రైస్తవమత పదములు, గృహనిర్మాణ సంబంధములు, ఉడుపులు ఇత్యాదిగా వర్గీకరించారు. ఈ వర్గీకరణం మూలంగా తెలుగులో ఆయాపదాలు ప్రవేశించడానికి కల చారిత్రక కారణాలకు పట్టుకోవ

డానికి పీలవుతుంది. అలాగే మరాఠీలో తెలుగుపదాల ఉనికికి చారిత్రకకారణాలను తెలుగు మరాఠీల సంబంధమును ప్రస్తావించి అలాంటి పదాలను అకారాదిగా కేంద్రీకరించి అర్థవివరణలు యిచ్చారు. వారిచ్చిన పదపట్టికలో మరాఠీలో ప్రవేశించిన తెలుగుపదాల ప్రధానారోపిలే యాభై దాకా ఉండడం మనకు ఆశ్చర్యం కలిగిస్తుంది. వారే అన్నట్టు ముమ్ముందు ఈ విషయంలో జరుగవలసిన పర్యాప్తపరిశీలనకు ఇది ప్రస్తావనాప్రాయం అయి ఎంతగానో ఉపకరిస్తుందని చెప్పవచ్చు.

తెలుగులోని కృతకప్రామాణిక రూపములు అన్నవ్యాసంలో కృతక ప్రామాణికరూపములు (Hyper forms) భాషలో యేర్పడడానికి కల కారణాలను సమీక్షించి పండిత లోకవ్యవహార ప్రసిద్ధములయిన కొన్ని కృతక ప్రామాణిక రూపములను పదాది రేఫ ఘటిత సంయుక్తవర్ణ నిర్మాణము, ఎదంతములు ఇయాంతము లగుట, తాలవ్య వ్యంజనములమీది తాలవ్యేతర స్వరములు తాలవ్యస్వరము లగుట సాధురేఫములు శకటరేఫములుగా పరిణమించుట, అజాది పదములు వకారాదులుగా మారుట, అజాది పదములు హకారాదులగుట అనువర్గముల కింద విభజించి చూపి తెలుగులో కృతక ప్రామాణిక రూపాలు ఏ పద్ధతులమీద, ఏ సామాన్య సూత్రాలకు అనుగుణంగా యేర్పడ్డాయో, యేర్పడుతుంటాయో వివరించారు. ఈ సందర్భంలో 'భాషావ్యవహర్తలలో అక్షరశిక్ష యెఱుగని పామరులు మొదలుకొని ఊహాపోహ విచక్షణులగు పండితులవరకు వీని సృష్టిలో పాలు పంచుకొన్నవారే...వీనిలో చాల పాలు లోక వ్యవహారములో రూఢము లయి యున్నవి. వీనిని గ్రామ్యములనియో, అనింద్య గ్రామ్యములనియో పరిహరించుట యుక్తిసహముకాదు. ఇవి యవశ్యము సువరిగ్రాహ్యములే' అనుచు వారు చేసిన పరిశీలనము హెచ్చరిక మెచ్చదగినవి.

ఇలా యీ సంపుటిలో చేర్చబడిన వ్యాసాలన్నీ భాషాశాస్త్ర చర్చకు సంబంధించి అనేకానేక మాతన విషయాలను తెలియచేస్తూ, ముఖ్యంగా తెలుగులోని అన్యదేశ్య పదజాలమునకు సంబంధించి శ్రీ దొణప్పగారు జరపిన గొప్ప పరిశోధనమునూ, పరిశ్రమనూ ఎత్తి చూపుతున్నవి. శాస్త్రీయమయిన చర్చలు ఎలాంటి చిత్తశుద్ధితో, శ్రద్ధతో జరగాలో నిరూపిస్తున్నవి. పూర్వపక్షీయులను నిరుత్తరులను చేయడానికి, స్వీయవాదస్థాపనకూ ఎలాంటి ఆత్మాతీతమయిన, విషయప్రవణ మయిన(impersonal and objective) దృష్టి, దృక్పథం పరిశోధకుడికి ఉండాలో ఇవి పరోక్షంగా ఉపదేశిస్తున్నవి. 'గ్రంథ పరిశీలనము లేని వాదములు అక్రమములు, అప్రయోజకములు' అన్న పూజ్యులు శ్రీ దీపాల పిచ్చయ్య శాస్త్రిగారి వాక్యం వీరి పరిశోధనకు వరవడి. శ్రీ పిచ్చయ్య శాస్త్రిగారి 'సాహిత్య సమీక్ష' తరవాత ఆ పద్ధతిలో అంత లోతుగా శబ్ద స్వరూప శబ్దార్థ నిర్ణయాలకై బహుగ్రంథ పరిశీలన మూాదలగా సాగిన పరిశ్రమ ఫల మీ గ్రంథం. ప్రజాసారస్వతం తోపాటు పండిత సారస్వత్వాన్నికూడా ప్రచురించడం తమ ధ్యేయంగా పెట్టుకొన్న ఆంధ్రసారస్వత పరిషత్తువారు భాషాశాస్త్ర చర్యలకు సంబంధించిన ఈ వ్యాసాలను కూర్చి సంపుటిగా గ్రంథ రూపంలో ప్రకటించడం చాలా ముదావహం.

అయితే యివి శాస్త్రచర్చలుగదా అని, పండితైకవేద్యములుగా మాత్రమే ఉండాలని భావించి శ్రీ దొణప్పగారు ఈ వ్యాసాలను గ్రాంథికశైలిలో రచించినట్లు తోస్తుంది. కొన్నిచోట్ల శైలిమీది వ్యామోహంతో కొంత కఠినశైలిని అవలంబించడమూ, మామూలు పదాలతో అర్థం సుగమం అయ్యే స్థలాలలో పాండిత్య స్ఫోరకములయిన పదాలను ప్రయోగించి అతిగహనం చేయడమూ కనిపిస్తుంది. పార్తుకాలు, బుడతకీచు, పరాసు, ఏసీయపాదరీలు (Jesuit fathers) మొదలయిన ఒక కొన్నిపదాల ప్రయోగంమీద వీరికి చాలా మోజు ఉన్నట్లు కనిపిస్తుంది. ఈ వ్యాసాలు శిష్ట వ్యావహారికశైలిలో రచింపబడి ఉంటే అవి మరింత రమణీయంగా సుగమంగా ఉండడం మాత్రమేకాక పండితులు కాని కొందరు సాహిత్య విద్యార్థులనూ

ఉత్సాహవంతులనూ కూడా భాషాశాస్త్ర చర్చల వంకకు ఆకర్షించేవిగా ఉండేవి. పండిత మాత్ర వేద్యములుగా మాత్రమే ఫలప్రద మయ్యేవి కావనిపిస్తుంది. ఆధునికయుగంలో జరిగేశాస్త్రీయ చర్చలు నేటి వ్యవహారంలో ఉన్నభాషలో జరగడం మంచిదికదా! 135 పుటలో 'మూల ఘటిక రేతన గ్రామ్యమునకు లక్ష్యముగా ముదాహరించిన'... యేగ గొంటూ రమ్ము యేదాలు వోదాలు' (ఆం. భా. భూ 126) అను పద్యభాగము నందలి వోదాలు (హోదాలు అచ్చుతప్పు)కు హోదాలు గ్రాంథిక రూపమను దివ్యప్రభా వివరణము విచార్యము' అన్నారు ఏది గ్రాంథిక రూపమో వారు చూపి ఉండవలసింది — పాఠకుల సౌలభ్యంకోసం.

— శ్రీ తిమ్మావజ్ఝల కోదండరామయ్య.

## ఆర్ష ధర్మసూత్రములు

[ఆంధ్రానువాద సహితము. అనువాదం : శ్రీ చర్ల గణపతిశాస్త్రి, క్రౌను 161 పుటలు, వెల : 2 రూ. ప్రతులకు శ్రీ చర్ల గణపతిశాస్త్రి, లలితా ప్రెస్, ఖైరతాబాదు, హైదరాబాదు—4.]

సుప్రసిద్ధవిద్వాంసులు గణపతిశాస్త్రిగారు ఆర్ష విద్యా, విజ్ఞానాలను ప్రచారంచేసే కొలదిమంది విద్వాంసులలో ఒక్కరు. మన ప్రాచీనమహర్షుల ఆశయాలనూ వర్ణాశ్రమ ధర్మాలనూ, స్వమత సమత్వాన్నీ ప్రచారం చెయ్యవలెననీ. 'ఆర్షవిద్య' అనే పత్రికను నడపాలనీ, 'ఆర్షవిద్యా గురుకులం' అనే విద్యాలయాన్ని స్థాపించాలనీ, సంస్కృత భాషా ప్రచారం చెయ్యాలనీ మహర్షుల ఆశయాలు వెల్లడి అయేటట్లు సర్వజన సులభమైన రీతిని గ్రంథాలను ప్రకటించాలనీ ఉదార సంకల్పాలతో 'ఆర్ష విజ్ఞాన పరిషత్తు'ను స్థాపించారు, ఆ పరిషత్తు పక్షాన ప్రకటించబడిన గ్రంథమే యిది.

ఇందులో వసిష్ఠాది మహర్షులు చెప్పిన సూత్రాలూ, అవసరమైన చోట్ల వివరణాలూ సంస్కృతంలో ఇవ్వబడినవి. వానికి ఎడటి పుటలో ఆంధ్రానువాదం ఉన్నది. ఇందలి సూత్రాలు వర్ణాలకూ, బ్రహ్మచర్యాద్యాశ్రమాలకూ, సర్వప్రాయశ్చిత్తానికీ దినకృత్యాలకూ సంబంధించినవి.

ఆరు ప్రకరణాల పరిమితిగల యీ గ్రంథంలో తొలి ప్రకరణంలో వర్ణధర్మాలు చెప్పబడినవి. ద్వితీయ ప్రకరణంలో బ్రహ్మచర్యాన్ని గురించీ, తృతీయ ప్రకరణంలో స్నాతకవ్రతాన్ని గురించీ ఉన్నది. నాల్గవ ప్రకరణంలో గృహస్థాశ్రమ ధర్మాలు వివరింపబడినవి. అయిదవ ప్రకరణంలో వానప్రస్థాన్ని గురించీ, షష్ఠప్రకరణంలో పరివ్రాజక, సర్వప్రాయశ్చిత్తాలను గురించీ ఉన్నది. చివర గౌతమ సూత్రాలను అనుసరించిన దినకృత్యాల వివరం ఉన్నది. అన్నింటిలోనూ అందరికి ఎక్కువ ఉపయోగించే గృహస్థాశ్రమ ప్రకరణమే పెద్దది.

ఇందులో అత్రి, ఆపస్తంబుడు, గౌతముడు, బోధాయనుడు, యాజ్ఞవల్క్యుడు, వసిష్ఠుడు మున్నగు మహామునుల సూత్రాలే కాక, తైత్తిరీయ సంహిత, ఉపనిషత్తులు, భగవద్గీత; దేవలస్మృతి, మనుస్మృతి, విష్ణుస్మృతి, శంఖలిఖితస్మృతి, మున్నగు ధర్మ

ప్రమాణ గ్రంథాలనుండి కూడా శ్లోకాలూ వాక్యాలూ గ్రహించబడినవి. మిగిలిన ఋషుల సూత్రాలకంటె గౌతమముని సూత్రాలే ఎక్కువ స్వీకరించబడినవి.

మన ప్రాచీన మహర్షులు లోకహితార్థం రచించిన గ్రంథాలు చాలా ఉన్నవి. ఏదైనా విషయాన్ని నిష్కర్షగా తెలుసుకోవాలంటే వాటి నన్నిటినీ పరిశీలించవలసి ఉంటుంది. అది విద్వాంసులకే సాధ్యం. సాధ్యమే కాదు; శ్రమసాధ్యం. శ్రీ గణపతిశాస్త్రి గారు ఎంతో ఓపికతో అవసరమైన సూత్రవివరణాలను వివిధ గ్రంథాలనుండి స్వీకరించి, విషయాలను బట్టి ప్రకరణవిభాగం చేసి సరళమైన తమ ఆంధ్రానువాదంతో కూడా ప్రకటించడం అభినందనీయం.

ఇందలి అనువాదం సులభగ్రాహ్యంగా ఉన్నది. మచ్చునకు ఒక్క ఉదాహరణ—

'15. సూ. స్థాణు రయం భారహారః కిలా భూదధీత్య వేదం న విజానాతి యో౽ర్థం, యో౽ర్థజ్ఞః స సకలం భద్రమశ్నుతే నాక మేతి జ్ఞానవిధూత పాప్మా. [నిరుక్తం]

15. సూ. ఎవఁడు వేదమును జదివి యర్థమును దెలిసికొనఁడో వాఁడు కేవలము బరువు మోయునెద్దువంటివాఁడు. అర్థమును దెలిసినవాఁడు సమస్త కల్యాణమును పొందును. జ్ఞానముచే పాపమును గడిగివేసికొన్నవాఁడై స్వర్గమును పొందును. [నిరుక్తము] [పుటలు 30—31]

ఆర్ష ధర్మములను గురించి సంగ్రహంగానూ, సులభంగానూ తెలుసుకొనగోరినవారు తప్పక చదువవలసిన గ్రంథం యిది.

—శ్రీ బులుసు వేంకటరమణయ్య

## ఎర్రజండా

(రచన: ఏటుకూరి ప్రసాద్, ప్రతులకు: ఆంధ్రప్రదేశ్ యువజన సమాఖ్య, ముఖ్దూం మార్గ్, హిమాయత్‌నగర్, హైదరాబాద్ — 500029, వెల: రు. 1—50)

'వర్గరహిత సౌఖ్యభరిత
సమాజ సంస్థాపనలో
క్రొన్నెత్తురు లొలకిస్తూ
ఎర్రజండ నెగరేసిన
వీర జనత కంకితమిది.'

68 పుటల యీ సంపుటిలో ఎర్రజండా, జయం మనది పదరా, నిప్పురగిలింది, సాగండి, మనం, రణశంఖం వంటి 29 గేయా లున్నయ్.

తెలుగుజాతిని చీల్చి
కలిమి బలుములు కాల్చి
సిపాయి-చిన్నలీవాడు మారీచులురా
ఒక కంట కనిపెట్టరా యువకుడా
ఐక్యతను నిలబెట్టరా.

అంటున్నారు రచయిత 60 వ పుటలో. బాగున్నది. కానీ కలిసుండడానికి యేం చెయ్యాలి? ఏమి యేర్పాట్లు, పోనీ సర్దుబాట్లు జరిగితే కలసుండడం సులభమవుతుంది?

'అయ్యన్న' 'నాన్నన్న' అర్థమొకటేనురా.

'ఆంధ్రోడు', 'తెలుగోడు' పదము లొకటేనురా అని ప్రజలకు చెప్పవలసిన అవసరం అంతగా ఈనాడు కనిపించదు. ధ్వని ప్రాయంగా యీ రచయిత ఉద్దేశించిన కల్లోలానికి కారణం యీ తెలుగు మాటల అర్థం ఒకటేనని తెలియక పోవడమని భావించడం వస్తునిష్ఠంగా పోనీ వాస్తవికతకు దగ్గరగా ఆలోచించడం కాజాలదు. ఈ కల్లోలానికి కారణాలను మార్క్సిస్ట్ దృక్పథంతో వివరించగలిగితే పరిష్కారం కూడా వ్యక్తమయి ఉండేది.

కవిత్వం ద్వారా ప్రచారం చెయ్యడం తప్పు కాకపోవచ్చు ఎందుకంటే ప్రచారానికీ ప్రబోధానికీ అట్టే ఎక్కువ తేడా కనిపించని రోజులు కదా యివి.

నాటి నుండి నేటి వరకు
మేటి దొరల పిడికిట్లో
నలుగుతున్న నేల నేడు
పిలుస్తోందిరా నిన్నే...పదరా

అంటున్నారు 15 వ పుటలో ముందడుగు అనే గేయంలో యీ రచయిత. 'నేల నేడు పిలుస్తోంది' అనడం కవిత్వం. నిజమే. మరి సంజాయిషీలో శ్రీ రాంభట్ల కృష్ణమూర్తిగారు నిర్వచించిన వాస్తవికత కూడా అవుతుందా? ఒకవేళ వాస్తవికతే అయినా ప్రజలలో ఎంతమందికి అర్థమవుతుంది?

తిండి బెట్టలేని విద్య
దండగ మారంటాం
ఉద్యోగం చూపలేని

ప్రభుతను పొమ్మంటాం అంటారు రచయిత 11 వ పుటలో 'మనం' అనే గేయంలో. ఒప్పుకుందాం అయితే మరి

అంతిమ విజయం దాక
రక్తం చిందిద్దాం
చైతన్య ప్రజావళికి
విప్లవం దిద్దాం

(12 వ పుట)...ఇది పరిష్కారమవుతుందా? విప్లవాన్ని అందించడం అంటే యేమిటో?

తిమ్మన్నలు యగ్గన్నలు
లచ్చన్నలు లచ్చ మంది
తొంటికాలు అడ్డేస్తే

తుంటి విరిగిపోతుందోయ్—అంటారు 17 వ పుటలో.ఇది అభ్యుదయ కవిత్వమా? శ్రీ రాంభట్ల అంగీకరించుతారా? అంగీకరించవచ్చు. అభ్యుదయం అనే మాటకు ఎవరి అర్థం వారిది!!

కుర్రకారు జనం ఎర్ర
పిడికిలెత్తి నడిచారూ

అంటారు ఈ కవి 18 పుటలో. నన్నకారు రైతు వంటి ప్రయోగం కాదు కుర్రకారు అనే మాట అని కవి గ్రహించడమవసరమేమొ! కుర్రకారు కేం తెలుసు అనడంలో అవహేళన లేదనగలమా?

సోషలిజ మంటూను
శోష పుట్టేలాగు
ఊదర గొట్టేవారి
ఊసు తెలుసుకో (234) వ పుట.

నిజమే. అయితే ఇట్లా చేస్తున్న దెవరూ?

ఈ కవి ఇంకా కొంచెం వివరంగా, తీరికగా ఆలోచించితే బాగుంటుంది.

ఏమి జీవన మేమి పాలనమూ
ఈ కాంగ్రెసోరి
సోషలిజమన ఏమి జీవనమూ

అంటూ ప్రారంభించిన 'మేడివండు' అనే శీర్షిక గేయం (38 వ) పుట బాగున్నది.

అయితే ఎర్రజెండా పుటినంత మాత్రానవే యీ సమస్య పరిష్కారమవుతుం దనగలమా! అట్లా అనడం మార్క్సిస్టు దృక్పథ మవుతుందా?

లంచగొండి అధికారుల
వంచన బయటేస్తుంది
వెలుగెరగని నల్లడబ్బు

వెలికి లాగివేస్తుంది అంటారు శ్రీ ప్రసాద్ ప్రతిజ్ఞ (63 వ పుట) అనే గేయంలో. నిజంగానా? యువతరం నిజంగా యిట్లా ప్రతిజ చేసిందా?చేస్తుందా? ఒకవేళ చేసినా నెరవేర్చుకొనగలదా యీ ప్రతిజ్ఞను వర్తమాన పరిస్థితులలో? ఈ గేయాలలో కొన్ని వాస్తవాలున్నయ్. కొన్ని ప్రబోధాలున్నయ్. వాటి మంచి చెడులను పాఠకులు నిర్ణయించుతారు.

పోతే 22 వ పుటలలో 5 భాగాలుగా శ్రీ రాంభట్ల కృష్ణమూర్తిగారు వ్రాసిన సంజాయిషీ నా మటుకు నాలో చాలా ఆలోచనలను కదిలించింది. (1) ఇంత సంజాయిషీ అవసరమా అసలు? శ్రీ ప్రసాద్ వ్రాసిన గేయాలే వాటి ప్రయోజనాన్నీ మంచి చెడులనూ తెలియజెయ్యడం లేదా? (2) ఏలాంటి పూత మెరుగులూ లేకుండా ప్రజా జీవితాన్ని నిజాయితీగా చిత్రించడాన్ని వాస్తవికతగా గోర్కీ నిర్వచించాడు. సరే. ఆ నిర్వచనం తిరుగులేనిదా? మార్పులకూ, సవరణలకూ లాయకీగా ఉండే నిర్వచనం ఇంతవరకూ దొరక లేదా మార్క్సిస్టు పరిభాషలో. కవితకు యవనిక

అవసరం కాదనగలమా? (3) సాహిత్య శిలం ఏదయినా ఉదాసీన కాల్పనికతను చేపట్టడం వల్ల వేయిపడగల కవిసామ్రాట్టు, విప్లవ మహాకవులు గూడా భూతంలోకి పరుగు పందేలు వేసుకుంటున్నారు. (xvii పుటలో) ఈ కవిసామ్రాట్టులూ, విప్లవ మహాకవులుంచుట్నూ, అదే పనిగా తిరగలేదా ఒకనాడు అభ్యుదయ కవులలో కొంతమందయినా? ఆ రోజులలో అది ఒప్పయి, యీ రోజులలో అది తప్పుకావడం గతి తార్కిక భౌతిక వాద సూత్రాల ప్రకారం సమంజసమేనేమో ? కానీ యీ నిందలవల్ల ప్రయోజనమేమిటీ ? ముఖ్యంగా కవిత్వానికి జరిగే ప్రయోజనమేమిటీ ? ఈ సందర్భంలో ఒకమాట ! పోని విన్నపం. నింద సాహిత్యం కాదు.

(4) అసలు ఈ సాహిత్య పీఠాలన్నింటికీ ఆది జగద్గురు పీఠం ఒకటి ఉన్నది. అది వచన కవితా పీఠం. విషయం ఏదైనా సరే వచన కవిత్వంలో రాస్తే అది అభ్యుదయం కన్న ఆరాకులు మిన్న అనేది ఈ పీఠాధిపతుల మహావాక్యం. ప్యూడలిజానికి పద్యం, కేపిటలిజానికి గేయం, సోషలిజానికి వచనకవిత ప్రాతినిధ్యం వహిస్తాయని ఆ మహావాక్యానికి విప్లవ పీఠాధిపతి అయిన మహాకవి భాష్యం. వాస్తవజ్ఞానం కరువైనప్పుడు వేదాంత వాక్యాలు వల్లించినా విప్లవ నినాదాలుచేసినా ఫలితం ఒకటే అంటారు xxi పుటలో శ్రీ రాంభట్ల. ఈ వాక్యాలను విమర్శించుతూ ఒక వ్యాసం వ్రాయవచ్చు. ఈ సంజాయిషీలో ఈ వాక్యాల ఔచిత్యం ఏమిటీ? ఒక పీఠాధిపతిని తోసిరాజనడమా? అదే అయ్యే పక్షంలో పాఠకులకు కలిగే ప్రయోజన మేమిటీ! ఈ వాక్యాలవల్ల ? వాస్తవజ్ఞానం అనేది మార్క్సిస్టు పరిభాషలో చిప్పటి మారని తూనిక రాయియా? ఇటువంటి పరస్పర వైరుధ్యాలు చాలా ఉన్నయ్ యీ సంజాయిషీలో. ఎవరి అభిప్రాయాలు వారివి? ఎవరి అవగాహన వారిది. (5) మిగతా తాత్వికాంశాలలో సంగతెట్లావున్నా కవిత్వంలో 'ఫారమ్'నూ 'కంటెంట్'నూ వేర్వేరు అంశాలుగా మదింపు చెయ్యడం మార్కిస్ట్ అవగాహన కనుగుణమా ?

(6) 'కలకూ, నిజానికీ సంబంధం ఉన్నంత కాలం అంతా సజావుగానే ఉంటుంది.' అని పిసారోవ్ అన్నాట్ట. నిజానికీ కలకూ సంబంధం ఉండడమంటే యేమిటీ? కవిత్వంలో ఈ ప్రస్తావన ప్రయోజన మేమిటీ? 'కలకూ ఆధారం నిజం—అనుభవం కావచ్చు. ఆ అనుభవాన్ని కలగా చిత్రించవచ్చు. ఆ చిత్రణ వాస్తవికతకు దగ్గరగా ఉండొచ్చు; లేని దాన్ని ఉన్నట్టూ—ఉన్నదాన్ని చాలా పెద్దదిగా చిత్రించడమూ కవిత అంటూ డొక ప్రఖ్యాత రచయిత.

ఇంతకూ కవితకు విప్లవ శీలమే ప్రధానమా? లేక కల్పన కూడా అవసరమా? ఎంతవరకూ కల్పన? ఎక్కడనుంచీ ప్రారంభం కావాలి కల్పన? మానవాళిని ఉద్దీపింపజేసి కార్యోన్ముఖులను చెయ్యదలిచే రచయిత అందుకు దోహదపడే కార్యక్రమాలలో నిమగ్నుడు కావడం అవసరమా అనవసరమా అభ్యుదయ రచయితల దృష్టిలో? ఈ అంశాలు శ్రీ రాంభట్ల వంటి ప్రముఖ అభ్యుదయ రచయితలు విశదంచేస్తే నావంటి వారికి హాయిగా ఉంటుంది. విప్లవ బ్రాహ్మణుల సంగతి మన కెందుకూ? వారి గొడవ వారు పడుతున్నారు గదా?

—'కళాధర్'

## వడ్లగింజలు

(కథల సంపుటి)

(రచన—శ్రీ పాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, ప్రచురణ. యం. శేషాచలం అండ్ కో మద్రాసు—మచిలీపట్నం—సికింద్రాబాదు. వెల. 2–50 పేజీలు 165.)

కథ అంటే సంక్షిప్తంగా వ్రాయబడి చాల తక్కువ కాలంలో చదివి పూర్తిచేయబడు రచన. ప్రతి దేశపు సాహిత్యంలో ఈ కథా రచన కాన్పించును. అయితే ఈ కథా రచనకు ఫ్రాన్సు, రష్యాలే ఆయువు పట్టులైనాయి. ఆయా సాహిత్యాలల్లో వెలువడిన కథల వలె యితర సాహిత్యాలలో రాలేదని చెప్పవచ్చును.

కథకు సంఘటన ఆధారం. నవల వలె అధిక పాత్ర లుండుట కవకాశం లేదు. నవలలో వివిధ వర్ణనలు చేసినట్లుగా యిందు చేయుటకు వీలులేదు. కథ

లలో వాడే భాష చాల సరళంగాను, చదవగానే అర్థమగు రీతిలో ఉండాలి. కథను సామాన్య ప్రజలెక్కువమంది చదివెదరు గనుక అందులో వాడే భాష వారి కందుబాటులో ఉన్నప్పుడే కథకు ప్రయోజనం కలుగును.

ఆంగ్లమునందు Sketch, Tale అను పదాలున్నాయి. మనం వానిని స్థూల దృష్ట్యా కథ అని తెలుగులో వ్యవహరిస్తున్నాము. 'అగ్ని పురాణంలో ఆఖ్యానము, ఆఖ్యాయిక, ఖండకథ, పరికథ, కథానిక అనే పరిభాష ప్రస్ఫుటంగా' ఉన్నదని మన విమర్శకులు పేర్కొనుచున్నారు. తెలుగు కథా రచనలో చింతాదీక్షితులు గారిది ప్రథమ స్థానం. ఆ తరువాత మునిమాణిక్యం, మొక్కపాటి, బాపిరాజు, కవికొండల, మల్లాది, శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి, చలం మున్నగు వారందరూ కథా రచనలో అద్భుతమగు ప్రగతిని చూపి కథయొక్క స్థానమును విస్తృతపరచినారు. నేడెందరో కథలు రచిస్తున్నారు. అంతేగాక వార పత్రికలు కథా రచయితలను ప్రోత్సహించి ఉత్తమ కథలు వచ్చుటకు చేయూత అందించు చున్నవి. ఈ కథల్లో సాంఘికములు, చారిత్రికములు ప్రధానంగా పేర్కొనదగినవి. నీత్యుపదేశమే కథా రచనోద్దేశం.

మన కథా రచయితలలో కీర్తిశేషులు శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు ప్రముఖులు. సాంఘిక, చారిత్రికేతి వృత్తాలను ఆధారం చేసికొని చక్కని కథలు సృష్టించారు. సామాన్యంగా ప్రతి కథలో తెలుగుదనం కాన్పిస్తుంది. తెలుగు దేశమన్నా, తెలుగు భాషఅన్నా, తెలుగుజాతిఅన్నా శాస్త్రిగార్కి ఒల్లమాలిన అభిమానం. కథల్లో వారుపయోగించే నుడికారం పాఠకునిని చక్కలిగింతలు పెడుతూండును.

ఎమెస్కోవారు ప్రచురించిన 'వడ్లగింజలు'ను కథా సంపుటిలో నాలుగు కథలున్నాయి. ఈనాలుగును చారిత్రికములే. ప్రతి కథ ఆనాటి చరిత్రను సంక్షిప్తంగా కన్నులముందు చూపించును. ఆయా కథల్లో శాస్త్రిగారి ప్రతిభ ప్రత్యక్షరంలోనూ ప్రత్యక్షమగుచునే ఉండును. ఈ నాలుగు కథల్లో రెండు కథలు పెద్దాపుర సంస్థానమునకు, ఒకటి ఆంధ్ర క్షత్రియులకు, మరొకటి బొబ్బిలి సంస్థానమునకు సంబంధించినది.

## గులాబి అత్తరు

షకురల్లీఖాన్ అను నతడు ఢిల్లీనుంచి వచ్చిన అత్తరు వ్యాపారి అతని జీవితంలో రాజసభలు, నవాబు దర్బారులు చూచాడు దక్షిణ దేశంలో గోల్కొండ తరువాత పెద్దాపుర సంస్థానమే చూడతగిందని భావించి కాశ్మీర కుసుమాలతో తయారు చేసిన గులాబి అత్తరులో పెద్దాపురం చేరుకొన్నాడు. రాజదర్శనం కొఱకు ప్రయత్నించాడు. కాని దివాన్జి అడ్డుపడ్డాడు. పరిమళాలు వెదజల్లే అత్తర్లు దివాన్జీ దృష్టిలో కంపుగా కాన్పించాయి. ఖాన్‌ను దివాన్ దురుసుగా మాట్లాడినప్పటికి సహనం కోల్పోక నిటారుగానే ఉన్నాడు. కాని అతనికి రాజసభలు కంటక భూయిష్ఠాలు, హింసక వ్యాఘ్రకీల్లాలున్నూ' అన్న సంగతి గ్రహింపలేదు. పెద్దాపురం మహారాజు ఎంత సరసులో మహారాజు మనుష్యులు అంత విరసులని ఖాన్ గ్రహించాడు.

'ఎవరి సంకల్పం విశుద్ధమో, ఎవరి హృదయం కళామయమో, ఎవరి దీక్ష అలౌకిక సామాన్యమో, ఎవరి ప్రావ్యం లోకకల్యాణమో ఆ కళాశీలుల నిర్మాణాలే ద్వంద్వభూయిష్ఠమైన భౌతిక జగత్తులో మెరుస్తూంటాయి.' ఖాన్ అలాంటి కళాశీలి. అతని అత్తర్లే ధురంధరాలు. తాను శ్రమపడి అంత దూరంనుంచి వచ్చినా ప్రయోజనం లేదు 'షష్టిగడియలూ పుష్పాలతోనే కాలం గడిపే అతనికి ఇక్కడ ప్రభు దర్శనం గగనపుష్పం' అయిపోయింది. చాల బాధపడ్డాడు. చివరకి తానేపూ పెద్దాపుర సంస్థానంలో సాధింపలేకపోయితిని గదా అని అత్తరు సీసాను కోటగోడకు కొట్టాడు. సీసా పగిలింది. ఆ ప్రదేశం యావత్తూ సౌరభంతో గుమ్మయ్యింది. ఒకసారి వెనక్కు తిరిగి చూచి ఖాన్ కొయ్యబొమ్మ అయ్యాడు. ఇదంతా పెద్దాపురం రాజు శ్రీ వత్సవాయి చతుర్భుజ తిమ్మజగపతి అరకంట చూస్తూ చొక్కి ఉన్నాడు.

ఖాన్ అత్తరు వ్యాపారే కావచ్చు. అయినా అతనిలో ఆత్మవిశ్వాసం ఎక్కువ. అది దివాన్ గుర్తించక బాధించాడు. తను సువాసనలలో అందరిని ఆకట్టుకో గల్గినను దివాన్జీని ఆకట్టుకోలేక పోయాడు. సీసా పగులగొట్టాడు. ప్రభు దర్శనం అయింది. ఏమీ నాటు రాలేదు. ఆశ అది తీరింది. అరసికులముందు సరసు డెంత విరచించాడో అనేది ఖాన్‌ను చూస్తే తెలుస్తుంది.

## వడ్లగింజలు

అనేది కథ అయినా నవలికగా పరిగణింపవచ్చును. ఆ ఏముందీ వడ్లగింజలో బియ్యపుగింజే కదా అని తేలికగా కొట్టి పారవేయకూడదీ కథను.

ఒక సామాన్యపౌరుడు ప్రభుదర్శనం కొఱకు తపించిపోయి చివరకు ఫలితం పొంది రాజనుండే సన్మానాలు అందుకొన్న శంకరప్పను గూర్చి, మహారాజు ఔదార్యాన్ని చూపించే కథ యిది.

తంగిరాల శంకరప్ప తణుకునుంచి వచ్చాడు. నేస్తంలో సొగసులేదు. బాహ్యస్వరూపం కంటె అతని అంతరంగిక స్వరూపం గొప్పది. చదరంగం ఆటలో నిష్ణాతుడు. చదరంగానికే చక్రవర్తి. బ్రాహ్మలు, చౌదరులు, రెడ్లు, తెలగాలు, వెలమలు క్షత్రియులు కూడ చదరంగంలో అతని ఆట కట్టించలేక పోయారు. వదనంలో బ్రహ్మవర్చసు ఉన్నది. పెద్దాపురం మహారాజు చదరంగంలో గొప్పవాడని విని దర్శనంకొఱకు వచ్చాడు. కాని జాగేదారు దివాను అడ్డువచ్చారు. వెనుతిరిగి పేదిరాశి పెద్దమ్మను ఆశ్రయించాడు. శాస్త్రి, యాజులతో పరిచయమైంది. పెద్దాపురంలో చదరంగం ఆడే వారందరికి శంకరప్ప పరిచయుమయ్యాడు. వారందరితో శంకరప్ప ఆడ ఆట కట్టించాడు. వారందరికి శంకరప్ప మహానుభావునివలె కాన్పించాడు. శంకరప్ప విషయం మహారాజుకు తెలిసింది. మరుచటి రోజు శంకరప్పను పిలిపించి రాజు చదరంగం ప్రారంభించాడు. మహారాజుకు శంకరప్పలో మహేశ్వరాంశ కాన్పించింది. శంకరప్పకు మహారాజులో విష్ణ్వంశ కన్పడింది. 'మహారాజు అసాధ్యపు ఎత్తులూ, శంకరప్ప పెంకి రాకడలూ, మహారాజుకు మానహాని, భయమూ, శంకరప్పకు ప్రాణహాని, భీతిన్నీ కలిగింది. అంతేగాక మహారాజుకు కొండ తాకినట్టుంది. శంకరప్పకు బ్రహ్మ విద్యలో పడ్డట్టుంది. ఎత్తుపడ్డ కొద్దీ వారికి కసి పెరిగింది. కసి పెరిగిన కొద్దీ యెత్తులు బిగిశాయి. ఆట స్తంభించిపోయింది. ఆర్నెల్లు జరిపేసినా ఆట కట్టిందని ఆఖరకు వప్పుకోక తప్పలేదు మహారాజుకు' తుదికి వడ్లగింజల విషయంలో కూడ శంకరప్ప మహారాజును ఓడించాడు. శంకరప్ప విజయానికి మెచ్చి రాజతనికి అర్ధాసనమిచ్చి సత్కరించారు.

ఈ కథలో ఆనాటి పెద్దాపురం ప్రజల వినోదాలు, విలాసాలు వివరించటమేగాక సంస్థానం యొక్క గొప్పతనాన్ని చెప్పారు. శంకరప్పలోని విద్య మహారాజుచేత అర్ధాసన మిప్పించింది. వత్సవాయి ప్రభువుకూడ ఎదుటి వ్యక్తిలో ఉండే వైశిష్ట్యాన్ని గమనించి చేతులెత్తి నమస్కరింపగల సహృదయుడు. నిజంగా శంకరప్పకు రాజు అర్ధాసనం యియ్యవలసిన అగత్యం లేదు. కాని అతని చదరంగపు ఆటకు ముగ్ధుడై పొంగిపోయగాడు. మహారాజు యిదివరకెంత మందితో ఆడి వారి ఆట కట్టించాడు. కాని ఈ శంకరప్ప ఆట కట్టించలేకపోయాడ . ఆట కట్టింపలేక పోవటమే గాక శంకరప్పచేతిలో ఓడిపోయాడు రాజు ఓడిపోయినా తనదే గెలుపు అని పొంగిపోక శంకరప్ప విజయాన్ని, సామర్థ్యాన్ని ప్రతిభను శ్లాఘించాడు.

శంకరప్ప చదరంగమునందే గాక గణితంలో కూడ గడుసు వాడనిపించుకొన్నాడు. మహారాజు యిష్టప్రకారం ఒక కోరిక కోరాడు. అదేమంటే చందరంగానికి అరవైనాలుగు గదులు. మొదటి గదిలో ఒక వడ్లగింజ వుంపించండి. తరువాత రెండో గదిలో రెండు, మూడో గదిలో నాలుగు, నాలుగో గదిలో ఎనిమిది యిలాగ వెళ్లిన కొద్దీ రెట్టింపు చేయిస్తూ నాకు వడ్లగింజలు దయచేయించండి—మహాప్రభూ' అన్నాడు. ఈ విషయంలో కూడ రాజు తన అశక్తతను ప్రదర్శించాడు. శంకరప్ప కోరిన ప్రకారమయితే త్రిలింగదేశంలోని పండే ధాన్యం చాలదని షరాబు చెప్పాడు. దానితో మహారాజు విస్మితుడైపోయాడు. శంకరప్ప అనవమాన ప్రజ్ఞావంతుడని రాజు గ్రహి

చాడు. ప్రజ్ఞకు చిహ్నంగా శంకరప్పను రాజు గజారోహణం చేయించి గౌరవించాడు.

## రాచపీనుగు తోడు లేకుండా వెళ్లదు

అను కథ ఆంధ్ర క్షత్రియుల పరాక్రమమునకు సంబంధించినది. ఐదు గోత్రాలకు సంబంధించిన క్షత్రియ వీరులు దేశం విడిచి బయలుదేరారు. ఒక తురకరాజ్యం చేరుకొన్నారు. నవాబు దర్శనం చేసికొన్నారు. క్షత్రియుల మొనగాడుకు నవాబుకు మధ్య సంభాషణ సాగింది. ఆ సంభాషణలో మొనగాడు 'మేము సూర్యవంశ క్షత్రియులం, వగాధి యోధజాతి, కత్తిపట్టి దుష్ట శిక్షణా, శిష్ట రక్షణా చెయ్యడానికే మాజాతి ఏర్పడింది. యుద్ధం చెయ్యడం మాకు విలాసక్రీడ' అన్నాడు. 'ఇంకా అనేకుంటూ అంతే' అన్నాడు నవాబు. 'ప్రాణాలు పోయాకనే క్షత్రియుడి చేతిలో ఉండిన కత్తి క్రింద పడిపోతుంది' అన్నాడు మొనగాడు. 'ఇంకా చాలమందికిన్నీ' అన్నాడు నవాబు మొనగాడు యింతలో 'రాచపీనుగు తోడులేకుండా వెళ్లదు' అన్నాడు మొనగాడు. అంటే అన్నాడు నవాబు. 'దెబ్బ తిన్నను ఎదుటివాణ్ణి చంపిగాని క్షత్రియుడు చావడన్నాడు మొనగాడు. అంటే అన్నాడు నవాబు 'దెబ్బతిన్నను ఎదుటివాణ్ణి చంపిగాని క్షత్రియుడు చావడన్నాడు మొనగాడు. నవాబుకు సందేహం కలిగింది. మొనగాడు పరీక్ష పెట్టమన్నాడు. నవాబు పరీక్ష పెట్టాడు. అందులో మొనగాడు తన ప్రథమ పుత్రుణ్ణి కోల్పోయాడు. నవాబుకిచ్చినమాట నిలబెట్టుటకు క్షత్రియుని పరాక్రమము ప్రదర్శించుటకు, తన వాగ్దానము నెరవేర్చుటకు రెండవ కుమారుణ్ణికూడ త్యాగంచేసి క్షత్రియుని శౌర్య పరాక్రమాన్ని వ్యక్తం చేసాడు. మొనగాడు కుమారుడు తనతోపాటు తురకనాథుని ప్రాణంమీద తీసికొన్నాడు. అదే రాచపీనుగు తోడులేకుండా వెళ్లదు అను దానికి సమన్వయము.

## 'విమానం ఎక్కబోతనూనా'

అనే కథ బొబ్బిలి సంస్థాన అంతఃపుర స్త్రీల గాథను వర్ణించేది.

వెలమస్త్రీలు కత్తిపట్టి కదనరంగానికెందుకు వెళ్లి యుద్ధం చేయకూడదని సర్దారు వెంకయ్యపై మల్లమ్మ సవాలు చేసింది. బొబ్బిలి అంటే దెబ్బలియే కదా. బొబ్బిలిలో పుట్టిన ప్రతిజీవి శౌర్యాన్ని ఉగ్గుపాలతోనే గ్రహించాడేమో అనిపిస్తుంది. సర్దారు వెంకయ్యకు మల్లమ్మకు మధ్య జరిగిన సంభాషణ వీరరసస్ఫోరకమై బొబ్బిలి స్త్రీల శౌర్యత్వం వ్యక్తమగును. తన భర్త పిరికి. తాను వీరవనితని నిరూపించుకోవాలని మల్లమ్మ ముందుకు వచ్చింది కాని వెలమస్త్రీలు అసూర్యం పశ్యలు. మల్లమ్మలో రక్తం పెల్లుబికింది. శౌర్యం కట్టలు త్రెంచుకొన్నది. బొబ్బిలికి పట్టిన దుర్గతికై తాను ఆత్మహత్యచేసికొని తన ప్రాణాన్ని బొబ్బిలికి దానం చేసింది.

ఈనాలుగు కథల్లో శాస్త్రిగారు చరిత్రకు ప్రాణం పోసారు. కథల్లో పెద్దాపురం సంస్థానం చరిత్రను మనకు చూపించుటయే కాక ఆ మహారాజు ఔదార్యాన్ని అనురాగాన్ని చూపించి అతనికి కీర్తిపతాకాలెత్తి ప్రదర్శించుట గమనింప తగినది. బాహిర స్వరూపం కంటె ఆంతరంగిక స్వరూపమైన బుద్ధి వికాసానికి ప్రాముఖ్యమిచ్చి శంకరప్పను సన్మానించుట యందే వత్సవాయి ప్రభు ప్రజ్ఞావిశేషము వ్యక్తమగుచున్నది. క్షత్రియవీరుల పరాక్రమం పరరాజులను ఆశ్చర్యంలో ముంచెత్తింది. బొబ్బిలిలో పుట్టిన ప్రతి జీవి వీరరసానికి చిహ్నమే అని రచయిత వివరించారు.

శాస్త్రిగారు కథ చెప్పుచున్నారు అనే కథ పూర్తిగా చెప్పక నాటకమునందలి పాత్రలవలె సంభాషణలు చెప్పించి ఆయా పాత్రలను నిరూపించి ప్రత్యక్షం చేయింపగల నైపుణ్యం వారిలో అధికం. వాక్యరచనలో తెలుగుదనం ప్రతిబింబిస్తుంది. వస్తుస్వీకారంలో రచనా విధానంలో వీరి కథలు మచ్చుతునకలుగా మిగులుతూ ఉంటాయి.

తెలుగు కథకు చక్కని రూపురేఖలు తీర్చిదిద్ది సాహిత్యంలో దానికి ప్రాశస్త్యం కల్పించిన శ్రీపాదవారు చిరస్మరణీయులు.

— శ్రీ రామమోహన్.

## కొప్పరపు—సోదర కవుల చరిత్ర

(రచయిత—వంశోధర వరమేశ్వర — విద్వాన్ నిడదవోలు వెంకటరావు ఎమ్. ఏ — క్రౌను సైజు

20+138 పుటలు వెల రు 4-00. (ప్రకాశకులు— కుంటముక్కల వెంకటజానకీరామ శర్మ— పెనుగుదురుపాడు—తెనాలి తాలూకా—గుంటూరు జిల్లా.)

ఈ శతాబ్ది ప్రారంభములో తెలుగు దేశమున— ఆశుకవితా ప్రదర్శనములు— అష్టావధాన శతావధానాదులు వ్యాప్తి జెందినవి. ఆ ప్రదర్శనములలో కొప్పరపు సోదర కవుల ధారణాశక్తి ఆంధ్ర ప్రజానీకమునకు వెల్లడి అయినది. శతావధానాష్టావధానములకు వ్యాపకులయి శిష్య ప్రశిష్యులకు గురువులయి విరాజిల్లిన—కింకవీంద్ర ఘటాపంచానన — బాలసరస్వతీ— మొదలగు బిరుదులు పలుచోట్ల పొంది దిగ్దంతులై వెలసి పాణినీయ శాస్త్రపారావార పారీణులయిన— తిరుపతి—వేంకటేశ్వర కవులకును కొప్పరపు సోదర కవులకు ఆసనవర్ప మూలముగా గుంటూరులో వాదోపవాదములు జరిగి పరస్పరము నిందారోపణములు కలిగి నియోగి వైదికశాఖా భేదములకు మూలమైన వివాదములు తటస్థించినవి. అప్పుడు గుంటూరు మండల పరిసరములలో పెద్ద వివాదములు కలిగి నియోగి పుంగవులు ఒక ప్రక్కను వైదిక విద్వాంసులు మఱియొక ప్రక్కను చేరి బ్రహ్మ భేద్యమైన వివాదములు కలిగినవి. అట్టిచో మ. రా. రా. శ్రీ కొండా వెంకటప్పయ్య పంతులు—ఏకా రామయ్య పంతులు మొదలగు వారొక ప్రక్కను బ్ర—శ్రీ—జానపాటి పట్టాభిరామ శాస్త్రులు మొదలగు విద్వత్కవి పుంగవులు ఒక వైపు చేరి వివాదములు శాంతింపజేయ ప్రయత్నించిరి కాని ఉపయోగము లేకపోయినది. కొందఱు ప్రముఖులు శాఖాభిమానశూన్యులు నియోగి శాఖలో నగ్రేసరులయి విరాజిల్లిన- కస్తూరి శివశంకర కవిగారును వారి పత్రికలో నిష్పాక్షికముగా విమర్శించియున్నారు. బ్రాహ్మణేతరులలో యోగ్యులయి విరాజిల్లిన కట్టమంచి శ్రీనివాసరావుగారు మొదలగువారు చక్కగా విమర్శించి యున్నారు. శాఖాభిమానముతో హితవాది-సత్యవాది— యథార్థవాది – మొదలగు నేటికి రాయలలో ప్రముఖులు చాల చిక్కులు కలిగించినను లక్ష్యపెట్టక శ్రీ తిరుపతి వేంకట కవులు యశః కన్యకా పరిణయము ద్వారా శాంతి నొందించినారు. అప్పుడు కొప్పరపు కవులు గుంటూరు సీమకు ప్రతిగా – జగ్గిసీమ—నారాయణాస్త్రము ప్రయోగింతుమని చెప్పియు ప్రఖ్యాత కవిపుంగవులతో ఢీకొనజాలక శాస్త్రజ్ఞానశూన్యులగుటచేతను లౌక్యముగా నూరకపోయిరి. అంతటితో చల్లారిపోయిన దానిని నేటికి మన మిత్రులు శ్రీ నిడదవోలు వెంకటరావుగారు మరల లేవనెత్తిరి. నియోగి వైదికభేదము తొలగిపోయి అందఱు నమైక్యముగా నుండిరి. కొప్పరపువారిని గూర్చి గొప్పలు చెప్పకొనుటలో ఎవరికిని ఏ విధమైన ఆక్షేపణలు లేవు. కాని శ్రీ తిరుపతి వేంకటకవులకు పిఠాపురపు సంస్థానములో ప్రవేశములేదు. విజయనగర సంస్థానములో శృంగభంగము పొందినారు. మొదలగు వ్రాతలు అనవసరముగా వ్రాయుట సముచితముగా తోచలేదు, శ్రీ పిఠాపురము రాజా సూర్యారావుగారికి పుత్రోదయమైనప్పుడు తిరుపతి శాస్త్రిగారు వ్రాసిపంపిన జాబులోని పద్యము తిలకింపుడు. రాజావారి ఆహ్వానమునకు బదులుగా వ్రాసినారు.

ఘనవంశావళి కల్గువాడవని చ
క్కన్ నీదరిన్ చేరి పే
రిన చియ్యెత్తిన దుర్గజమ్ముల నఖ
క్రీడా వినోదమ్ముగా
దునియల్ సేయదలంచు చుండిన మృగేం
ద్రుం డూరకే వచ్చి పో
యిన గర్హింపరె యెప్పుడేని యితడ
టే వచ్చు భూభృన్మణీ

అని వ్రాసిపంపిన పద్యమును వీరు గమనింప లేదు. చూడలేదు కాబోలు. వీరు గీతమును ఒక పర్యాయము చూడమని మనవి. ఇట్లు వారికి బదులుగా వ్రాసిన జాబు ధోరణిని గమనింపక వారికి సంస్థానమున ప్రవేశములేదని వ్రాయుట చిత్రముగా మన్నది. మఱియు శ్రీ తిరుపతి వేంకటకవులు పిఠాపురము సంస్థానమునకు దత్తపుత్రులై విరాజిల్లిన శ్రీ గంగాధర రామారావుగారినే పిఠాపురపు ప్రభువులుగా నెంచి ధవళేశ్వరములో వారి సందర్శనముచే ప్రతివత్సరము నూటపదహార్లు బహుమానముగా పొందుచుండిన విషయము వీరు వినలేదుకాబోలు. ఆ విషయము ఆ ప్రాంతముల వారికందరికిని ఘంటాపథముగా తెలియును. విజయనగరము సంస్థానము సంగతి శ్రీవారి ఆదరణపొందుట మొదలగు విషయములు నానా రాజసందర్శనము చూచిన బాగుగా తెలియును. శ్రీ గుండవరపు లక్ష్మీ

పారాయణరావు పంతులవారు శ్రీ చెళ్లపిళ్ల వెంకట శాస్త్రిగారు—ఎదటివారి గొప్పను గ్రహింపజాలనివారు. నేత్రవ్యాధికి వారి దుర్గుణములే కారణములు, మొదలగు మాటలతో కీర్తిశేషులయి విద్వత్కవి పుంగవులయి సకల విద్వాంసులకు పూజ్యులై విరాజిల్లి దిగ్విజయము చేసి రాజాస్థానములలో మరియాదలు పొందిన వారై అచటి పండితులను వాదములలో జయించి గజారోహణాది సత్కారములను పొందిన సంగతి వీరికి తెలియదా ! వారు చెప్పిన పద్యము గమనింపుడు.

> వీనుగు నెక్కినాము ధరణీం
> ద్రులు మొక్కగ నిక్కినాము
> సన్మానము లందినాము బహు
> మానములన్ గ్రహించినార మె
> వ్వానిని లెక్కపెట్టక ని
> వారణ దిగ్విజయంబొనర్చి ప్ర
> జ్ఞానిధులంచు పేరుగొని
> నారము నీవలనన్ సరస్వతీ.

యశస్సును పొందిన వీరిని మద్రాసు ప్రభుత్వమువారు ప్రధానాస్థాన కవిగా నిర్దేశించి బెజవాడలో వారలను గౌరవించిన సంగతి వీరికి తెలియదు కాబోలు. ఇట్టి వన్నెకెక్కిన శ్రీ వెంకటశాస్త్రిగారికి వీరి వ్రాతలు కళంకమును గల్గింపజాలవు. ఇట్టి వీరి వ్రాతలు కొప్పరపు సోదరకవుల చరిత్రకే మొదటికి మోసము కలిగించి ముప్పు తెచ్చెడివిగా నున్నవి. శాఖాభిమానమున్న ఇంటిలో పొగడవచ్చును. బహుమానము లీవచ్చును. గాని వారిని యోగిపుంగవులవద్ద గౌరవింప వచ్చును. కాని దిగ్దంతులై వెలసిన వారివద్ద వీరి యాటోపము లెట్లు నిలువగలవు. వీరివి నిందించినందువలన వారికి కల్గిన లాభమేమియో తెలియలేదు. మఱియు వీరి వ్రాతల మూలమున విద్వత్కవులకు తిరుపతి వేంకట కవుల—గుంటూరు సీమ — గీరతము మొదలగు గ్రంథముల వ్యాప్తికి కారణము లగుచున్నది. ఎందఱో ప్రసిద్ధులగు కవులు — వాణి నారాణి — అని చెప్పిన వారును యతి విటుడుగా మారగలడు. విటుడు యతిగా మారగలడు అని తమ తమ సామర్థ్యమును చెప్పినవారు కలరు గాని — (కవిత పుట్టిల్లు సోదరకవుల యిల్లు) అని చెప్పికొనినవారిని కానము. సామాన్యముగా 12 సంవత్సరముల వయస్సున కొంత తెనుగులో జ్ఞానమును సంపాదించుకొని రఘువంశము ప్రారంభించిన వారిని చూచియున్నాము కాని 9 సంవత్సరముల వయస్సుననే రఘువంశము ఐదు సర్గలు కంఠస్థము చేసినవారిని వినలేదు చూడలేదు. దానికి తగు పరికరము, శబ్దములు-ధాతువులు—సమాసములు మొదలగునవి చదువుటకే వ్యవధి చాలదు ఇది యెట్లు సమకూడును. తండ్రిగారు వీరిని సాహుకార్ల యొద్దకు కొనిపోయి గడించిన ధనముతో ఉపనయనము కావించిన సంగతి మాత్రము అబద్దము కాజాలదు.

జయంతి రామయ్య పంతుల వారు పద్య రూపమున ప్రశంసించినట్లు చెప్పికొని క్రింది భాగమున ఈ పద్యము శ్రీ జయంతి రామయ్య పంతులవారి జీవిత చరిత్రలో లేదు—అని వ్రాయుట వీరు నియోగులైనను వైదిక చాదస్తముగా కనబడుచున్నది. చెన్నపురి ఆంధ్రసంఘమువారు కవితా ప్రదర్శనమున కేర్పాటు చేసినారు, అని వ్రాసి క్రింది భాగములో ప్రసిద్ధమైన చెన్నపురి ఆంధ్ర మహాసభ ఆ కాలమున లేదు – ఇది. క్రీ– శ– 1918 లో స్థాపితమైనది, అను పై వ్రాతను ఖండించుచున్నది. ఈ పుస్తకము తఱచి చూడగా చూడగా. కంబళిలో భుజింపుచు వెంట్రుక లేరినట్లుండును. శ్రీ శత ఘంటము వేంకటరంగశాస్త్రిగారిని గూర్చి వ్రాయుచు ఎవ్వరైనను వీరిని శాస్త్రి శబ్దము తగిలించుకొనుటచే వైదికులని భ్రాంతి నొందెదరేమో అని నియోగులని స్పష్టముగా వ్రాయుచున్నారు. వీరు ఆర్వేల నియోగులే — పెద్ద ప్రఖ్యాతి చెందిన పండితులే. అప్పుడప్పుడు చెన్నపురికి వచ్చుచుండెడివారు. భారతము—భాగవతము మొదలగు గ్రంథములకు వచన రూపమున వ్రాసిన పండితులు—ప్రఖ్యాతి వొందినవారు. శ్రీ నరసింహ శాస్త్రులు — చతుశ్శాస్త్ర పండితుల శిష్యులు. వేంకటరంగశాస్త్రుల వారెప్పుడును శిష్యులకు పాఠములు చెప్పినవారు కారు. వ్యవహారములతో విశేషముగా కోర్టులకు తిరుగుచుండెడివారు. శ్రీ కాళహస్తి దేవాలయములో మేనేజరుగా కూడ చాలకాలముండినవారు. కొప్పరపు సోదర కవుల చరిత్రలో 39 పేజీలో వ్రాసిన (శాఖాభిమానములు పులుము కొన్నవి) అను మాట మాత్రము నిజము. 41

పేజీలో కవ్వరపువారు సంస్కృతములో శాస్త్రీయ పాండిత్యము లేమిని సూచింపుచు (తెలుగు పిసాంబ నిలుపంగ దిపురుడింక) అని వ్రాసినారు. వీరి విష యమై విమసము పంచమును వ్రాయలేదు అది విద్వాంసులగు నాత్మకూరు పండితులు శ్రీనివాసా చార్యులు మొదలగువారు విమసమును నింపించగా వ్రాసిన పద్యము. 45 పేజీలో వ్రాసినట్లు భార్యకు మందిప్పింపుచుచూ గుంటూరులో కాలము గడపు టకుగా చాలేదు. బందరులో స్కూలుకు లీవు పెట్టి ప్లీరి వృథా వాదమునకై వేంకటశాస్త్రిగారు గుంటూ రులో మకామువేసి కూర్చున్నారు ఈ విషయము గుంటూరుసీమ -పూర్వరంగము — ఉత్తర రంగములు శ్రద్ధగా చదివిన తెలియగలదు. 46 పేజీలో వ్రాసి నట్లు వేలూరు శివరామశాస్త్రిగారికి సిసము ఎన్న డును లేదు. శ్రీ శివరామశాస్త్రిగారు మాతో గూడ వ్యాకరణము చదివియున్నారు.

శ్రీ కాళహస్తిలో వారు చదివినప్పుడు మిసములేని వారు అప్పుడుంచుకొనినట్లు వ్రాయుట చాల పొరబాటు. తిరుపతి వెంకటకవుల విసమును మనసున నుంచు కొని శివరాము శాస్త్రిగారిని వెక్కిరించినట్లు కనబడు చున్నది. కాని మరేమియునుకాదు. శ్రీ శివరామశాస్త్రి గారి పాండిత్యము శతావధానము అతి బాల్యములో గుంటూరులో జరుగలేదా. అప్పుడు పండితులందరు మెచ్చుకొని యుండలేదా? ఈ విషయము బాగుగా తెలియుటకు శ్రీ తిరుపతి వేంకటకవుల (గుంటూరు సీమ—గీరతము) మొదలగు గ్రంథము ఒక పరిపూర్తిగా నుదారబుద్ధితో చదివిన తెలియగలవు. 48 పేజీ పద్యములో (ఉరులయుంటటివారు) అనగా మేరు పర్వతమువంటి వారిని యెట్లు అర్థము వచ్చునో మాకు గ్రాహ్యము కాలేదు. (ఉరు) శబ్దమునకు మేరు పర్వతమని యెచ్చటను అర్థమున్నట్లు తెలియలేదు. ఏ నిఘంటువులోను ఈ అర్థము కనబడలేదు. 52 పేజీలో వ్రాసినట్లు కవులు పండితులు ఆను వారి సమ క్షమున శతావధానములు చేయలేరు. చేయలేదనుటయే నిశ్చయము—అని వ్రాయుట చాల గొప్ప పొరబాటు. వారెన్నిచోట్లనో శతావధానాదికములుచేసి ఎదిరించినా పండితులను శాస్త్రవాదములలో జయించి పాండిత్య మును మెప్పుకొన్న సంగతి ప్రకటించిన సంగతి ఎరికి శ్రుతి గోచరముకాలేదా శతాధిక గ్రంథములు వ్రాసినారే వారికథలు గాథలు చదివినవారి మేధావిశేషము తెలియ గలరు. ఈ గ్రంథమును చూడగా చూడగా నిజము తెలిసియు శాఖాభిమానము వీరినిట్లు ప్రేరించినదని స్పష్టముగా కనబడుచున్నది. వీరీ గ్రంథమును వ్రాయ బూనుటయును శాఖాభిమానము ప్రక టి మటకే అని స్పష్టముగా తెలియుచున్నది. దీనివలన విద్వత్కవులను తిరుపతి వేంకట కవులకు కీర్తి హెచ్చునుకాని తగ్గదు. వ్రాయబూనిన గ్రంథమంతయు నిట్లే యున్నది. శతావధానము నాలుగు రోజులలో పూర్తియగును. ఒక్కొక్కరోజున 100 మందికి ఒక పాదము చెప్పి నాలుగు రోజులలో పూర్తిచేసి జ్ఞప్తియందుంచుకొని చెప్పుట సామాన్య లగు వారికి సాధ్యము కాదా? ఈ విషయము విద్వాంసు లగు పండితులు కవులగువారికి బాగుగా తెలియును. విమర్శకులు తెలుపవలెనని వ్రాసినారు. గుణగ్రహణ పారీణులగువారు వీరి శతావధానములు తెల్పు గ్రంథ ములు సాక్ష్య మొసంగగలవు. ఇంకను పెంచివ్రాయగా (సెట్టిసేరు లింగము సవాసేరు) అను సామెత ప్రకారము పెరుగగలదు. కాన నింతటితో ముగించవలసివది.

శ్రీ వేదము వేంకటేశ్వరశర్మ.

## రాయలసీమ భవితవ్యము

(రచయితలు: శ్రీ గర్రం వెంకటరెడ్డి. శ్రీ పోచన రామిరెడ్డి, పేజీలు 52. వెల: ఒక రూపాయి: ప్రాప్తిస్థానం—తెలుపబడలేదు)

పేరు గొప్ప, ఊరు దిబ్బ అన్నట్లు—పేరుకు రత్నగర్భే అయినా, దరిద్రదేవతకు నట్టిల్లు రాయల సీమ. అనావృష్టివలన, నీటిపారుదల సౌకర్యాల లేమి వలన నిరంతరం కరువు కాటకాలకు గురవుతూన్న ప్రాంతం. వెనుకబడినతనాన్ని నిర్ధారణ చేసే సూత్రీ కరణల ప్రకారం రాయలసీమ చారిత్రకంగా, భౌగోళి కంగా ప్రత్యేక ప్రాంతంగా బ్రిటీషు పాలనకాలంనుండి గుర్తించబడింది. అయితే ఆంధ్రప్రదేశ్ అవతరించి పదునేడేండ్లు అయినా రాయలసీమ అభివృద్ధికి నిర్మా ణాత్మక చర్యలు తీసుకోబడలేదు.

'వ్యక్తిగత ద్వేషాలు, కక్షలు, రాజకీయ ముఠాలు, పదవీ వ్యామోహాలు, ప్రాంతీయ వ్యతిరేకతలు పెనవేసు కొన్న ఈ విభజనోద్యమ' కాలంలో 'రాయలసీమ సమస్యల వాస్తవరూపం కనిపించడం అవసరం అని గుర్తించి'న పై యిరువురు రచయితల నాలుగు వ్యాసాలున్న పుస్తకం 'రాయలసీమ భవితవ్యము'.

తలసరి ఆదాయం, వర్షపాతం, నీటిపారుదల సౌకర్యాలు, విద్యుచ్ఛక్తి వినియోగం, పరిశ్రమాభివృద్ధి, విద్యావిధానం, ఉద్యోగావకాశాలు—ఈ క్రమంలో ఆధార సహితంగా వీరు వివరించిన కోస్తా—తెలంగాణా—రాయలసీమ ప్రాంతాల అసమానతలు గమనించదగ్గవి.

'అధికారం మాకు, ఆర్థికం మీకు—అన్న నీతి సూత్రాన్ననుసరించి, ముఖ్యమంత్రులుగాను, ఆర్థిక మంత్రులుగాను కొనసాగిన రాయలసీమ నాయకులు 'ప్రజలకన్నా పదవులు మిన్న' అని భావించడంద్వారా కూడా ఈ సీమకు ఈ దుర్గతి దాపరించింది.'

అసమానతల తొలగింపునకు, రాయలసీమ అభివృద్ధికి కాలపరిమితిలో కూడిన చట్టబద్ధమైన హక్కులు, రక్షణలు అవసరం.

'సమైక్య ఆంధ్రరాష్ట్రం ద్వారానే రాయలసీమ సమస్యలు పరిష్కరించబడుతాయి' అని గట్టిగా నమ్ముతున్నారు ఈ రచయితలు.

పార్టీ శ్రేయస్సుకు, పదవీ సాధనకు అంకితమైపోయే ప్రజాప్రతినిధులున్న సీమకు సమైక్య రాష్ట్రంలోనూ సమస్యలే; ప్రత్యేక రాష్ట్రంలోనూ సమస్యలే!

ప్రజాశ్రేయస్సు, ప్రగతి సాధన ప్రజాప్రతినిధుల కర్తవ్యం కాగలిగినప్పుడు—ప్రత్యేక రాష్ట్రమైతేనేం; సమైక్యరాష్ట్రమైతేనేం?

'ఈ రచయితలకు ఆర్థికంగానీ, అధికారం గానీ లేవు' అంటున్నారు వ్యాసకర్తలు. వీరికి అవి లేనందువల్ల రాయలసీమ ప్రజలకు నష్టమేమీ లేదు. వీరికున్న అవగాహన రాయలసీమ ప్రజాప్రతినిధులకు లేకపోతేనే నష్టం.

రాయలసీమకు చెందిన రాజకీయ వర్గాలవాళ్లు, రాజకీయాలపట్ల ఆసక్తి వున్నవాళ్లు ఈ పుస్తకం చదవటం మంచిది. రచయితలపేర—అమర జ్యోతి పవర్ ప్రెస్, మార్కాపురం—అని వ్రాస్తే, ప్రతులు దొరకవచ్చునేమో!

'కుముద'



# గ్రంథ స్వీకారము

## క ద లి రా

(ప్రబోధ గీతాలు)

(వివిధ రచయితల పాటల సంకలనం. వెల: 50 పైసలు, 22 పుటలు. ప్రతులకు: అరుణ బుక్ హౌస్, రాష్ట్రపతిరోడ్డు, నిజామాబాదు.)

## శ్రీ కాశీ విశ్వేశ్వర రత్నమాల

(కృతికర్త: శ్రీ ముక్తి నూతలపాటి సీతా రామయ్య, మూల్యము: రూ. 1—00 పుటలు 14, ప్రతులకు: గ్రంథకర్త పేర, కేరాఫ్ ఎమ్. వి. సుబ్బా రావు, శానెటరీ ఇన్‌స్పెక్టరు, రాజా పానుగల్ రోడ్డు, గొడుగుపాలెమునందు, ఒంగోలు.

## మన చరిత్ర—సంస్కృతి—రాజకీయాలు

రచన: శ్రీ జి. వెంకటరామారావు. వెల: 3–50, పుటలు: 88. ప్రతులకు రచయితపేర, 18–3–527 లాల్‌దర్వాజా, అప్సర టాకీసు లేన్ హైదరాబాద్--2.

## ఎ ర్ర మ ట్టి

(సాంఘిక నాటకం)

రచన: శ్రీ ఎస్. జి. రామారావు, వెల రు 2. పుటలు 97, ప్రతులకు: విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, ఏలూరు రోడ్డు, విజయవాడ—2.

## విప్లవాన్ని ఆహ్వానించు

రచన: యలమంచి తాయారు వెల: 2-25, పుటలు 70, ప్రతులకు: విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజయవాడ—2.

## శ్రీ వాసవదత్తా వత్సరాజము

(పద్యకావ్యము)

రచన: శ్రీ శిష్ట్లా రామకృష్ణశాస్త్రి వెల: 3 రూ, పుటలు 96 ప్రతులకు: గ్రంథకర్తపేర ప్రతాపగిరివారి వీధి, బ్రాడీపేట, గుంటూరు—1.

## శ్రీ రామావతారము

(అరణ్య కిష్కింధా కాండలు)

గ్రంథకర్త: శ్రీ దివాకరుని సుబ్బారావు, వెల: 10 రూ, పుటలు 276 ప్రతులకు: శ్రీ వేంకటేశ్వర జ్యోతిష గ్రంథమాల, 7. చక్రపాణివీధి వెస్టు మాంబళం, మద్రాసు—33.

## ఆలమక్ అజ్జిమ్

(సాంఘిక నాటిక)

రచన: శ్రీ టి. ఎ. సూరి వెల: 2–00, పుటలు 78 ప్రతులకు: శ్రీ సుశీల ప్రచురణలు 120, పోలయప్పన్‌వీధి మద్రాస్—21.

## కల్యాణకాములు (కావ్యము)

(ద్వితీయ పుష్పము)

రచన: శ్రీ ఊరిబిండి వేంకట సుబ్రహ్మణ్య శాస్త్రి వెల: రూ. 2–50 పైసలు పుటలు, 74 దొరకుచోటు కృష్ణా అండ్ కో, ట్రంక్ రోడ్డు నెల్లూరు.

———

Printed and Published For Nageswara Rao Estates (Private) Ltd., by S. Nageswara Rao at the Andhra Patrika Press, 6 & 7 Thambu chetty Street Madras-1 Editor : S. Radhakrishna,

# భారతి

## ప్రకటన రేట్లు

| కవరు పేజీలు | | కాజువల్ రేట్లు | కాంట్రాక్టు రేట్లు |
|---|---|---|---|
| 4 వ కవరు పేజీ | ... | రు. 175/– | రు. 150/– |
| 2 లేక 3 వ కవరు పేజీ | ... | | |
| ఒకే (నలుపు) రంగు | ... | రు. 150/– | రు. 125/– |
| **లోపలి పేజీలు** | | | |
| పూర్తి పేజీ | ... | రు. 125/– | రు. 100 – |
| అర పేజీ | ... | రు. 65/– | రు. 55/– |
| పావు పేజీ | ... | రు. 40/– | రు. 35/– |

ప్రత్యేక స్థానములకు 25% అదనం.

సం॥నకు వరుసగా 6 ప్రకటనలు చేయువారికి కాంట్రాక్టు రేట్లు వర్తించును.

## చందా వివరములు

| | | |
|---|---|---|
| సంవత్సర చందా | ... | రు. 12–00 |
| 6 మాసముల చందా | ... | రు. 6–00 |
| విడి ప్రతి | ... | రు. 1–00 |

మేనేజరు, భారతి

మద్రాసు–1.